# డి. ఆర్. ఎస్* కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

## క్రొత్త ప్రెస్టీజ్



**జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?**

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది. నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం. ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రం ద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది. జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది.



**అది ఎలా పనిచేస్తుంది?**

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి. కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది. సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది. అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది.

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అధికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా, భద్రంగా వదలివేస్తుంది.



**జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?**

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు. అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు. దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు, ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు.**




**100% భద్రత**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో. జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.**

ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే. తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా
వాడగలిగే భద్రమైన కుక్కర్ —
అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్
కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**ttk తయారి.**




ప్రెస్టీజ్ . . . భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టిన

– డాక్టర్ జయ్ దుబాషీ

# శ్రీమతి గాంధీ అంటే నమ్మకం తక్కువ

[సుప్రసిద్ధ పత్రికా రచయిత డాక్టర్ జయ్ దుబాషీ పంపే "న్యూఢిల్లీ లేఖ" పాఠకుల ఆదరణని అందుకోనగలదని ఆశిస్తున్నాము. – సం.]

శ్రీమతి గాంధీ అమెరికా వెళ్ళివచ్చారు. ఫలితంగా అధ్యక్షుడు రీగన్ ఆమె పట్ల "మెత్త" బడ్డారని చెప్పబడుతోంది. కాని భారతదేశం, అమెరికా సంయుక్త రాష్ట్రాలు మరింత దగ్గర కాగలవా? చెప్పలేము. దేశాలు వేరు, ప్రభుత్వాలు వేరు. శ్రీమతి గాంధీకి అమెరికాలో ఒక ప్రభుత్వం యొక్క ప్రధానిగా స్వాగతం చెప్పారు. ఆమెకి ఒక దేశం ప్రజల నాయకురాలిగా స్వాగతం చెప్పలేదు ప్రధానిగా ఆమె బాగా నిబ్బరంగా మాటలాడారు. ఒక రాజకీయ నాయకురాలిగా ఆమె ధోరణి వేరేగా ఉంది నంబాయిషి చెప్పుకునే రీతిలో మాటలాడారు శ్రీమతి గాంధీ ఇది సహజమే, ఎందుకంటే అక్కడ విలేఖరులు ఆమెని అత్యవసర పరిస్థితి లేదా ఎమర్జెన్సీని గురించి విన్నో ప్రశ్నలు వేశారు. ఆరు సంవత్సరాల తరువాత అమెరికాలోని విలేఖరులు అత్యవసర పరిస్థితిని గురించి గుర్తుంచుకోవటం విశేషమే అనాలి. భారతదేశంలోనూ మనం ఎమర్జెన్సీని గురించి మరిచిపోలేదు.

దేశాలూ, ప్రభుత్వాలూ ఒకటికాదు. జనం స్నేహంగా ఉన్నా ప్రభుత్వాలు కత్తులు నూరుతూ ఉండవచ్చు. బ్రిటన్ సంగతి తీసుకోండి. శ్రీమతి థాచర్, శ్రీమతి గాంధీ –ఇద్దరూ "ఉక్కు మహిళ"లేట. వారిద్దరికీ మంచి దోస్తీ కుదిరిందట. రెండు ప్రభుత్వాల మధ్యనా ఎంతో కొంత స్నేహభావం ఉంది. కాని, బ్రిటిషు ప్రజలకి భారతీయులంటే ఇష్టం అనగలమా ? విమానాశ్రయంలోనే వలసవచ్చే భారతీయుల ఇబ్బందులు మొదలవుతాయి. చిన్న సాకుమీద వారిని వెనక్కి పంపించివేస్తూ ఉంటారు అధికారులు. బ్రిటిషు పోలీసు వారు మర్యాదగా ఉంటారని పేరు. భారతీయుల పట్ల వారి వైఖరి వేరు. ఒక్కమాటలో చెప్పాలంటే బ్రిటన్‌లో భారతీయులకి స్వాగతం లభించదు – అంత మాత్రాన రెండు ప్రభుత్వాలూ స్నేహంగా లేకపోవటమూ లేదు.

న్యూఢిల్లీ, వెస్ట్ మినిస్టర్‌ల మధ్య సంబంధాలు బాగానే ఉన్నాయి.

అమెరికా సంగతి ఇంకొక విధంగా ఉంది. ఆ దేశంలో ప్రస్తుతం ఉన్నంతమంది భారతీయులు ఎప్పుడూ లేరు. ఏటా వేలమంది భారతీయులు అమెరికాకి వెడుతూనే ఉన్నారు. అక్కడ భారతీయుల మధ్య, ఉన్నత తరగతుల వారికింద లెక్క. బ్రిటన్‌లో అలాగ కాదు. అమెరికాలో భారతీయులు అధికంగా పలుకుబడి కలవారు; మేధావి వర్గంగానూ పలుకుబడి కలవారే ఇదంతా భారతదేశం – అమెరికా సంయుక్త రాష్ట్రాల మధ్య సంబంధాలలో తెలుస్తోందా ? లేదు. తెలియకపోవటానికి చారిత్రకంగానూ, ఇతరత్రానూ కారణాలు ఉన్నాయి. ఏది ఏమయితేనేమి, ప్రపంచ వ్యవహారాలలో దేని విషయంలోనూ ఈ రెండు దేశాల ప్రభుత్వాలూ సాధారణంగా ఏకీభవించవు. శ్రీమతి గాంధీ అమెరికా యాత్ర ఈ పరిస్థితిని మార్చినట్లు తోచదు. ఎందుకంటే ఆమె ఇటీవలే నియంతకి ఉండతగిన లక్షణాలు కలవారనిపించుకున్నారు, దానివలన రెండు ప్రభుత్వాల మధ్యా నమ్మకం కుదరటం కష్టం. వాషింగ్‌టన్‌లో ఆమెని నమ్మరు. భారతదేశంలో సయితం ఆమె అంటే నమ్మకం లేనివారు చాలామందే ఉన్నారు. అమెరికా లోపాలు ఎన్నివున్నా అక్కడ వర్గవిభేదాలు తక్కువ అక్కడి వారికి నియంతలంటే సదభిప్రాయం లేదు. ఇది ప్రజల సంగతి. ప్రభుత్వానికి డిక్టేటర్‌లంటే ఇష్టం అనిపిస్తుంది. శ్రీమతి గాంధీ, వెనుకబడిన దేశాలకి చెందిన ఇతర నాయకులంటే అమెరికాలో ఉన్నత పదవులలో ఉన్నవారికి కొంత మోజు అనుకోనక తప్పదు.

ఇస్రాయెల్‌కి అమెరికాలో అంత మద్దతు ఎలాగ ఉంది ? ఏమిచేసినా ఇస్రాయెల్‌ని అమెరికా వారు ఏమీ అనరేమిటి? దీనికి కారణం అమెరికాలో యూదులు అత్యధికంగా ఉండటమే ప్రభుత్వ స్థాయిలో కూడా ఈ రెండు దేశాలలోనూ ఉండే యూదుల మధ్య స్నేహం బాగా బయట పడుతూ ఉంటుంది.



ప్రభుత్వాలు రావచ్చు. పోవచ్చు. యూదులు మాత్రం వుంటారు కదా! యూరోపు విషయం తీసుకోండి. అమెరికాతో వివిధ దేశాల సంబంధాలలో ఎగుడు దిగుళ్లు ఉండవచ్చు-కాని- రష్యావద్ద సహజ వాయువుని గొట్టాలద్వారా సరఫరా చేసే విషయమయి వచ్చిన పేచీ దీనికొక ఉదాహరణ- యూరోపు అమెరికా ప్రజల మధ్య స్నేహం ఎప్పుడూ ఉండేదే. ఒక అమెరికా వ్యక్తిని (అతను విశ్రాంతిగా ఉన్నప్పుడు హఠాత్తుగా) మీ రెక్కడివారని అడిగితే- ఇటలీవాడినని కాని, అయిర్లాండ్ వాడినని కాని అతను సమాధానం చెప్పవచ్చు. అసలు అతని స్వస్థలం అమెరికాలోనే ఎక్కడయినా ఉంటుంది. కెన్నెడీ సంగతి తీసుకోండి తను అయిర్లాండ్‌కి చెందినవాడినని ఆయనకి గర్వంగా ఉండేది. నిక్సన్‌లాంటి వారు కొందరిని చూస్తే యూరోపులో చిరాకు. కాని ఇలాంటివారు తక్కువ ప్రభుత్వాలు పోయినా జనం ఏమవుతారు?

అందుకనే తారాపూర్ అణు ఇంధనం విషయంలో అమెరికా వారు సరసంగా ఉన్నారని సంతోషించటం తగదు, వాషింగ్‌టన్ వారు ప్రపంచబాంకు చేత వడ్డీ తగ్గించారని సంబరపడటమూ సరికాదు. ఇవి చాలా చిన్న విషయాలు. ముఖ్యమయిన విషయం ఏమిటంటే శ్రీమతి గాంధీ అంటే అంత నమ్మకం లేనివారు అమెరికాలో చాలా మందే ఉన్నారు. వారు పలుకుబడి కలవారు కూడా. శ్రీమతి గాంధీ తమకి ప్రజాస్వామ్యం అంటే విశ్వాసం ఉందని అన్నప్పటికీ వారు నమ్మరు. ఆమె అమెరికాకి వెళ్ళినప్పుడు అక్కడి పత్రికలలో పడిన ముఖ్యమయిన వ్యాసాలు అన్నీ దానిని గురించి ప్రస్తావించాయి. ఇందులో ఆశ్చర్యం లేదు. లండన్ నుంచి వెలువడే "ఎకనామిస్ట్" పత్రిక ఆమెని కొంచెం వ్యంగ్యంగా "సామ్రాజ్ఞి" అని వర్ణిస్తూ ఉంటుంది. ఇది ప్రశంసకాదు. ఆమెకి తగిన బిరుదే. శ్రీమతి గాంధీ అమెరికా సంయుక్త రాష్ట్రాలకి వెళ్ళినప్పుడు ఉత్పన్నమయిన తాత్కాలిక స్నేహాన్ని గురించి కొందరు భట్రాజులు గొప్పగా చెప్పవచ్చు. (వీరు ఇరువయివులా ఉండవచ్చు కాని మన వయిపే ఎక్కువ) కాని ఆమె అంటే ఏర్పడిన అపనమ్మకమే ముఖ్యమయినది. ◉

లోకం పోకడ — ఊరెంక.












# గణేశ గాథలోని ఆంతర్యం

మన పురాణాలలోని కథలు చాలా విచిత్రంగా ఉంటాయి. కాని వాటివల్ల తెలిసే గూడార్థంవల్ల ఆ గాథలు సముచితంగా ఉన్నట్లు తెలుస్తాయి. వీటిని గురించి ఈమధ్య డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ గారు తమ "మన పురాణ సంకేతాలు" అనే చిన్న గ్రంథంలో సంగ్రహంగా తెలిపారు. అందులో గణపతిని గురించి కూడా కొంత చెప్పి ఉన్నారు. అవి యుక్తి యుక్తంగా ఉన్నవి.

గజాననుడు సస్యాధి దేవత. అందువల్లనే అతని బొజ్జ గాదెగా రూపొందించబడింది. ఏకదంతం కోత కోసే కొడవలికి గుర్తు. చెవులు గింజలను తూర్పారబట్టే చేటలకు చిహ్నాలు. సస్యానికి ఆధారం వర్షమే కనుక— వర్షర్తువులోని భాద్రపద మాసంలోనే అతని జన్మదినం నిర్ణయింపబడింది.

భాద్రపద శుద్ధ చవితినాడు సూర్యోదయానికి ముందు వినాయక నక్షత్రం ఉదయిస్తుంది. అందువల్ల వినాయక పూజ అప్పుడే జరగవలసి ఉన్నది. కర్షకులు పొలం మట్టితో విగ్రహాన్ని తయారుచేసి, ఆ ప్రాంతాన దొరికే జిల్లేడు పువ్వులతోనూ, పత్రాలతోనూ ఆ విగ్రహాన్ని పూజించి సమీప ఫలవృక్షాల్లో లభించే నేరేడుపళ్లనూ, వెలగ పళ్లనూ నివేదన పెట్టేవారు. ఆ సంప్రదాయాన్ని అనుసరించే యిప్పుడూ పచ్చిమట్టితోనే అతని ప్రతిమను తయారుచెయ్యడం, జిల్లేడుపువ్వులతోనూ, రకరకాల ఆకులతోనూ పూజ చెయ్యడం, వెలగ, నేరేడుపళ్లు నైవేద్యం పెట్టడం జరుగుతూ ఉన్నది. కాలక్రమంగా పూలతో కూడా పూజ చెయ్యడం, మోదకాలు, ఉండ్రాళ్ళు మొదలైనవి నైవేద్యం పెట్టడం ప్రారంభమై ఆచారంలోకి వచ్చింది. చవితినాడు హస్త నక్షత్రం ఉంటుంది, ఆ నక్షత్రం కలవాడు కనుక వినాయకుడు హస్తి అయినాడు. హస్తి పదానికి ఏనుగు అనే అర్థం వున్నది గదా!

ఆ అర్థాన్ని అనుసరించి అతడు గజాననుడైనాడు. దాన్ని అనుసరించిన తర్వాత గాథలు ఏర్పడి ఉంటాయి.

వినాయకుణ్ణి పూజిస్తే నీలాపనిందలు రావనీ, పూజించకుండా చక్కని చంద్రుణ్ని చూసినా ఎంతటి వానికిన్నీ అవి తప్పవని చెప్పి అతని పూజకు ఎంతో ప్రాధాన్యం యివ్వబడింది. భగవదవతారమూర్తి అయిన శ్రీకృష్ణునికే అలా చంద్రుణ్ణి చూసినందువల్ల నీలాపనింద కలిగిందని కథ ఏర్పడింది. సూర్యుని అనుగ్రహంవల్ల సత్రాజిత్తు సంపాదించిన శ్యమంతకమణిని అతని తమ్ముడు మెడలో ధరించి వేటకు వెళ్లగా సింహం అతనిని చంపి ఆ మణిని తీసుకున్నదనీ, జాంబవంతుడు ఆ సింహాన్ని చంపి మణిని తీసుకున్నాడనీ చెప్పుకునే కథ అందరికీ తెలిసినదే!

ఈ కథకూ జ్యోతిర్గణానికీ ఎంతో సంబంధం ఉన్నది. దేదీప్యమానమైన ఆ మణి సూర్యుణ్ని సూచిస్తుంది. కథలోని సింహం సింహరాశిని సూచిస్తుంది. జాంబవంతుడు సప్తర్షి మండలానికి సంకేతం. పరిశీలనగా చూస్తే ఆ సప్తర్షిమండలాన్ని బట్టి ఆ ఆకారాన్ని ఊహించవచ్చు.

వినాయకచవితికి మర్నాడు — అంటే పంచమినాడు సప్తర్షిమండలంలోని పడమటి భాగం సూర్యోదయానికి ముందు ఉదయిస్తుంది. వీటినన్నిటినీ పరిశీలించి చూస్తే మన ప్రాచీనుల ప్రతిభ, కథా కల్పనలోని చమత్కృతీ వ్యక్తమవుతాయి.

వినాయకుడు బ్రహ్మచారి. అందువల్ల బ్రహ్మచర్య వ్రతంలో వుండే విద్యార్థులకు ఆరాధ్యదేవత. అందువల్లనే విద్యార్థులు ప్రతి సంవత్సరం తొమ్మిది రోజులు అతని పూజలు వైభవంగా జరిపి, ఉత్సవాలు చేస్తారు. ఈ సాంప్రదాయం ఇప్పటికీ మాసిపోకుండా ఆచరణలో ఉన్నది.

బ్రహ్మచారి అయిన గణపతికి బుద్ధి,సిద్ధి అనే ఇద్దరు భార్యలు కల్పించబడ్డారు.అతడు సిద్ధిబుద్ధి ప్రియుడని ప్రసిద్ధి. ప్రియుడంటే 'భర్త' అనే అర్థం తీసుకుంటే సిద్ధిబుద్ధి— అనేవారు భార్యలవుతారు. వాస్తవానికి అతనికి

## ఓ గణాధిప

నీ విగ్రహాలను సైతం విదేశాలకు తరలించే
దేశద్రోహులను నీ తొండాన పట్టి
విసిరేయవయ్య ఓ గజాననాయ
నాయకులమంటూ ప్రజలను వంచించే
నీతి, న్యాయం లేని వారిని నీ దంతాలతో
దండించవేమయ్య ఓ మోదక ప్రియా
లంచాలు మేసి కల్తీలు కలిపే
ఘరానా దొంగలను నీ పాద తాడనాలతో
చల్లార్చవేమయ్య ఓ గణాధిప
దేశానికి కీడు తలపెట్టే ద్రోహశక్తుల
కార్యాలకు విఘ్నాలనీవయ్య ఓ మూషిక వాహనా
మంచి తలపెట్టే ప్రతివారికీ
అవిఘ్న మస్తనవయ్య ఓ విఘ్నరాజ.

— ఇసుకపల్లి సుజాత



బొ్జ్జ గణపయ్య — ఆర్. సత్యవతి.

భార్యలు లేరు. గణాధిపతి మనకే కాదు, సమస్త దేవతలకూ పూజ్యుడు. అతనిని పూజించి నిశ్చల హృదయంతో ధ్యానిస్తే మంచి బుద్ధి కలుగుతుంది. కార్యసిద్ధి కలుగుతుంది.

ఏ కార్యం ప్రారంభించినా మొదట వినాయకుణ్ణి పూజించాలి. లేకపోతే ఆ కార్యం నిర్విఘ్నంగా కొనసాగదు.

దేవదానవులు అమృతం కోసం పాల సముద్రాన్ని మథించినప్పుడు మొదట వినాయకుణ్ణి పూజించకుండా మథనకార్యానికి పూనుకొన్నందువల్లనే మొదట హాలాహలం పుట్టిందనీ, దీనిని గ్రహించి, తర్వాత వారు విఘ్నేశ్వరుణ్ణి పూజించి, తమ పనిని కొనసాగించడంవల్ల అమృతాదులైన ఉత్తమ వస్తువులు లభించాయనీ గాథ ఉన్నది.

శివభక్తులూ, విష్ణుభక్తులూ కూడా గణపతిని పూజిస్తూ ఉంటారు.

[ఈ వ్యాసంలోని చాలా భాగానికి డాక్టర్ ముదిగొండ శివప్రసాద్‌గారి పరిశీలన గ్రంథం "మన పురాణ సంకేతాలు" ఆధారం. ఆయనకు కృతజ్ఞుడను.]

— "అంగీరస"

శౌనకాది మహామునులు నారదమహామునిని సమీపించి 'మునీంద్రా! భూలోకములోని నరులు బహు దుఃఖితులు. వారి దుఃఖములను బాపి, సుఖములనిచ్చు వ్రత మేదియైన యున్నదా? ఉన్నచో ఆ వ్రత విధానం బెట్టిది?'' అని ప్రశ్నించిరి.

నారదమహాముని దరహాసము దళుకు మనగా ''నాయనలారా! మానవులను దుఃఖము నుండి ఉద్ధరించు వ్రతమున్నది. అదియే వినాయక వ్రతకల్పము. అందుకు సంబంధించిన కథను అవధరింపుడు... జంబూద్వీపే, భరతవర్షే... భరతఖండే...''

అంతలో శౌనకాది మహామునులలోని అంధ్రమహాముని ఆవులించి ''బోరుకొట్టకండి స్వామీ!'' అనియెను. ఆ నూతన పద ప్రయోగమునకు అచ్చెరువొందిన నారద మహామునిని గాంచి ''అవును గురూ! మీరు నోరుతిరగని అంత పెద్దమాటలుపయోగిస్తే—మార్కులు రాకపోయినా పరీక్షలు పాస్ అయే ఆంధ్ర అర్భకులు అర్థం చేసుకోలేకపోగా అపార్థం చేసుకోవచ్చు. కనుక మీరు తెలుగు అకాడమీ ఆమోదించిన భాషలో — అంటే నేను మాట్లాడుతున్నట్లు— పాత కథలు కాక కొత్త కథ చెప్పండి'' అని బాలయోగి ప్రార్థించె.

''అట్లు చేసెద. అట్లే చేసెద అలవాటు లేక ఎడనెడ తప్పులు దొర్లినచో సర్దుకొనుడు... భారత్‌లో తెలుగునాట ఒక గ్రామంలో రామారావు మాస్టారు కలడు. రామారావుది సుతిమెత్తని మనస్సు. ఎవరేమి అడిగినా కాదనలేడు. అతని మెత్తనితనాన్ని అలుసుగా తీసుకుని అతని నుండి పదో, పరకో అప్పు తీసుకున్నవాళ్ళు తీర్చకుండానే ఎడముఖం పెడతారు. తీర్చమని గట్టిగా అడగలేడు రామారావు. అతడు ఒకవేళ అడిగినా ''మేం తీర్చేసాం. నీకు జ్ఞాపకం లేదేమో'' అని వాళ్ళు డబాయిస్తే మరి నోరెత్తలేడు! అలా దబాయించినవాళ్ళే మళ్లీ పుట్టెడు దుఃఖం అభినయించి మళ్లీ అప్పు అడిగితే యివ్వకుండా వుండలేడు.

ఈ చేబదుళ్ల బాధ భరించలేక— బదిలీ అయితే బాగుండును. కొత్తఊళ్ళో కొత్తదనం పోయేవరకూ ఎవరూ అప్పులడగరు. అడిగినా తను ఖచ్చితంగా తిరస్కరించవచ్చు— అనుకునేవాడు రామారావు.

దేవుడు అతని ప్రార్థన ఆలకించాడు కాబోలు. కొద్ది కాలంలోనే అతనికి బదిలీ అయింది. ఊరు చిన్నదే. తను పనిచేసే స్కూలుకూడా చిన్నదే. మొత్తం పదిహేను మంది మాస్టర్లు. వారిలో రామారావుకి చిన్నప్పుడు పాఠాలు చెప్పిన అవధానిమాస్టారు కూడా వున్నారు. రామారావు చాలా సంతోషించాడు— ఒక నెల రోజులపాటు.

ఆ రోజు అవధాని మాస్టారు రామారావుని యింటికి పిలిపించారు. భారత, భాగవతాల ప్రాశస్త్యం గురించి ఉద్ఘాటించారు. మన ప్రాచీనసంస్కృతిని ఉద్ధరించవలసిన అవసరం గురించి నొక్కి వక్కాణించారు. మన గొప్పదనాన్ని మనమే ఆదరించకపోతే విదేశీయులేమి ఆదరిస్తారని ప్రశ్నించారు.

ఇదంతా ఎందుకో అర్థం కాకపోయినా గురుభక్తితో రామారావు గంగిరెద్దులా తల ఊపాడు. ఔనని ఏకీభవించాడు. ప్రతి భారతీయుడూ సనాతన సాంప్రదాయోద్ధరణకు కంకణం కట్టుకుని నడుముబిగించాలని ముక్తకంఠంతో మూలిగాడు.

అవధాని మాస్టారు అలవోకగా చిరునవ్వు చిందించి రామారావుకి కాఫీ, టిఫిన్ ఇచ్చారు. ఆయన శిష్యవాత్సల్యానికి ముగ్ధుడయాడు రామారావు. కాని అప్పుడతనికి తెలియదు— రానున్న ముప్పు ఏమిటో, తను ఊబిలో వింత లోతుగా దిగబడిపోయాడో...

టిఫిన్ తిని, కాఫీ తాగి రామారావు కాస్త స్థిమితపడిన తరువాత... అప్పుడు... అసలు విషయానికి వచ్చాడు అవధాని.

''చూడు, రామారావూ! మన సంస్కృతి, భక్తిభావం విదేశాల్లో ప్రచారం చేయడానికి ఆణిముత్యాల్లాంటి భాగవత కథల్ని ఆంగ్లంలోనికి అనువదించి ప్రచురించాలని సంకల్పించాను. ముద్రణ ఖర్చు ఐదువందలవుతుంది. గ్రామస్థులను చేయిచాచి దేహీ అని యాచించడం నా ఆత్మగౌరవానికి సరిపడని విషయం. మన మాస్టార్లంతా తలోక చేయి వేస్తేగాని ఈ పవిత్ర కార్యం గట్టెక్కదు. నీవు సాహిత్య పిపాసివి కనుక నీకే ముందుగా చెపుతున్నా. చంద్రునికో నూలుపోగు అన్నట్లు నీకు తోచిన విరాళం ఈ కాగితంమీద వాయి. జీతాలు వచ్చాకనే డబ్బు యివ్వవచ్చు'' అంటూ తెల్లకాగితం ముందుకు తోసాడు అవధాని.

రామారావు గొంతులో పచ్చి వెలక్కాయ పడింది. తను పత్రికలు, నవలలు తెగ చదువుతాడు. కొన్ని పత్రికలు కొంటూ వుంటాడు. సాహిత్యం కోసం ఆ మాత్రం ఖర్చుచేసే వాళ్ళు ఆ స్కూలులో లేనేలేరు. అందువల్ల తనకు సాహిత్య పిపాసి అని ముద్ర పడింది. ఆ సాహిత్య పిపాస యిలా తన పీక పట్టుకుంటుందని ఊహించలేదు రామారావు. తన బాపతు నూలుపోగు వెల ఎంతో, నిర్ణయించుకోలేక, ఆలోచించి, ఆలోచించి, పది వేసాడు.

కాల్చేసేటట్టు కొరకొరా చూసాడు అవధాని. నీకు పెట్టిన టిఫిన్, కాఫీలు దండుగ— అన్నట్లుందా చూపు. కుంచించుకు పోయాడు రామారావు. అక్కడి నుండి పారిపోవాలనిపించింది. కాని గురుదేవుడు— తన కాలర్ పట్టుకొని మళ్ళీ వెనక్కు ఈడ్చుకొచ్చేటట్టు కనిపించడంతో ఆ ప్రయత్నం మానేసాడు.

''చూడు రామారావూ! సాహిత్య పిపాస గల నీవే యిలా నన్ను అవమానిస్తే మిగిలిన వాళ్ళు పావులాలు, అర్ధలు వేసి నన్నొక ముష్టి వెధవను చేస్తారు. మొట్టమొదటి అంకె ఘనంగా కనిపిస్తే మిగిలిన అంకెలు ఆ వరుసలో వచ్చేస్తాయి. కనుక ఆ 'పది'ని నూట పదహార్లుగా దిద్దు'' ఆజ్ఞాపించాడు అవధాని.

రామారావు గుండె ఝల్లుమంది. చెమట పట్టేసింది. కాళ్ళకింద భూమి వున్నదా, లేదాని చూసుకున్నాడు. అతని అవస్థ గమనించి ''మరేం ఫర్వాలేదు లేవోయ్! నూటపదహార్లు అంకె వెయ్యి, చాలు. డబ్బు మాత్రం అంత యివ్వనక్కర్లేదులే'' అని నవ్వాడు అవధాని.

అతడు కోరిన అంకె వేసి బతుకుజీవుడా అని బయట పడ్డాడు రామారావు.

మర్నాడు స్కూలులో రామారావు వేసిన నూటపదహార్లు చూపించి అందరిచేత బలవంతంగా ఎక్కువ చందాలు వేయించుకున్నాడు అవధాని.

సత్యం మాస్టారి నోరు పెద్దది. చందాల విషయంలో చాల నిర్మొగమాటంగా ఉంటాడు. ''ముష్టెత్తి పుస్తకాలు ముద్రించకపోతేనేం ? నే నొక్కపైసా కూడా యివ్వన''ని మొండికెత్తాడు. ముష్టి అన్న అన్‌పార్లమెంటరీ పదానికి తీవ్ర నిరసన తెలియజేసాడు అవధాని. ముష్టి - అన్‌పార్లమెంటరీ అవునా, కాదా అన్న మీమాంస చెలరేగింది. సత్యం ఆ పదాన్ని ఉపసంహరించుకోలేదు.

## వినాయక వ్రతకథ

"పవిత్ర కార్యానికి ప్రతి ఒక్కరూ తోచిన సహాయం చేయాలి" అని నచ్చజెప్పబోయాడు – వచ్చేనెల తనూ ఒక పుస్తకం ప్రచురించాలని నిర్ణయించుకున్న ఆచారి మాస్టారు

"మిగిలిపోయిన పుస్తకాల్ని తూకానికి కొంటానులే. అదే నేను చేసే సహాయం" అని లేచి చక్కాపోయాడు సత్యం.

జీతాలరోజున గుమ్మం వద్ద కూర్చుని రామారావుతో సహా అందరి వద్దా చందాలు వసూలు చేసుకున్నాడు అవధాని. తన నూట పదార్లు తిరిగి యిచ్చేస్తారు గురువుగారు – అనుకున్నాడు రామారావు. ఆ సాయంకాలం అవధానిగారింటికి వెళ్ళాడు. ఆయన యింట్లో లేడు. నాలుగుసార్లు వెళ్ళినా ఆయన దర్శనం కాలేదు స్కూలులోనే ఏకాంతంగా అడిగాడు.

"వసూలైన డబ్బంతా కాగితం కొనడానికే సరిపోయింది. ముద్రణ ఖర్చులు యింకా వెతుక్కోవాలి అమ్మకాలు అయాక వచ్చిన లాభంలోంచి నీ డబ్బు నీ కిచ్చేస్తానులే" అన్నాడాయన తాపీగా.

ఆ డబ్బు మీద ఆశ ఒదులుకున్నాడు రామారావు. ఘోరమైన మోసానికి గురి అయినట్టు విలవిలలాడి పోయాడు

మరో రెండు వారాలు గడిచాక ఆచారి బయలుదేరాడు. ప్రజాశ్రేయస్సుకోసం తలుపులమ్మ వ్రతకథ, తలుపులమ్మ కీర్తనలు రాసాడట. ముద్రణ చందా కోసం వచ్చాడు. "మీ బోణీ మంచిది రామారావుగారూ! నాకు అవధాని గారంత ఆశ లేదు. ఓ పాతిక యివ్వండి. చాలు" అని కాళ్ళావేళ్ళా పడ్డాడు

పదిపైసల కోసం వేధించే ముష్టివాడిని తిట్టుకొని, తగిలేస్తాం, కాని ప్రజాశ్రేయస్సు కోసం వేధించే వాళ్ళను ఒదుల్చుకోలేం. రామారావు చందా వేయక తప్పలేదు

మరో నెల గడిచాక శాస్త్రి వచ్చాడు రామారావు యింటికి. అమ్మాయి వివాహం తలపెట్టాడు శాస్త్రి. కాని చేతికి డబ్బు అందలేదు. భగవంతుని తలచుకుంటూ నిద్రపోయాడు. "నాయనా! శాస్త్రీ! లేవయ్యా దిగులు చెందకు నా కథ మీద రిసెర్చి చేసి ఒక పుస్తకం రాయి. దానివల్ల

# మీ పాపాయికి అప్పుడే 3 నెలలు నిండాయా?

అయితే ఇక మీదట కేవలం పాలే
మీ పాపాయికి కావలసిన ఐరన్ సమకూర్చలేవు.



## అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వండి

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగి పోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందు వల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్‌గల ఘన ఆహారాలు కావాలి."

—డాక్టర్. సుభాష్ సి. ఆర్య "ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్."

అందుకే, 3 నెలలు నిండాక, మీ పాపాయికి కావలసిన ఐరన్‌ను సమకూర్చగల ఘన ఆహారం ఇవ్వడం ప్రారంభించండి. ఐరన్ మీ పాపాయి రక్తానికి, రోగ నిరోధక శక్తిని ఇవ్వడానికి, శరీర ఆరోగ్యానికి, అతడి పెరుగుదలకూ, వికాసానికి అతి ముఖ్యం. అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వడం ప్రారంభించండి.

ద్రవ ఆహారాన్ని క్రమంగా తగ్గించి ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం ఫారెక్స్. దీనిలో సత్వర పెరుగుదలకు ప్రోటీన్లు; శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు కలవు. అంతేకాదు, ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది. ఇది మీ పాపాయి శరీర ఆరోగ్యానికి మరియు అతడి పెరుగుదలకూ అతి ముఖ్యం.




## ఫారెక్స్

డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్
మీ పాపాయి కోసం పుష్కలంగా ఐరన్ కల ఆదర్శవంతమైన ఘన ఆహారం.

# వినాయక వ్రతకథ

నీకు పుణ్యమూ, పురుషార్థమూ కలిసి వస్తాయి. లే. త్వరపడు'' అని ఎవరో నన్ను లేపినట్లు అయింది. చూతును కదా, ఎదురుగా వున్నది సాక్షాత్తూ కోదండ రాముడు. తెల్లవారుఝామున వచ్చిన కల! నిజమై తీరుతుంది అందుకని రామాయణం మీద రిసెర్చిచేసి అందులో వచ్చే రాక్షసుల పేర్లు అకారాది క్రమంలో క్రోడీకరించి వారు చేసిన రాక్షస కృత్యాలను వర్ణించి, ఆ భగవంతుడు వారిని ఎలా మట్టుపెట్టాడో వివరించ దలచుకున్నాను. పుస్తకం పేరు కూడా నిర్ణయించేను – రామాయణంలో రాక్షసులు – అని [illegible] పేరు రామారావు కాబట్టి ముందుగా నీ వద్దకు వచ్చాను. అవధానిగారికిచ్చినంత నాకిస్తే చాలు...''

తరువాత మాటలు వినిపించలేదు రామారావుకి అతనికి చలిజ్వరం వచ్చేసింది. గజగజ వణికిపోయాడు అవధాని సాంప్రదాయ సముద్ధరణ అన్నాడు ఆచారి ప్రజాశ్రేయస్సు అన్నాడు. ఇప్పుడు శాస్త్రి భగవదాజ్ఞ అంటున్నాడు. భగవదాజ్ఞ తప్పించుకోడం రామారావు తరమా? అతని తాత తరమా?

నూటపదార్లు చందా వేయించుకుని శాస్త్రి బయటకు వెళ్ళగానే రామారావుకి ఈ ప్రపంచం మీద విరక్తి కలిగింది. చచ్చిపోవాలనిపించింది.

ఒంటి స్తంభం మేడ మీదకు – ఎవరికీ అందకుండా–ఎగబాకి పోతున్నాడు రామారావు. పైకి – పై పైకి – దూరంగా, యింకా దూరంగా. మానవ మాత్రుడు కనిపించనంత ఎత్తుకు ... ఎగబ్రాకి గమ్యం చేరుకుని అమ్మయ్య అని నిట్టూర్చేలోగా వికటాట్టహాసం వినిపించి, అదిరిపోయాడు.

"ఓరీ! చందా ఎగవేత దారుడా! చందా వేసి డబ్బు చెల్లించకుండానే చనిపోదామనుకుంటున్నావా? నే నెవరో తెలుసా? నీ లాంటి అధము డొకడు చందా ఎగవేయుట వల్ల నా పుస్తక ప్రచురణ నిలిచిపోయి, ఆ బెంగతో మరణించిన సాహిత్యవేత్తను! [illegible]ప్పుడు సాహిత్య పిశాచి నయ్యాను. చందా ఎగేసి ఆత్మహత్య చేసుకునే అందర్నీ అటకాయించి మళ్ళీ భూలోకానికి పంపివేయడమే నా కర్తవ్యం...పో,భూలోకానికి మళ్ళా'' అంటూ రామారావు చేతుల్ని కారప్పూసలా విరిచేసి, అతనిని లడూలా ఉండచేసి మానవుల మధ్యకు విసిరేసాడు, [illegible] పిశాచి.

కెవ్వున అరిచి కిందకు పడిపోతున్న రామారావు చెవిలో "వినాయకున్ని తలచుకో వ్రతంచేస్తానని మొక్కుకో. శుభం కలుగుతుంది'' అని ఆకాశవాణి అరిచింది. రామారావు అట్లు చేసెను. అతడు కళ్ళు తెరిచి చూడగా ఎదురుగా– సత్యం మాస్టారు రూపం దాల్చిన వినాయకుడు కనిపించాడు.



సత్యాన్ని చూస్తూనే ఉలిక్కిపడ్డాడు రామారావు,

"మీరు కూడా ఏదైనా పుస్తకం రాస్తున్నారా ?" నీరసంగా అడిగాడు.

"అలాంటి ప్రమాదం ఏదీ లేదులే" అన్నాడు సత్యం రూపంలోని వినాయకుడు ఆత్మీయంగా నవ్వుతూ. ఈ చేబదులు రాక్షసుల, సాహితీ పిశాచుల బారి నుండి తనను రక్షించమని వేడుకున్నాడు రామారావు.

"అప్పుని అప్పుతోనే తిప్పికొట్టాలి. చందాని చందాతోనే ఎదుర్కోవాలి" తరుణోపాయం సూచించాడు 'సత్యం'

"అదెలా స్వామీ ?"

"అప్పు అడగడానికి వచ్చిన వాడిని నీవే ముందు అప్పు అడుగు. వాడు పారిపోతాడు. ఇక సాహితీ పిశాచుల సంగతి, నీవు కూడా ఒక పుస్తకం రాయి చందివ్వమని వాళ్లని వేధించు. అంతే. వాళ్లు నీ జోలికి రారు" అని పలికి అంతర్థానం అయాడు సత్యరూపధారి వినాయక. రామారావు అట్లు చేసి అప్పు రాక్షసుల బారి నుండి తప్పుకొనుటయేకాక, సాహిత్య పిశాచుల బారినుండి కూడా రక్షణ పొందెను. అటుతర్వాత అతడు శ్రీ వినాయక వ్రతం ఆచరించి సుఖించెను" అని నారద మహర్షి నుడువగా, శౌనకాది మహామునులు తపస్సు చేసికొనుటకు అడవికి పోయిరి.

వ్రతకథ వినకుండా సుఖముగా నిద్రించుచున్న ఆంధ్ర మహామునిని తట్టి లేపెను బాలయోగి. తరువాత యిద్దరు మా సమశీతోష్ణ చలన చిత్ర ప్రదర్శనశాలయందు ప్రవేశించి సుఖము పొందిరి.



# వారఫలం

## 3-9-1982 శుక్రవారం మొదలు 9-9-1982 గురువారం వరకు

★**మేషం** :— ధన విషయంలో ఈవారం మీకు అనుకూలమే. భారీ వ్యాపారమయితే కొన్ని అనుకూల మార్పులు చేయవలసి ఉంటుంది. చిత్ర రంగంలో పరిశ్రమించే వారికి రాజకీయరంగంలో అలవాటు గలవారికి ఏమంత మంచివారంగాదు. స్త్రీలకు : గృహానందం ద్రవ్యాదాయానికి లోపం లేదు.

★**వృషభం** :— నిరుత్సాహానికి తావివ్వరాదు. అలాంటి పరిస్థితులున్నా అందవలసిన ద్రవ్యం చేతికి రాకపోయినా వ్యవహారాలలో అనానుకూలత తటస్థించినా కలవరపడవద్దు. రానున్న వారాలందు ప్రశాంతత హాయి చిక్కి తీరుతుంది. ఉద్యోగంలో మాత్రం చాలమందికి లాభదాయకమైనమార్పులు రానున్నాయి. స్త్రీలకు: కుటుంబంలో శుభ విషయాలను గూర్చిన చర్చలుండగలవు.

★**మిథునం**:—సంఘంలో సముచితమైన స్థానం లభింపనున్నది. గ్రామ పెద్దరికంలో ప్రశంసార్హములైన మార్పులురానున్నవి. ఆడంబరాలకు, ఇతరులను సంతోషపరచుటకు బంధుప్రీతికి ధనం వ్యయంచేయవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి గమనించాలి. స్త్రీలకు : ఉద్యోగాభివృద్ధి మంచి ఆదాయానికి ఆనందానికి అవకాశం గల వారం.

★**కర్కాటకం** :— ఈవారం వర్తకరంగాలలో ప్రోత్సాహకరంగా ఉంటుంది. నూతన వస్తువులు కొనుగోలు చేయగలరు. నూతనంగా భూమిగాని, ఇల్లు గాని కొనే ప్రయత్నం కూడా చేయగలరు. కొందరకు కళాసాహిత్య రంగాలలో నూతనావకాశాలు లభించగలవు. స్త్రీలకు : అన్నివిధాలా అభివృద్ధి చేకూరుతుంది. నగలు కొనే అవకాశం ఉంటుంది.

★**సింహం** :— 'సంఘసేవ' మీకు ఉగ్గుపాలతో పెట్టినవిద్య. మంచిపేరు తెచ్చుకొనుటకు ఒకవేళ పరుల వలన మేలు పొందుటకు అవకాశం గల వారం. కొందరకు అనుకోకుండా వ్యయం చేయవలసిన పరిస్థితులూ ఉంటాయి. స్త్రీలకు : గౌరవ పదవులు పత్రికా ప్రశంసలకు అవకాశంగలవారం. కొందరకు ప్రయాణాలుండగలవు.

★**కన్య** :— చాల విజయవంతమైన వారం. వ్యాపార వృత్తులందు ఆదాయానికి లోపంలేదు. చాలమంది రక్తపుపోటు వలన అజీర్ణ దోషం వలన ఇబ్బందులకు గురి కాగలరు. స్త్రీలకు : దైవకార్యాలకు అవకాశం, వృత్తి యందు పెంపు లభ్యమయ్యే వారమే, గ్రహించాలి.

★**తుల** :— ధనాభావం ఏర్పడటమే గాక, రుణదాతల వత్తిడి కూడా ఏర్పడగలవారం. అందువలన మనశ్శాంతి లభింపవచ్చు. బహుజాగ్రత్తగా మెలగవలసిన వారం. కొందరకు ఉద్యోగంలో బాధ్యతాయుతములైన మార్పులు రానున్నవి. స్త్రీలకు : కళారంగానుకూలత గలవారం.

★**వృశ్చికం** :—కుటుంబంలో ఖర్చులు అధికమవుతాయి. చేతికి అందవలసిన ధనం అందకపోవటం కూడా గమనించగలుగుతారు. 'ప్రమోషన్' ఆశించిన వారి అంచనా సరిగా నున్నదని ఆనందించగలరు. స్త్రీలకు : నలుగురలో పేరుప్రతిష్ఠలు లభించుటకు, కించిత్తు ఆదాయానికీ అవకాశం గలవారమే.

★**ధనుస్సు** :— చాల విజయవంతంగా వారం కనిపిస్తుంది గాని, తీరా చూస్తే ఏమంత లాభదాయకంగాదు. వ్యాపార వృత్తులందు అభివృద్ది చెప్పవీలులేదు. దూరప్రయాణాలు కూడా కొందరు విషయంలో చెప్పవచ్చు గాని, మానుకోవటం సర్వవిధాలా శ్రేయోదాయకం. స్త్రీలకు : ఉద్యోగాభివృద్ధి, శుభకార్య వ్యవహారములందు చొరవ గల వారం.

★**మకరం** :— అన్నివిధాలా ప్రోత్సాహవంతమైన వారం. చాల కాలంగా నిలచిన పనులు మరలా ప్రగతి పథాన చేరుకొంటాయి. అమూల్యవస్తు సేకరణకు, దైవకార్యాలు నెరవేర్చికొనుటకు సర్వవిధాలా అనుకూల వారం స్త్రీలకు : అధిక వ్యయానికి, అనుకొన్నప్రకారం పనులు జరుగకపోవుటకు నిష్ఠుర వాక్యాలు వినుటకు అనువైన వారం.

★**కుంభం** :— మీరుగావించే వృత్తి బాగా ప్రకాశిస్తుంది. మీరు చేసే ఉద్యోగం ప్రశంసార్హంగా వుంటుంది. క్రయవిక్రయాలలో మీకు లాభదాయకమే. బలవంతంగా కొందరకు ప్రయాణ ప్రస్తావన లుంటాయి. కానిమానుకోవటం శ్రేష్ఠం స్త్రీలకు : సాహితీరంగంలో చిత్రరంగాన సదవకాశాలు ఉంటాయి.

★**మీనం** :— మీకృషి ఫలించి ఉత్తమ ఫలం అందుకోవటానికి ద్రవ్యాదాయానికి అనుకూల వారం. వ్యాపారంలో నూతనావకాశాలు లుంటాయి. క్రయవిక్రయాలందు లాభం కూడా చెప్పదగిన వారమే. స్త్రీలకు : ఉద్యోగంలో అభివృద్ధి పనులు క్రమంగా నెరవేరుటతో ఆనందం, కొందరకు సభాగౌరవం చేకూరగలవారం. గ్రహించాలి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి*




కోపంతో చిందులు తొక్కుతున్నాడు వెంకట్రామయ్య.

'పిల్లనిచ్చుకున్నవాళ్ళకింత అహంకారమా?'

'ఏమయిందండీ ?' — మొగుడెందుకు విరుచుకుపడుతున్నాడో, అది ఎవరిమీదో తెలియని పార్వతమ్మ అయోమయంగా అడిగింది.

'అదేనే ! నీ వియ్యాలవారు.'

'వాళ్ళేంచేశారు ? పెట్టుపోతలవీ సక్రమంగానే జరిగాయిగా.'

పదిమంది బలగంతో, మందీమార్బలంతో వింతో మర్యాదగా తన అత్తగారి హోదాని నిలబెట్టిన వియ్యాలవారి మీద ఆవిడకి ఇసుమంత కూడ ద్వేషంలేదు.

పైగా గడియకోసారి 'వదినగారూ ! బోర్నవిటా తీసుకుంటారా ?'

'అత్తయ్యగారూ ! కూల్ డ్రింక్ తాగుతారా ?'

'అక్కయ్యగారూ ! మరో స్వీటు తినండి.'

'అమ్మమ్మగారికి ఉప్మాలో జీడిపప్పులన్నీ ఏరి కాస్త ఎక్కువగా వెయ్యండి వదినా !'

ఇలా రాచమర్యాదలతో ఊదరగొట్టేసారు పెళ్ళికూతురి మేనత్తలు, వదినలు, మేనమామలు, అక్కయ్యలు, పెత్తల్లి, పినతల్లి, వారి భర్తలు.

నిజంగా అంత బలగం ఉండబట్టే ఎక్కడా తమ చేత చిన్నమాట పడకుండా అగ్గగ్గలాడుతూ, పెళ్ళిపందిరంతా తెగ హడావుడిగా తిరుగుతూ ప్రతీ ఒక్కరూ తమ యింట్లో పెళ్ళిలా, నోట్లోమాట నోట్లో ఉండగానే అడిగిందల్లా ఇచ్చి మాట నిలబెట్టుకున్నారు.

పెళ్ళికూతురు పెత్తండ్రులు, మేనమామలు—పెద్ద ఆఫీసర్లు, ఆ హుందా, మర్యాదా, మన్నన, మంచితనం తను ఇన్ని పెళ్ళిళ్ళు చూసిందిగాని ఎక్కడా చవిచూడ లేదు.

అందుకే పార్వతమ్మగారికి వాళ్ళంతా తమ ఇంట్లో వాళ్ళలా అనిపించారుగానీ, ఆడపెళ్ళి వారిలా అనిపించలేదు.

పైగా పెళ్ళికూతురికి ఎంతెంత విలువైన కానుకలు చదివించారో ! అవన్నీ వియ్యాల వారికే ఉండిపోతాయి. అది వేరే విషయం.

అలాంటి వియ్యాల వారిమీద పెళ్ళి జరిగిన నెల్లాళ్ళకి ఇలా భర్తగారు ధ్వజమెత్తడం కలలోనైనా ఊహించలేదు పార్వతమ్మకి.

'పెళ్ళి అయి నెల్లాళ్ళు తిరక్కుండానే నా మొహం మర్చిపోయాడా నీ కోడలు మేనమామ ? ఎంత ఆఫీసరయితే మాత్రం అంత గర్వమా ?'

మరోగ్లాసు తీసుకొచ్చి, చల్లారబెట్టిన కాఫీగ్లాసు భర్త కందించింది పార్వతమ్మ.

'అబ్బబ్బ ! ఇందాకట్నుంచీ వింటున్నాను. అసలు సంగతి చెప్పక ఆ కోపం ఏమిటి ? విషయం నాతో చెప్పొచ్చుకదా ? అయినా సంగతేమిటో చెప్పకుండా అడిగింది సాధించు కోవడం మీకు మొదట్నుంచీ అలవాటేగా' సాగదీసింది పార్వతమ్మ.

తన పెళ్ళయిన కొత్తల్లో రోషంకోసరి పట్టుతాపితాల కోసం, కోర ... కోసం మొగుడుగారు అన్యాయంగా తన తల్లి దండ్రులను సాధించి కొనిపించుకోవడం ఆవిడిప్పుడు మర్చిపోయి. ఆవిడ మర్చిపోయినా, అందుకే అప్పుడు వచ్చి నప్పుడల్లా మొగుడ్ని దెప్పిపొడుస్తూనే ఉంటుంది.

అసలే ముక్కోపి అయిన వెంకట్రామయ్య గారు మరీ చిటపట లాడిపోయాడు. అసలు సంగతి నిజంగానే మర్చిపోయి.

'అబ్బో తెగ పెట్టేసారులే మీ వాళ్ళు —

అల్లుడిచేత ముష్టెత్తినట్లు ముప్పైఏసార్లు అడిగించుకుని! కొన్న మూడు నెలలకే ముక్కలయిపోయింది ఎంత ఏడుస్తూ ఇచ్చారో ఏమోగాని— ఆ సైకిలు!'

"అవును మరి తమరిగారికి సైకిలు తొక్కడం రాకపోయినా అత్తారిని పీడించాలని తీసుకుని దానిమీద అభ్యాసం మొదలెడితే ఏమవుతుంది? చెట్టుకు గుద్దేస్తే ముక్కలవక ముద్దెట్టుకుంటుందా? మీరు తగిలించుకున్న దెబ్బలకి చాకిరీ చెయ్యలేక చచ్చాను. అయినా అత్తారనేసరికి అంత లోకువ కాబోలు, మా వూరి పాలవాడు వెంకన్నతో గడియ గడియకీ వాళ్ళకి బెదిరింపులు పంపేవారుగా మీ అమ్మానాన్నా— 'అబ్బాయికి అది కొనక పోతే పంపేస్తాం' అంటూ, అదంతా మర్చి పోతాననుకున్నారు కాబోలు" — కొంగు కళ్ల మీదికి పోయింది పార్వతమ్మకి.

వెంకట్రామయ్యగారికి తెలివొచ్చి చల్లబడి పోయారు.

'అబ్బ ఊరుకోవే బాబూ! మనం అత్తా మావలమయినా నీ అత్తారి సంగతులు మర్చిపోవు. అసలు సంగతొదిలేసి ఎక్కడికో కొట్టుకుపోయాం.'

'అదే నేనంటున్నదీను.'

'అదేనే! కొత్తకోడలు నిర్మల పెద్ద మేనమామ కనిపించాడు ఇందాక బజార్లో. తెలియనట్టు మొహం తిప్పుకుపోతే ఒళ్ళు మండుకునచ్చింది. మర్చిపోయాడేమో అనుకో డానికి పెళ్ళి జరిగింది ఈ మధ్యనేగా.'

## అద్దెకివ్వబడును

…'బాగుంది. అతగాడు కాదేమో! మీకసలే చత్వారం. ఎవరిని చూసి ఎవరనుకున్నారో ఏమిటో.'

'ఏమేవ్, నీకు రాచమర్యాదలు జరిపారని తెగ వెనకేసుకు రాకు వియ్యాలవారిని. వాళ్ళకి కళ్ళు నెత్తిమీదికొస్తాయి. నేను బాగానే గుర్తుపట్టాను. పైగా పెళ్ళినాటి ఉదయం మేము పేకాట వేసాం కూడాను. చెంపమీద ఆ ఉలిపిరికాయ— ఎలా మర్చిపోతాను? నేను మరీ ముసలాడ్ని అయిపోలేదేవ్!'— కొంటెగా చూసారు పార్వతమ్మ.

'బాగానే వుంది సంబడం. ఇద్దరు కొడుకులకి పెళ్ళిళ్ళయాయి. తాతగారుకూడా కాబోతున్నారు. మీరు ముసలివారెందు కవుతారు? నేను ముసలిదాన్ని. సర్లెండి నిర్మల మేనమామ ఏదైనా హడావుడిపనిమీద వెళ్తున్నారో ఏంటో.'

'ఎంత హడావుడి అయితే మాత్రం మేన గోడలి వియ్యాలవారిని పలకరిస్తే కొంప లంటుకుపోతాయా? కనీసం ఓ చిరునవ్వయినా నా మొహాన్న పడేయచ్చుగా, ఊహూ! కనీసం గుర్తు పట్టనట్టే వెళ్ళిపోయాడు. నేనేం చిన్న పిల్లవాడినా ఆయన వెంట పడడానికి? పైగా కుర్రాడిలా వేషం మార్చాడు ఛీఛీ! పెద్ద మనిషి తరహాయే లేదు. ఆఫీస రయినా పెళ్ళిలో— చక్కగా పెద్దాపురం పిల్కు పంచెతో లాల్చీతో ఎంత హుందాగా



ఉన్నాడు. ఇందాక బజార్లో చూసానా? ఆ జులపాలు, గడ్డం ఎప్పుడు పెంచాడో? పైగా టైట్ పాంటూ. సరేలే అసలు పలకరించక పోవడమే మంచిది. కుర్ర వేషాలు అన్నీ'

'పోనిద్దురూ మనకి కోడలు పిల్ల, వాళ్ళ అమ్మా నాన్నా ముఖ్యంగానీ వాళ్ల బంధువులు కాదుగా. అతను ఎవరయితే మనకేం పైగా మీ గుర్తింపుమీద నాకంత నమ్మకం లేదు లెండి. మన పెళ్ళయిన కొత్తలో మా తమ్ముడి పెళ్ళి కెళ్ళినపుడు పెళ్ళి పందిట్లో వేననుకుని మా కనకం భుజంమీద చెయ్యి…'

'అబ్బబ్బ! గొంతు తడారిపోయింది, కాస్త మంచినీళ్ళు తెచ్చిపెడుదూ!"

*   *   *

'వదినగారూ! అటు చూడండి ఎ(ఆ పట్టుచీరావిడ మీ రెండో అన్నగారి భార్య కదూ!'— పార్వతమ్మ పట్టుచీరావిడకేసి చూపుడు వేలు సారించింది.

ఆ వేలు— అది బుల్లెట్‌లా కనిపించింది సావిత్రమ్మకి. గతుక్కుమంది మనసులో పట్టుచీర శాల్తీని చూసి

కూతురు నిర్మల నీళ్ళోసుకుంటే పూడిద లిచ్చి తీసికెళ్లడాని కొచ్చింది వియ్యాలవారి యింటికి. నిర్మల అత్తగారు, మావగారు మరీ బలవంతం చేస్తే వాళ్లతోపాటు వాళ్ల స్నేహితులింట్లో పెళ్లి కెళ్లింది సావిత్రమ్మ.

'మరి ఎ(ఆ పట్టుచీరావిడ తన అన్నగారి భార్య అంటుందేవిటి సుజన తల్లి— అదే— పెళ్లికూతురి తల్లి. పోనీ మీరూ వాళ్ళు బంధువు లనుకోవడానికి ఒక కులం కూడా కాదు. మనిషిని పోలిన మనిషంటారా ఏమిటి?'

సావిత్రమ్మ గుండెలో రైళ్ళు పరిగెట్టడం మొదలెట్టాయి. 'ఎంత పనయింది? వీళ్ళు ఇక్కడ దాపురించారేమిటి? తాము చేసిన పని



**అవకాశ వాదం**

అవకాశం లేక గానీ
యింకా అంతైనా
ఆక్రమించేది, ఆకాశం!
పచ్చి అవకాశ వాదానికి
యిదే కదా
ప్రథమ సాక్ష్యం!

— వీయస్సెస్పీ కవిత

వియ్యాలవారికిప్పుడు తెలిస్తే ఎంత అప్రతిష్ఠ? రామ రామ? పెళ్లికి అయిన అప్పు ఎలాగూ అయింది మరో పది వేలు ఎవరి కడుపో కాళ్లో పట్టుకుని తెస్తే పోయేది ఇప్పుడీ ఆపద చుట్టుకోకపోను. అయినా ఈ ప్రయోగం మనింట్లో వద్దండి అంటే ఆయన విన్నారు కాదు డబ్బు కక్కుర్తివాళ్లు అనుకుంటే ఏంకాను? అయ్యో, భగవంతుడా'— ఆఖరి మాట అప్రయత్నంగా బయటకొచ్చేసింది సావిత్రమ్మకి.

కారణం? ఎదురుగా మరో శాల్తీ కనిపించడం? 'వాళ్లెంత ఆనందంగా స్వంత వాళ్లలా కలిసిపోతున్నారు? పెళ్లికూతురి అక్కలాగే ఉందావిడ.'

'ఏమయింది వదినగారూ!' పార్వతమ్మ గాభరా పడింది సావిత్రమ్మ నిస్త్రాణగా కూలబడడం చూసి.

'నీరసంగా వుంది. ప్రయాణం బడలిక. నేనూ, నిర్మల ఇంటికెళ్లిపోతాం, కాసేపు పడుకుంటే కళ్లు తిరగడం తగ్గుతుంది. నిర్మలకూడ వట్టిమనిషి కాదుకదా ఎక్కువ సేపు కూర్చోలేదు.'

'అయ్యో పదండి నేనూ వస్తాను పెళ్లి అయిపోయింది కదా'

'వద్దండీ మేము వెళ్లిపోగలం'— ఎలాగో కూతురి చెయ్యి పట్టుకుని పెళ్లి పందిట్లోంచి బయట పడింది సావిత్రమ్మ.

బయటకొచ్చాక 'నిర్మలా' అంది ఏదో చెప్పబోతున్నట్టు ఫక్కున నవ్వింది నిర్మల.

'నీ అవస్థ నా కర్థమయిందమ్మా, ఇక్కడికొచ్చాక నేనూ ఈ సమస్యను అడపా దడపా ఎదుర్కొంటూనే ఉన్నాను. మావగారికి కూడ ఒకటో రెండో శాల్తీలు తగిలాయి. ఓరోజు అత్తగారి మీద ఇంతెత్తున ఎగిరారుట మన మావయ్య తనని పలకరించలేదని. సరేగాని అమ్మా! మావగారి ఫ్రెండ్స్ అంటే సుజన నాన్నగారు కూడ మన ట్రిక్కే ప్రయోగిస్తున్నట్టున్నారు. పాపం సుజన' అంటూ మళ్లీ నవ్వింది నిర్మల.

'నీకు నవ్వెలా వస్తోందే నిమ్మీ! నాకు ప్రాణాలెగిరిపోతున్నాయి.'

"నాకూ మొదట్లో ఎగిరిపోయాయమ్మా! కానీ నేను తెగించి ఓ రోజు మీ అల్లుడుగారితో చెప్పేసాను—లేకపోతే రోజుకో శాల్తీని 'మీ బావ ఇడుగో, మీ పెదనాన్నిదిగో' అంటూ ఇంటికి తెస్తారేమోనని. ఓ రోజున మీ మేనత్త కొడుకంటూ హిప్పీని పట్టుకొచ్చారు. అతగాడు నన్నుచూసి తెగ మెలికలు తిరిగిపోయాడు. ముందు భయంవేసినా తర్వాత సర్దుకుని ఎలాగో మాట్లాడి పంపేసాను. అదేరోజు రాత్రి ఆయనతో అసలు సంగతి చెప్పేసరికి పగలబడి నవ్వారనుకో. ఆ హిప్పీ నా పెళ్లిలో ఆయనతో తెగ జోకులేసి ఆయన మనసులో ముద్ర పడిపోయాట్ట. అందుకని రోజున బజార్లో కనబడగానే చటుక్కున 'అన్నగారూ' అంటూ భుజం చరిచేసి ఇంటికి పట్టుకొచ్చేసారు బలవంతంగా. మా మావగారికీ ఇలాంటి అనుభవ మయింది గానీ వాళ్లకి తెలియదు పాపం!"

'ఇప్పుడెలాగే' సావిత్రమ్మకి నవ్వు రావడం లేదు.

'ఏం ఫరవాలేదమ్మా! మా అత్తగారు చాల మంచిది. ఏమీ అనుకోరు. అయినా మనలాంటి మధ్య తరగతి కుటుంబాలెంచేస్తాయమ్మా? భేషజం కావాలి. నలుగురిలో చిన్నతనం పడకూడదు. ఖర్చుపెట్టలేం, నిజంగా ఇది కనిపెట్టిన వాళ్లకి దణ్ణం పెట్టాలి'

అన్నంతిని నిశ్చింతగా నిద్రపోయింది నిర్మల. సావిత్రమ్మకి నిద్రపట్టలేదు. అలా నిద్రపట్టక దొర్లుతుంటేనే పెళ్లినుంచి తిరిగొచ్చిన వియ్యంకుడి మాటలు చెవిన బడ్డాయి ప్రక్కగదిలోంచి

'ఇది విన్నావా పార్వతీ! ఎంత విడ్డూరమో! మా విశ్వేశ్వరం కూతురు — అదే సుజన పెళ్లిలో మనం చూసిన పెళ్లివారు అసలు పెళ్లివారు కాదుట.

'అంటే?'

'అంటే ఆ అతిథుల్ని అద్దెకు తెచ్చుకున్నారట. వాళ్లంతా నిజంగా విశ్వేశ్వరానికి, సుజనకి ఏమీ కారుట.

'ఆ!'—నోరు తెరిచింది పార్వతమ్మ.

'అవునే! పెళ్లి సామాన్లు అద్దెకు తెచ్చుకున్నట్టే అతిథుల్ని కూడ అద్దెకిచ్చే కంపెనీలున్నాయట. వాళ్లు మన బంధువుల్లా కలసిపోయి నటిస్తారట మగపెళ్లివారిముందు. ఏమాత్రం పొరబాటూ లేకుండా హుందాగా, మర్యాదగా నటిస్తారట. దానికి కొంతడబ్బు ఛార్జి చేస్తారట. ఇందాక పెళ్లిలో చూసాం కదా ఎవరయినా వాళ్లు పెళ్లికూతురికేమీ కారంటే నమ్మగలమా?'

'నాకేమీ అర్థం కావడంలేదు. ఎందుకీ అతిథులు?'








బులుసు వేంకటరమణయ్య

# మ త సా మ ర స్యం

మతాలు ఎన్నో ఉన్నాయి. వాటి మార్గాలు వేరయినా గమ్యం ఒక్కటే! అదే భగవంతుడు! ఇన్ని మతాలు ఎందుకు వచ్చాయని కొంచెం ఆలోచిస్తే కారణం తెలియకపోదు.

మానవుల స్వరూపం వేర్వేరు విధాలుగా ఉంటున్నట్లే స్వభావం కూడా విభిన్నంగా ఉంటుంది. వారి ఆలోచనలు కూడా పలు రీతుల ఉంటాయి. మతం అంటే ఏమిటి ? సమ్మతమైనది మతం. ప్రతిభావంతులైన ప్రవక్తలు లోకహితం కోసం చెప్పినసూక్తులు సిద్ధాంతాలై విభిన్నమతాలకు దారి తీశాయి. అందువల్లనే హిందూ, మహమ్మదీయ, క్రైస్తవాది మతాలు ఏర్పడి ప్రచారాన్ని పొందాయి. ఇందులో ఏది గొప్పది ? ఏది తక్కువది ? అనే ఆలోచనకే అవకాశం లేదు. అన్నీ సమానమైనవే! కాని తమ తమ మత ప్రచారం కోసం సంకుచిత బుద్ధికల కొందరు ఇతర మతాలను కించపరచి, దూషించడం వల్ల మత కలహాలు ఏర్పడడం, ఉద్రిక్తులైన ఆయా మతాలవారు పోట్లాడుకోవడం జరుగుతున్నది. కొన్ని సందర్భాలలో హత్యలు కూడా జరుగుతున్నవి. మతాభినివేశాలు అనైక్యతకు కారణమవుతూ సుఖజీవనానికి, దేశ పురోగతికీ అడ్డంకులవుతూ ఉన్నవి.

ఒకే మతానికి చెందిన వారిల్లో కూడా ఐకమత్యంలేదు ఆ మతంలోనే అంతర్భేదాలు—వేర్వేరు సిద్ధాంతాలు ఏర్పడి ఐక్యతకు భంగం కలిగిస్తున్నవి. "మనమంతా ఒకటే" అనే భావం ఉన్నప్పుడు "అన్ని మతాలు ఒక్కటే" అనే అభిప్రాయం ఏర్పడాలి ఒక మతంవారు మరొక మతంవారిని తక్కువగా చూడకుండా గౌరవించాలి. మత సంబంధమైన వారి ఉత్సవాలలో వీరూ, వీరి ఉత్సవాలలో వారూ పాల్గొనాలి. అలా జరిగితే పట్టుదల ఉన్న వారు కూడా సడలిపోతారు వారి ప్రయత్నాలు సఫలం కావు. ప్రజాజీవితానికి భద్రత కలుగుతుంది. మత తత్వాన్ని గుర్తించిన వారెవ్వరూ ఇతర మతాలను దూషించాలనీ, ఇతర మతస్థులను హింసించాలనీ చెప్పరు. అందరూ శాంతికాములై ఉండాలనేదే వారి ముఖ్య ప్రబోధం.

దేశాభ్యున్నతికి మతసామరస్యమే ప్రధానం.

## అద్దెకివ్వబడును

'ఓసి వెర్రిమొహమా! డబ్బు ఖర్చు తగ్గడానికే. అంతంత దూరాల్నించి బంధువుల్ని రానుపోనూ ఛార్జీలిచ్చి రప్పించడం, వాళ్లకి పెట్టుపోతలు — ఇవన్నీ అనవసరం ఖర్చులు కదా! మరి ఒక్క బంధువూ లేకుండా దిక్కుమాలిన వాళ్లలా పెళ్లిచేస్తే మగపెళ్లివారి ముందు భేషజమే! అందుకే కొన్ని ఊళ్లలో అతిధుల్ని అద్దెకిచ్చే కంపెనీలు వెలిసాయట. ఆ మధ్య పేపర్లో 'రాజస్థాన్‌లో ఇలాంటి కంపెనీలున్నాయని' చదివినప్పుడు నమ్మలేదు సుమీ! కానీ ఇవాళ కళ్లారా చూసి నమ్మక తప్పింది కాదు!

'బాగుంది, మరి వాళ్లంత ఖరీదైన బహుమతులు చదివించారు ఖరీదైనబట్టలు కట్టుకున్నారు.'

అవి కూడ కంపెనీయే అద్దెకు సప్లయి చేస్తుందిట. అవునూ నిర్మల భోంచేసిందా? అక్కయ్యగారు నిద్రపోయారా ఆవిడ ఒంట్లో ఎలావుంది?'

పార్వతమ్మకి నవ్వు ఆగింది కాదు. 'కొంపదీసి తమ వియ్యాలవారు కూడ ఇలాంటి అతిధుల్ని...'

> **తలా — తోక**
>
> సినీతార వయస్సుకి
> వడ్డీలేని అప్పుకి
> ఎదగని గొర్రెతోక వుంది!
> తెలుగు సినిమాలకి
> ఎన్నికల వాగ్దానాలకి
> తలా—తోక లేనేలేవు!!
>
> — మల్లిడి సత్తిరెడ్డి

సావిత్రమ్మ మొహం గుర్తుకొచ్చి జాలి, నవ్వుకూడ కలిగాయి పార్వతమ్మకి. ఆ నాడు పెళ్లిలో చదివించిన వస్తువులు గురించి నిర్మల ఎప్పుడూ మాట తప్పించడం గుర్తొచ్చిందామెకి.

కోపం రాలేదావిడకి. తన కూతుళ్ల పెళ్లిళ్లు కళ్లముందు మెదిలాయి. 'త్వరగా వాళ్లకీ మూడుముళ్లూ వేయించాలి' అనుకుంటూ వియ్యపురాలిని పలకరిద్దామని లేచింది.

కానీ అప్పటికే ముఖం కన్పించకుండా నిండా ముసుగేసుకుని గాఢంగా నిద్రపోతున్నట్టు ఊపిరి పీలుస్తూ కన్పించింది సావిత్రమ్మ—పార్వతమ్మకి.

గదిలో లైటార్పి, తలుపు చేరవేసి నవ్వుకుంది ముసి ముసిగా పెళ్లిళ్లు కావలసిన ఇద్దరుకూతుళ్లున్న పార్వతమ్మ.



# ఆశాయైశ్వర్య

టి.యస్.యస్.రంగనాథ్

పేరుకు మనుష్యులమై పేరుకు పోయాం
స్వార్థమనే ఊబిలో కూరుకుపోయాం
మనల్ని మనమే మింగేస్తున్నాం
మనిషిని చూస్తే భయపడుతున్నాం
మోసగాడే మోసపోయే మోసపు రోజులివి
ఎవడు మోసగాడో! ఎవడు కాడో!

* * *

మోసాలకు మారుపేరు వాడు వాడి పేరు సముద్రుడు ఏ వ్యక్తిత్వాన్ని యెలా మోసగించాలో, యే వయస్సులో యెలా ప్రవర్తించాలో వాడికి కొట్టిన పిండేకాదు—రుబ్బిన పప్పుకూడ

మధ్యాహ్నం పన్నెండు కావచ్చింది కడుపులో యెలుకలతోపాటు పందికొక్కులూ పరుగెడుతున్నాయి. జేబు చూసుకున్నాడు తొమ్మిదింబావలా వుంది. భోజనానికని బయల్దేరాడు రోజు వాడి అదృష్టం బాలేదు. లేకపోతే ఆ సరికి వాడి జేబులో కనీసం వంద కాయితం వుండేది

"ఏమిటో యివాళ లేవగానే యెడంకన్ను అదిరింది" అనుకుంటూ వెళుతున్నాడు

సముద్రుడికి రెండు గజాలముందు ఖాళీ కొబ్బరి నూనె డబ్బా పట్టుకుని, భుజానికి ఖాళీసంచి తగిలించుకుని నడుస్తున్న ఓ కుర్రాడు కాలికేదో తగిలి కింద పడ్డాడు వాడు యెనిమిదేళ్ల వాడిలా కనబడతాడు కానీ పదకుండేళ్లుంటాయ్. సముద్రుడు సానుభూతితో వాడి దగ్గర ఆగాడు జేబులోంచి పడిపోయిన చిల్లర యేరుకుంటున్నాడు వాడు. సముద్రుడు వాడికి సాయపడ్డాడు. ఏరిన డబ్బు గబగబ లెక్కపెట్టి యింకా పన్నెండు పైసలుండాలి అన్నాడు ఆదుర్దాగా వాడు.

ఇద్దరూ కలిసి కాస్సేపు వెదగ్గా పది పైసలబిళ్ల రెండు పైసలబిళ్ల దొరికాయి ఆనందంగా వాడు సముద్రుడ్నిచూసి నవ్వి డబ్బా, సంచి అందుకున్నాడు.

"నీ పేరేమిటి?" అని ముద్దుగా అడిగాడు సముద్రుడు 'సాయి' అని అంతకన్నా ముద్దుగా జవాబిస్తూ, "మీ పేరు సముద్రుడా?" అన్నాడు మెల్లగా సముద్రుడిలో కెరటాలు గుద్దుకున్నాయ్. "నీకెలా తెలుసు?" నోరు తెరిచాడు సముద్రుడు. సాయి సముద్రుడి చేతి వంక చూశాడు "సముద్రుడు" అన్న పచ్చబొట్టు కుడిచెయ్యిమీద వుంది. సముద్రుడికి నవ్వొచ్చింది

"గట్టివాడివేనోయ్!" అని మెచ్చుకుంటూ సాయి తల నిమిరాడు

సముద్రుడి చేతికున్న ఉంగరం చూశాడు సాయి వెంటనే తన చెయ్యి చూసుకున్నాడు "అయ్యో! నా ఉంగరం" అంటూ చుట్టూ వెతుక్కోసాగాడు.

"ఉంగరమా!" సముద్రుడిలో కెరటాలు పొంగాయి. సాయికన్నా శ్రద్ధగా వెతకసాగాడు "అదిగో" ఆనందంగా అరిచాడు సాయి మూడడుగుల దూరంలో పిల్లల పెట్రన్‌తో వున్న ఉంగరం యిసుకమీద పచ్చగా మెరుస్తూండడం చూశాడు సముద్రుడు అతనిపాదం కదలబోయింది అంతలో సాయి దాన్నందుకున్నాడు.

"ఏదీ చూడనీ" అంటూ సాయిని సమీపించాడు సముద్రుడు నంగి నంగి నవ్వుతో

"అమ్మా! నేనివ్వను" అంటూ ఉంగరాన్ని అటు తిరిగి వేలికి పెట్టుకుని చేతిని నిక్కరు జేబులో కుక్కేశాడు సాయి.

"వీడు గట్టి పిండమే!" అనుకున్నాడు సముద్రుడు

ఉక్కు పిండాల్నే లెక్క చెయ్యని సముద్రుడికి వీడొక లెక్కా!

సాయి కొట్టువైపు నడిచాడు

సముద్రుడు అక్కడే నిలబడి సాయివైపు చూస్తూ జేబులోంచి చార్మినార్ సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టె తీసి సిగరెట్ వెలిగించి గట్టిగా దమ్ము పీల్చాడు. సముద్ర తరంగాలకు వాయుదేవుడు బలమిచ్చేలా సముద్రుడిలోని కెరటాలకు తోడ్పడతాడు చార్మినార్ పొగదేవుడు. ఆ రోజు అతనికి తగిలిన మొదటి కేసదే. ఆ వుంగరాన్నెలా కాజెయ్యాలా అన్న ఆశ అప్పటిదాకా వేధించిన ఆకలిని మింగేసింది "వీడంత తెలిగ్గా మోసపోయేలాలేడే. ఎలా ?" అనుకుని తన పథకాల పట్టీని తిరగేసుకోసాగాడు.

సాయి యిచ్చిన వెచ్చాల లిస్టు చూసి పొట్లాలు కడుతున్నాడు కొట్టతను. కొట్టుముందు నుంచుని చాక్లెట్లు, బిస్కట్లు వున్న సీసాలవైపు ఆశగా చూస్తున్నాడు సాయి కొట్టుకు కాస్త దగ్గరగా వచ్చి దమ్ముకొడుతూ సాయి వంక చూస్తున్నాడు సముద్రుడు గంభీరంగా

కొట్టువాడు పొట్లాలన్నీ సాయి సంచిలో వేసి

# వినతి

స్వాగతము గణపతీ!
స్వాగతము నీకిదే!
రారమ్మ విఘ్నేశ!
రమ్మ మా ఇంటికి

ఏనుగూ వదనముతో
ఏకదంతము దాల్చి
ఎలుక వాహనమెక్కి
వేగమే రారమ్మ

విఘ్నాల కధిపతివి
ఎలుకనే యెక్కెదవు
కుడుములను ఉండ్రాళ్ళు
కూర్మితో మెక్కెదవు.

పానకము వడపప్పు
పనసమామిడిపళ్ళు
పళ్ళేరములను నింపి
భక్తితో నీకిడుదు

ముంగిట్లో ముత్యాలు
ముదమార జల్లితిమి
ప్రేమతో పిలిచితిమి
ప్రియమార రావయ్య

పాలవెల్లిని దెచ్చి
భక్తితో గట్టాము.
పత్రియును పుష్పాలు
పళ్ళాల నింపాము

కుడుములను ఉండ్రాళ్ళు
కూర్మితో నీకిత్తు
విఘ్నాల పోద్రోలి
విద్యలను మాకిమ్ము

విద్యతోనే మాకు
వినయంబు నొసగుమా
వినయ మొసగని విద్య
హేతువగు నాశముకు

బొజ్జగల దేవుడవు
గుజ్జువేల్పువు నాదు
బుద్ధిమంతులలోన
పొసగ శ్రేష్ఠుడవౌదు

వ్యాసముని చెప్పంగ
వ్రాసితివి భారతము
గంటమాపక వ్రాయ
గైకొంటి వొక వ్రతిన

బుద్ధిమంతులలోన
పోటి యెవ్వరు నీకు
కొమరునే ఓడించి
కూర్చుంటి గద్దెపై

ఏ కార్యమునకైన
విఘ్నములు రాకుండ
ప్రథమమున అర్చింత్రు
ప్రమదాధిప ! నిన్ను

భాద్రపద చతుర్థిని
పగటివేళను నిన్ను
ముల్లోకముల ప్రజలు
ముదముతో పూజింత్రు

ప్రణవంబు నీ రూపు
పరమంబు నీ పదము
నిత్యంబు నినుగొల్వ
నిర్వాణ సుఖమబ్బు

ఏకవింశతి పత్రములతో
ఎంతో భక్తిని పూజసేతును
సకల సంపద లిచ్చి బ్రోవుము
సౌఖ్యములతో మమ్ము గణపతి

—చీమకుర్తి వెంకటేశ్వర్లు

యెంతయిందో చెప్పగా సాయి యిచ్చాడు సాయి చేతిలో ఓ అర్ధరూపాయి మిగిలింది

అది కొట్టతనికిస్తూ, "ఆ చాక్లెట్లు రెండు కావాలి" అంటూ కేడ్‌బరీస్ చాక్లెట్లున్న సీసా వైపు చూపించాడు

కొట్టతను, "రెండు రావు నాయనా! ఒక్కొక్కటి నలభైపైసలు" అనేసరికి సాయి నిరాశతో,

"సరే ఒకటే యివ్వండి" అని చాక్లెట్‌తోపాటు పదిపైసలు తీసుకుని సరంజామాతో అక్కడినుండి కదిలాడు

"దొరికాడు నాయాలు!" అనుకున్న సముద్రుడు సిగరెట్ విసిరేసి కొట్టుదగ్గరికివచ్చాడు జేబులోంచి తొమ్మిది రూపాయలు తీసి కొట్టతని కిచ్చి కాడ్‌బరీస్ చాక్లెట్లు యెన్నొస్తే అన్నివ్వమన్నాడు అతను ఇరవైరెండు చాక్లెట్లు ఓ ట్రాన్స్‌పెరెంట్ ప్లాస్టిక్ కవర్లోవేసి సముద్రుడి కందించి ఇరవైపైసలు రిటర్న్ చేశాడు

తినేస్తే అయిపోతుందన్నట్లు సాయి చేతిలోని చాక్లెట్‌ని చూసుకుంటూ వెళుతున్నాడు వాడి చుట్టుపక్కల ఎవ్వరూలేరు సముద్రుడు ఒకటో కాలం పరుగులో సాయిని చేరుకున్నాడు సాయి సముద్రుడ్ని చూసి నవ్వాడు ఆ వెంటనే వాడి దృష్టి చాక్లెట్లమీద పడింది

"అదెవరికి?" అన్నాడు వాడాశగా

"నాకు నీలాంటి బుల్లి తమ్ముడున్నాడు. వాడికవంటే చాలా యిష్టం" కల్పించాడు సముద్రుడు

"నాకూ చాలా యిష్టం" సాయి వాటివైపే చూస్తున్నాడు

"కావాలా?" ఆశ చూపాడు సముద్రుడు.

"ఇస్తారా" ఆశపడ్డాడు పాపం! సాయి

"మరిని నీకిచ్చేస్తే, నువ్వు నాకేం యిస్తావ్?" అన్నాడు సముద్రుడు చుట్టూ ఓసారి చూసుకుని దూరంగా ఎవరో ఆడమనిషి ఇటుగా వస్తూండడం సముద్రుడు చూడకపోలేదు

"నా దగ్గరేం లేదే" అన్నాడు సాయి అమాయకంగా

"మా తమ్ముడికి ఉంగరం అంటే భలే యిష్టం" సముద్రుడిలో కెరటాలు క్రమంలో ప్రవహిస్తున్నాయి

సాయి ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు

"ఉంగరం యిస్తే 'అన్నీ' యిచ్చేస్తారా?" అని అడిగాడు సాయి కొండంత ఆశతో

"ఓ" సముద్రుడు వాడి ఆశకు ఆజ్యం పోశాడు వెంటనే సాయి చేతిలో వున్న మానెడబ్బా కిందబెట్టి ఆ వేలికున్న వుంగరాన్ని తీసి చేతో పట్టుకుని "ముందు చాక్లెట్లు యివ్వండి" అన్నాడు తెలివిగా

సముద్రుడు నమ్మకంగా వాడి చేతికందించాడు

సాయి ముఖంలో ఆనందం వెల్లివిరిసింది మాట ప్రకారం సాయి ఉంగరాన్ని సముద్రుడికిస్తూ అటువైపు వస్తున్న ఆడమనిషిని చూసి "అమ్మో! మా అమ్మ" అన్నాడు

సముద్రుడు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండ ఆ వుంగరాన్నందుకుని క్షణంకూడ అక్కడుండక దాన్ని జేబులో వేసుకుంటూ, వెనుదిరిగి చూడకుండా చకచకా వెళ్లిపోయాడు

'అమ్మ' అన్న ఆడమనిషి సాయి వైపు చూస్తూ ఏ సంబంధమూ లేనట్లు అతని పక్కనుండి వెళ్లిపోయింది

సాయి నవ్వుకుంటూ సముద్రుడివైపు చూశాడు సముద్రుడు నాలుగో కాలంలో నడుచుకు పోతున్నాడు సాయి సంతోషంగా యింటి ముఖం పట్టాడు

■ ముందురోజే సాయి తండ్రి రూపాయిన్నర పెట్టి కొనిపెట్టిన 'ఇత్తడి వుంగరం' అది — అని సాయికి బాగా తెలుసు ●



# విఘ్నరాజు వినాయకుని గాథలు!



దేవి గణపతి

భారతదేశంలోనేగాక ప్రపంచమందలి వివిధ దేశాలలో ఆరాధన అందుకొనుచున్న ఒకే ఒక దేవుడు వినాయకుడు. కొందరీ స్వామిని ఆర్య దేవతయని, అనార్యదేవతని, మరికొందరు ఈతడు సాక్షాత్తు శివుని ప్రతిరూపమని భావిస్తున్నారు. ఈతడి ఆకారము నాగలిని పోలియుండి, గడ్డి మోవు, చేటచెవులు కలిగియుండుటచే సస్యదేవతని, కొందరీతడు చీకటిని పారద్రోలి జగత్తుకు వెలుగును ప్రసాదించే సూర్యభగవానుడి ప్రతీకయని, ఇంకా కొందరు అపర శ్రీకృష్ణుడని, ఆటవికులు జంతు జాతికి చెందిన వాడని, బౌద్ధులు అవలోకతేశ్వరుడని, దేవి ఉపాసకులు పార్వతి ప్రతిరూపమని తలంచి కొలుస్తున్నారు. వినాయకుడు ఓంకార స్వరూపుడని ఈ శబ్దము బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల సంగమమని అందుచేత త్రిమూర్తుల కంటే ఈతడు పవిత్రుడని అంటున్నారు.



మూషికా [అకుహురథ] రూఢ గణపతి

## పార్వతి శాపం!

వినాయకుడి జననాన్ని గురించి అనేక కథలు ప్రచారమందున్నాయి. పూర్వము శంకరుడు సోమనాథ ఆలయమందు లింగ రూపమున వేంచేసిన తనను భక్తులు పూజించి మెప్పించినచో వారికి వైకుంఠ ప్రాప్తి కలుగునని వరమివ్వగా, భక్తులు స్వామి ఆనతిమేరకు అతడిని పూజించి దేవలోకమునకు తండోప తండములుగా వెళ్ళుచుండగా, ఇంద్రుడు భయపడి, తక్కిన దేవతలను వెంటబెట్టుకొని పరమేశ్వరుని, అతడు ప్రజలకిచ్చిన వరాన్ని ఉపసంహరించుకోమనగా, అది తనకసాధ్యమని, చింతాక్రాంతుడై ధ్యానముద్రలోనికెళ్ళగా, అతడి నుదుట నుండి ఒక తేజస్సు వెలుపలికి రాగ, అందుండి ఒక మహా యోధుడైన బాలుడుద్భవించినాడు. ఆ బాలుని రూపురేఖలకు అసూయ చెందిన పార్వతి 'తన ప్రమేయం లేకుండా జన్మించిన ఈ బాలుడు, ఏనుగు తల, బానకడుపు, పొట్టి కాళ్ళతో వికృతంగా వుండుగాక' అని శపించినది. మహేశ్వరుడు భార్య శాపమును నివారించలేక వికృతంగా తయారైన ఆ బాలునికి 'వినాయకుడని' పేరిడి మానవులు తన్ను సేవించి దేవేంద్రలోకము ప్రవేశింపకుండా విఘ్నములు కలుగజేయమన్నాడు. అందుచేత గణేశుడు 'విఘ్నరాజ'య్యాడు.

## శ్రీకృష్ణుని అంశ

వరాహ పురాణం ప్రకారం, పార్వతీదేవి పుత్ర సంతానము లేనందున శ్రీకృష్ణుని సలహా మేరకు పుత్రప్రాప్తి నొసంగెడి పుణ్యక వ్రతమాచరించినను ఫలితము లేనందున చింతాక్రాంతురాలై యుండగ ఒకరోజు అశరీరవాణి "అమ్మా! నీకు సాక్షాత్తు శ్రీకృష్ణుడే పుత్రుడుగా జన్మించినాడని" పలుకగా ఆశ్చర్యముచెందిన దాక్షాయణి తన పడకటింటికెళ్ళి చూడగా బంగారు కాంతు లీనుచున్న బాలుడు ఆమె పాన్పుపై కేరింతలాడుచుండెను. ఆమె తనకు కల్గిన అదృష్టమును, తక్కిన దేవతలకు తెలియజేసి వారిని తన బిడ్డను దీవించమనగా, సకల దేవతలు దీవించుచుండగా, శనీశ్వరుడు మాత్రము తలవంచుకొనియుండ, పార్వతి అతడిని తన బిడ్డను చూడమంది. అయిష్టముగానే శనీశ్వరుడు ఆ బిడ్డను చూడగా, అతడి శిరస్సు పగిలి శరీరమునుండివేరై ఎక్కడికో వెళ్ళిపోయిందట. జరిగిన విపరీతమునకు తక్కిన దేవతలందరు వగచుచుండగా, శ్రీహరి వాహనారూఢుడై వెళ్ళి పుష్పభద్రానదీ తీరాన, ఉత్తరదిశగా తలపెట్టి నిద్రించుచున్న ఒక మగఏనుగు తలను నరికి తెచ్చి బాలుని మొండెముపై పెట్టి ప్రాణము పోసినాడట. ఆనాటి నుండి వినాయకుడు గజవదనుడైనాడు. ఇతడు శ్రీకృష్ణుని అంశచేత జన్మించినాడని భాగవతులు 'భగవత్‌గీతను' 'గణేశగీత' అని వ్యవహరిస్తారు.

## గజముఖాసురుని వరం!

గణేశుడు ఏకదంతుడు. పూర్వము గజముఖుడనే రాక్షసుడు శివుడివద్ద చావులేకుండా వరాన్ని పొంది, దేవతలందరిని భయపెట్టి తనఎదుట గుంజిళ్ళు తీయమన్నాడట. బాధలకు తట్టుకోలేక దేవతలు శివుణ్ణి ప్రార్థించగా అతడు తన అశక్తతను తెలియజేసి వినాయకుణ్ణే వేడమనగ, దేవతలమొర ఆలకించిన గణేశుడు గజముఖునితో పోరుకు సిద్ధపడగ, వారి యుద్ధములో వినాయకుడి దంతమొకటి విరిగినది. ఉగ్రుడైన వినాయకుడు విరిగిన దంతాన్ని మంత్రించి రాక్షసునిపైకి విసరగ అది వానిని నానాహింసలు పెట్టగా, వాడు ఎలుక రూపముదాల్చి కన్నంలో దూరాడు! రాక్షసుని పాట్లుచూసి జాలిపడి ఇక ముందు బుద్ధిగా బ్రతకమనగా వాడు "స్వామీ! ఈ రూపముతో నీ సేవచేసి నా జన్మసార్థకము చేసుకొంటా. అయితే పూర్వమువలె దేవతలు నా ఎదుట గుంజిళ్ళు తీయునట్లు వరమివ్వ, మనగా స్వామి అంగీకరించుటచేత, ఆనాటినుండి వక్రదంతుడు, మూషికవాహనుని ఎదుట గుంజిళ్ళు తీయుట అలవాటైనది.

గణేశారాధన భారతదేశంలో ఎప్పుడు ప్రారంభమైనదో ఖచ్చితముగా తెలియదు. క్రీ. శ. 2వ శతాబ్దపునాటి కుషాను చక్రవర్తి హువిష్కుని నాణెముపై బ్రాహ్మలిపిలో 'గణేశ' అనే పదమున్నదట. ఆపైన క్రీ. శ. 4వ, శతాబ్దపు సముద్రగుప్తుని అలహాబాదు శాసనమందు 'గణపతినాగ్గ' అనే రాజు పేర్కొనబడినాడు. ఆ కాలమందే, ఉత్తర భారతదేశమందు వినాయకుడికి అనేక ఆలయాలు నిర్మింపబడినాయి. అయితే గుప్తుల అనంతరం క్రీ. శ. 8వ శతాబ్దమువరకు వినాయకుని ఉనికి తెలియడము లేదు. దక్షిణదేశంలో పల్లవుల నాటినుండి వినాయకుడి ఆరాధన విజృంభించి, విజయనగర రాజుల కాలం నాటికి పరాకాష్ఠనొందినది

గణేశుడు భారతదేశమందు ప్రాముఖ్యాన్ని సంపాదించుచున్నప్పుడే ఇతర దేశాలలో కూడ ఈ దేవతారాధన ప్రారంభమైనది.

## బౌద్ధంలో వినాయకుడు!

పూర్వము భారతీయులు విదేశాలకు వలస వెళ్ళినపుడు, తమ ప్రయాణములకు విఘ్నములు



కలుగకుండ వుండుటకై, వినాయకుని తమవెంట తీసుకొని వెళ్ళుటచేతను, హిందూ రాజులు చుట్టుపట్ల వున్న రాజ్యాలను జయించి హైందవ మతాన్ని ఆయా దేశాలలో ప్రవేశపెట్టుటచేతను, వినాయక పూజ అనేక దేశములందు విస్తరిల్లినది. కుషానుల తర్వాత బౌద్ధమతము, మహాయాన సిద్ధాంతమును ప్రవేశపెట్టి విగ్రహారాధన మొదలు పెట్టినందువల్ల బౌద్ధులు కూడా ఈ స్వామిని తమ మతంలో విలీనం చేసుకొన్నారు

### శక్తికి ప్రతిరూపం !

వినాయకుడు అజన్మ బ్రహ్మచారి అని కొందరు, ఆతడికి సిద్ధి, బుద్ధి అనే భార్యలున్నారని, సిద్ధివల్ల 'క్షేమ' బుద్ధివల్ల 'లాభ' అనే కుమారులను కలిగి యున్నాడని మరికొందరి సిద్ధాంతము కాగ, శక్తి



హేరంబ గణపతి

ఉపాసకులు ఈతడిని 'గణేశాని' అనే స్త్రీ దేవతయని పూజించుచుండగా, కొంతమంది శైవులీతడిని ఉచ్ఛిష్ట గణపతి (దిగంబరముగా వుండి దేవిని తొడపై వుంచికొనివున్న) రూపమున క్షుద్రశక్తిగా ఉపాసించుచున్నారు.

భాద్రపద శుద్ధ చవితినాడు, వినాయకుడనే నక్షత్ర సముదాయం ఆకాశమందు కనిపించునని, ఆనాడు వినాయకుని పూజిస్తే అష్టసిద్ధులు సమకూడునని కార్తాంతికుల ప్రగాఢ విశ్వాసము

[హేరంబ గణపతి ఛాయాచిత్రాన్ని ఇచ్చిన శ్రీరామమూర్తికి కృతజ్ఞతలు ]

— పి. కృష్ణమూర్తి *



# సీరియల్
# కాలంకరిబాక
## వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

తను వెళ్ళేసరికి కొడుకుగానీ కోడలు — బలవంతానా అంటగట్టినదయితేనేం గనక — కొడుకు భార్యని కోడలనక తప్పదుకద — సోఫియాగానీ లేరు

"పొద్దుటాల్నే పట్నం ఎల్లారు మాపిటికి రెండాటలూ చూసుకుని ఆఖరి బస్సులో వస్తారు." అని తనకి సమాచార మందజేసిన ముసలిది ఆ ఇంట్లో పనిమనిషిట

"ఎవరు బాబూ తవరు?" అని ప్రశ్నించి డాక్టరుగారి తండ్రిగా తెలుసుకుని, "లోపలికి వచ్చి కూకోండి" అని ఏమి చెయ్యటమా అని సంకటంలో పడిపోయిన తనని ఆహ్వానించింది దాని పుణ్యాన. పిల్లలిద్దర్నీ చూస్తూండమని ఇల్లు దానికి అప్పగించి వెళ్ళారట

చేసేదేముంది దానివెనకనే గుమ్మంముందు మెట్లెక్కి ఇంట్లోకి వెళ్ళాడు

ఇల్లా అది? బందిలదొడ్డిలా వుంది, తుఫాను తరవాత తోటలా వుంది, విద్యార్థుల అలజడి అనంతరం మెయిన్ బజారులా వుంది

ముందు గది డ్రాయింగ్ రూముగా వాడేది అయ్యుంటుంది అక్కడున్న ఫర్నిచరూ, డెకరేషన్ పీసెస్ గట్రా అన్నీ ఖరీదుగానే కనబడుతున్నాయి. కాని పటాటోపంగా కనిపించాలనే మోజే తప్ప అందుక్కావలిసిన జాగ్రత్త, నేర్పూ, ప్రయత్నమూ ఉన్నట్టు లేదు

ఏ ఒక్కటీ వుండాలిసిన స్థానంలో లేదు తిరగబడినవి కొన్ని, గిరవాటేయబడినవి కొన్ని, విరిగినవి కొన్ని, ఆ స్థితికి ఎంతో దూరం లేనివి కొన్ని అన్నిటిమీదా అరంగుళం మందాన దుమ్ము

రేడియోమీద ఒలిచిన బత్తాయితొక్కలు, అస్తవ్యస్తంగా పడేసిన టీపాయ్‌మీద టీ మరకలు, గదినిండా చిందరవందరగా సిగరెట్ పీకలు

ఆ గదే శుభ్రం చేసి ఆ వస్తువుల్నే క్రమంలో అమరించినట్టయితే అందంగా హుందాగా వెలిగిపోయుండేది. ఆ క్రమం లేకపోవటాన కిచాటుగా, గలీజుగా వుంది

చిరాగ్గానే అనిపిస్తున్నా ఎంతసేపని నిలబడగలడు —? మురివేళ్ళలో సోఫాలో వున్న మాసిన బట్టలు అవతలికి నెట్టి కూచోబోతూ, "పిల్లలేరి?" అనడిగాడు

తననే పట్టిపట్టి చూస్తున్న ఆ ముసలిది, "దొడ్లో ఆడతన్నారు తీసుకొత్తా నుండండి" అంటో వెళ్లి రెండో క్షణంలో దాదాపూ ఈడ్చుకొచ్చింది ఆ ఇద్దర్నీ

మట్టికొట్టుకుపోయున్నారు ఇద్దరూ నూనెపోగు లేదు ఒంటిని తలంటి ఎన్నాళ్ళయిందో జుట్టు అట్టలు గట్టిపోయింది విలువైనవైనా సవ్యంగా వర్ది జాగ్రత్తగా వుంచుకునే శ్రద్ధ లోపించటం వల్ల ఆ ఇంట్లో వస్తువులు ఎలా శిధిలావస్థకు వస్తున్నాయో — అలాగే కనుముక్కు తీరు చక్కగానే ఉన్నా సరైన ఆలనా పాలనాలేక అలగాజాతి పిల్లల్లా వెలా తెలా పోతున్నారు వాళ్ళు

పెద్దవాడిది పచ్చటి ఛాయ; నల్లగా వుంగరాలు తిరిగిన జుట్టు; అక్కుపిడతలాంటి బుల్లి నోరు కొంచెం పొడుగ్గా వుండే ముక్కు — చిన్నప్పుడు మురళి సరిగ్గా ఇలాగే వుండేవాడు.

చూడగానే వీడు నా వారసుడు అనిపించింది వాత్సల్యం నిగ్రహించుకోలేక అమాంతం రెండు చేతులా ఎత్తి సందిట చేర్చుకున్నాడు

క్షణం బిత్తరపోయి మొహంలోకి తేరిచూసి కొత్త మొహమనిపించి కాబోలు విదిలించుకుంటూ గిలగిల్లాడి క్రిందికి జారాడువాడు

రెండవవాడు తల్లిపోలిక, నలుపేగానీ పుష్టిగా ఆరోగ్యంగావుండి చురుకు కళ్ళతో పులుకూ పులుకూ చూస్తున్నాడు తనవి

"వాళ్ళనలా బయట వదిలెయ్యటమేనా — ఎలా దుమ్ములో పొర్లాడేరో చూడు వెళ్ళి నీళ్ళు పోసి తీసుకురా" అని మందలించేటప్పటికి, "పట్టుకుంటే ఆగరయ్యా ఏంచేసేది" అంటూ గొణిగి మొత్తానికి ఒళ్ళు కడిగి తీసుకువచ్చింది దగ్గరే కూచో బెట్టుకుని ఆడించుకోసాగింది తనట్లా పేపరు పుచ్చుకుని ఆ సోఫాలోనే జార్లగిలబడ్డాడు

ఆ ముసలిది వాగుడుకాయ చానాళ్ళకి తన మాట తెలిసినవాణ్ణి కనబడ్డ ఉత్సాహానికి పెద్దతనం చాదస్తం తోడయి దాని వాగుడు తనానికి ఊపి రొచ్చింది తన దృష్టి పేపరుమీద నిలవనిచ్చింది కాదది ఏవేవో చెబుతూనే వుంది. చెదురు మదురుగా ఏవో అడుగుతూ తను "ఊ" కొట్టాడు

దానివెనకన నా అన్నవాళ్లెవరూ లేరట అనాథ పక్షి అయిన తనని ఈ ప్రాంతాన భాష వేరవటాన ఇబ్బంది అవుతుందని క్రితంలో వుండి వచ్చేసిన పూర్నించి తీసుకొచ్చుకున్నారట

పిల్లలిద్దరికీ దాని దగ్గరే చేరిక ఎక్కువట మూడేళ్ళబట్టీ ఇంట్లో మనిషిలా కలిసిపోయున్నదట

నెల్లాళ్ళ కిందట పులకరమొచ్చి వారంరోజుల పాటు పడకపెట్టిందట. అప్పట్నించీ ఇదివరకటిలా పని చెయ్యలేకపోతున్నాదట. ఓపిక తగ్గేసరికి అమ్మగారికి తనమీద అనుగ్రహం తప్పిందట మొన్నను ఆమెగారి అన్నగారు వచ్చినప్పుడు, "ఒక పిల్లని చూసి పంపించరా అన్నయ్యా ఈ ముసిల్దాన్ని దాని వూరికి తోలేస్తాను" అని చెప్తోందిట

"చూడండి బాబయ్యా కానిదేశం రమ్మనంగానే వచ్చాను. మూడేళ్ళమట్టీ నా రెక్కలు అరిగే అన్నట్టు చాకిరిచేశాను బిడ్డల్ని కనడంవరకే ఆయమ్మ వంతయింది గానీ, ఆ చెయ్యా, ఈ చెయ్యీ అనకండా ఎత్తిపోసింది నేను ఎచ్చనా పచ్చనా వస్తే నిద్దర కాచి సేవచేసింది నేను పాలు నేను పట్టాను గోరు ముద్దలు నాచేతో తినిపించాను పిల్లని ఇంతవాళ్ళని నేనూ చేసింది

అయ్యన్నీ మరిసిపోయి కాస్త జబ్బుపడి నాలుగు రోజులు కొంచెం పనికి జంకేనని నన్ను తగిలేస్తా నంటోంది ఆ యమ్మ సుస్తీ చేసిన మడిసి నీరస పడదా—కొన్నాళ్ళుపోతే వుంజుకోదా—నాయమేనా ఇది చెప్పండి బాబూ" తనకు వచ్చిన కష్టాన్ని మొర పెట్టుకుంది



**జరిగిన కథ—13:** కేశవరావ్, కామేశ్వరమ్మగార్ల ఏకైక పుత్రుడు మురళి — రంగనాధం, రాజ్యలక్ష్మమ్మగార్ల ఆఖరి సంతానం మీనాక్షిని మాయమాటలతో మోసపుచ్చి తన కోర్కెను తీర్చుకొంటాడు. గర్భం పోగొట్టటానికి చేయించిన నాటు వైద్యం మీనాక్షి ప్రాణాల్ని హరిస్తుంది రంగారావుగారి ఏకైక పుత్రిక హిమబిందు మనసులో స్థానాన్ని సంపాయిస్తాడు మురళి ఫ్రెండ్ రామకృష్ణ స్కూటర్‌మీద ఎక్కి అతన్ని ఆనుకొని కూర్చున్న బిందును చూసిన మురళి ఆమెను తీవ్రంగా విమర్శిస్తాడు ■ తరువాత వారిద్దరు విడిపోతారు మురళి ఓ పల్లెటూర్లో గవర్నమెంట్ డాక్టర్‌గా పనిచేస్తుంటాడు వయసు తాకిడికి తట్టుకోలేక అక్కడే నర్స్‌గా పనిచేస్తున్న సోఫియాతో కోర్కెలు తీర్చుకుందామనే దురుద్దేశంతో పొత్తు పెట్టుకొంటాడు. సోఫియా మరో ఉద్దేశ్యంతో అతనికి తన సర్వస్వాన్ని అర్పించడమే కాకుండా ప్రచారం కూడా చేస్తుంది రౌడీగా చలామణీ అవుతున్న అన్న థామస్‌కు తన పధకం వివరిస్తుంది సోఫియాని వదిలించుకొనే వీలులేక అమ్మ దగ్గరకు పారిపోతున్న మురళిని అడ్డుకొని జరుగవలసిన తతంగమంతా జరిపిస్తాడు థామస్ ఇక చేసేదిలేక ■ మారుమూల ప్రాంతానికి ఒదిలీ చేయించుకొంటాడు మురళి విషయాలన్నీ కేశవరావ్‌గారి ద్వారా విన్న కామేశ్వరమ్మ లోలోపలే మధన పడుతుంది మురళి చెల్లెలు వసంతలక్ష్మి పెళ్లి ఏర్పాట్లు జరుగుతుంటాయి. సుబ్బాయమ్మ మురళి వ్యవహారాన్ని కూపీ లాగటానికి ప్రయత్నిస్తుంటుంది. మామూలుగా జరిగినదానికి కొంత కల్పితం చేసి చెప్పి ఆమెను తాత్కాలికంగా శాంతపరుస్తుంది కామేశ్వరమ్మ.



దానికి జరిగే అన్యాయం గురించి తనకు విచారం కలగలేదు. తన కుతూహలమల్లా సోఫియా అన్నగారి సంగతే .

''అన్నగారు వస్తుంటాడా ఏమిటి ఎక్కువగా?'' అని అడిగేసరికీ, అసలే సోఫియామీద అక్కసుగా వున్నదయ్యే–ఇన్నేళ్లబట్టీ ఇటుకేసి తొంగైనాచూడని మమ్మల్ని అమ్మగారంటే పడనివాళ్లలో జమకట్టే సట్టుంది–'కీ' ఇచ్చినట్టు అది ఇంటిగుట్టు తాలూకు ఇన్‌ఫర్మేషన్ అంతా చెప్పటం ప్రారంభించింది

తనకు అయినవారిమీద తనకే చాడీలు చెప్ప బోవటం దానిది సాహసమే దానికా అవకాశం అర్హతా ఇవ్వటం నిజానికి తనదీ హేయమైనపనే కానీ ఏదో తెలుసుకోవాలన్న తొందరా క్యూరియాసిటీతో చెబితే చెప్పనీ అన్నభావం, అది చెప్పేవన్నీ తనను నిర్లిప్తుడిగా విననిచ్చింది

ఒక ఇంటి చరిత్ర ఆ ఇంట్లో పనిచేసే పని మనిషికి తెలిసినంత తుణ్ణంగా మరెవరికీ తెలీదు

అతిశయోక్తులు అనిపించినవి కొన్ని వదిలేసినా మొత్తంమీద అది చెప్పినదాంట్లో తనకు బోధపడిన సారాంశమిది—

మురళీ సోఫియాలమధ్య ఈషణ్మాత్రమూ అవగాహనా సామరస్యమూలేవు వారిరువురి దాంప త్యమూ మార్జాల దాంపత్యంలా సాగుతోంది ఒక రంటే ఒకరికి క్షణం పడదు ప్రతి చిన్నదానికీ కీచు లాడుకుంటూ, ఆఖరికి తిండివిషయంలో కూడా వాదనలు వేసుకుంటూ వుంటారు.

సోఫియాకి ఆడంబరం జాస్తి సుఖలాలస అనంతం భర్తని తన వాంఛితాలు నెరవేర్చే పని ముట్టుగా ఎంచుతుంది. నేను కోరిందల్లా తీర్చటమే మీ బాధ్యత అంటుంది. కాదంటే కాట్లాడుతుంది ఆవిడకు బాసట అన్న. మురళిమాట ఏ కోశానా సాగనివ్వరు వాళ్ళ ప్రతి ఘర్షణ చివరన వాళ్ల నోటిధాటికి గెలవలేక చేతులెత్తేస్తాడు మురళి వారి పోరు భరించలేక శక్తికిమించిన బరువే ఎత్తు కుంటుంటాడు

ఐనా సోఫియా సంతృప్తిపడదు వుంటున్న వూరు దగ్గర్నించీ ఆమెకు అసంతృప్తే

''ఏ సరదా కాలక్షేపం లేని గొడ్డూరు'' అని తిట్టిపోస్తుంటుంది, ''ఓ చలీచప్పనా లేదు — అచ్చటాముచ్చటా తీరదు. ఈ అడివిలో తన బ్రతుకు వ్యర్థమయిపోతోందని'' వాపోతుంది

రభసచేసీ, రచ్చచేసీ నెలకి ఏ రెండు మూడు సార్లో మొగుణ్ణి సిటీకి బయలుదేరదీస్తుంది అక్కడున్న రెండు రోజులూ ఝామ్మంటూ జాలీగా ఎంజాయ్ చేసి ఉన్నది కాస్తా ఒదిలించుకుని తిరుగు ముఖం పడతారు.

ఇంటికి వచ్చాక రుసరుసలు మళ్లీ మొదలే పాడుకొంప వెధవ పిల్లలు ముష్టి ఉద్యోగం. ప్రయోజకత్వం లేని మొగుడు, అంటో

బిడ్డల ఆలనాపాలనా పట్టించుకోదు; సంసారం స్థితిగతులు ఏమవుతున్నాయోననే గమనింపు లేదు, కట్టుకున్నవాణ్ణి శాంతిగా సుఖంగా నిలవనివ్వదు; ఇల్లు తీర్చిదిద్దుకుందామన్న ధ్యాసలేదు, ఎంతసేపూ స్వసుఖం తనూ తన విలాసాలూ, వినోదాలూ స్వార్థమూ – ఇదిట సంగతి —

అనుకూలవతి ఐన ఇల్లాలు మగవాడికి వరమే. అందుకు నోచుకోనివాడికి గృహ సౌఖ్యం కొరత ఒక్కటే కాదు – శరీరంలో చురుకుతనాన్ని ప్రవహింపచేసే భాగమేదో పాడయిపోయినట్టు జీవితం ఉత్సాహరహితంగా నిస్సారంగా గానుగకు కట్టి ఎద్దువలె యాంత్రికమవుతుంది.

ఆ దురదృష్టవంతుడు తన తనయుడే కావటం తమదీ అంతకుమించిన దురదృష్టమే

మనస్సు బరువుగా తోచి దీర్ఘంగా నిట్టూర్చాడు తను

''ఈ మధ్యేన అయ్‌గారి ఉద్యోగమేదో చిక్కుల్లో పడ్డట్టుంది బాబూ! ఈ ఇల్లు కూడా ఖాళీ చేసెయ్యమన్నారంట ఇంట్లో రోజంతా కయ్యమే – ఊరంతా గూడా ఆ గబ్బుగా ఏందో చెప్పగుంతున్నారు –'' అంటో ఆ 'ఏదో' 'ఏమిటో' చెప్పటమా మానటమా అనే సందిగ్ధంలో పడిగావును ఆగింది మునలిది.

చెప్పమని తను ప్రోత్సహిస్తే చెప్పేదే. కానీ కోడలి గత్తరతనం దానిద్వారా వినగలిగిన తను కొడుకు పరాభవం సంగతి వినటానికి అవమాన మనిపించి ముభావంగా మౌనం వహించాడు అదీ మిన్నకుండిపోయింది

చీకటి పడింది కలత నిండిన తనకు ఆకలి



పడినా ముసలిది అతిథిమర్యాద మరువలేదు

"నా వంట తింటారా అయ్యా? పోనీ టీ పెట్టమంటారా? గుడ్లున్నాయి ఆమ్లెట్ వెయ్యమంటారా?" అనడిగింది వినమ్రతగా

'హలోప్మి'

టీ తాగటానికి అభ్యంతరం లేదుగానీ ఆపద్ధర్మంగా ఆచారం మాట మరిచిపోయినా, మహా ఎడ్డిగావున్న దానిచేత్తో ఏం వుచ్చుకున్నా బయటికే వచ్చేసేటట్టుందిగానీ లోపలికి వెళ్ళేట్టులేదు.

"నా కోసం శ్రమపడకు" అంటూ మంచిగా దాని ఆతిథ్యం తిరస్కరించాడు

పిల్లల కోసమని తనుతెచ్చిన పళ్లూ స్వీట్సూ వున్నాయి. అవే రెండు నోట్లో వేసుకుని, బావి నీళ్లు చేదెడు తోడుకుని, తిన్న శాస్త్రం ఆ పూటకు అవచేసుకుని, మళ్లీ ఆ సోఫానే ఆశ్రయించాడు

వంట ఇంట్లో అన్నాలు తింటూ పిల్లలుచేసే అల్లరి, ముసలిదాని సణుగుడుల మధ్య ఎప్పుడు కునుకు పట్టిందో తెలీదు — మురళి "నాన్నా" అంటూ లేపేవరకూ మెలుకువలేదు

తను లేవటమయితే లేచేడుగానీ ఏవో సాధారణ పరామర్శలు తప్ప అర్ధరాత్రి కూడా మించడం వల్ల తమ మధ్యన సంభాషణ అప్పుడు అంతగా పెరగలేదు

అయితే తన రాకకు మురళికాక సోఫియాకూడా సంతోషించిందని మాత్రం తెలిసింది తనకి తను సోఫాలోనే నిద్రపోయినందుకు ఎంతో నొచ్చుకున్నది హడావిడి పడుతూ నవారు మంచం వాల్చి పరుపు వేసింది తెల్లటి ఇస్త్రీ దుప్పటి పరిచి ఫ్యాన్ స్విచ్ నొక్కింది

"ఇలా వచ్చి పడుకోండి" అంటూ వినయం అగుపరిచింది తనూ బెట్టుపోలేదు పక్క కుదరని ఆ సోఫాకి స్వస్తి పలికి మిగతా రాత్రి హాయిగా నిద్రపోయాడు

* * *

తను మళ్లీ కళ్లు విప్పేసరికి ఎదురుగుండా గోడమీది వాల్ క్లాక్ ఏడున్నర గంటలవటానికింకా అయిదు నిమిషాల వ్యవధి మాత్రం వున్నదని చెబులోంది.

'అబ్బా! ఎంతాలస్యమయిందో — ఇంట్లో అయితే ఈపాటికి స్నానం సంధ్యా కూడా ముగించుకుండేవాడు తను! అరచేతిలో శ్రీరామ చుట్టుకుని

## కాలం కరిచాక

లేవబోతూ ఏ దేవుడి ఫోటో అన్నా కనబడుతుందేమోనని చుట్టూ చూశాడు

గడియారంపైన వేలాడుతున్న ఏసుక్రీస్తు పటం తప్ప మరేం అగుపించలేదు.

ఏసు అవనీ, వెంకన్న అవనీ — తులసికోటగానీ, ముల్లాగోరీకానీ, చెట్టు అవనీ, పుట్ట అవనీ—అమ్మ అవనీ, బాబా అవనీ — దేముడు అనంగనే ఎవరిలో ఏ మహిముందో లెమ్మని ఓ నమస్కారం విసిరేసే పగటు హిందువు మనస్తత్వమే తనదీను ఆ పటం కేసే మొహంచేసి ఓ క్షణం వినమ్రతగా కళ్లు మూసి తెరిచి లేచాడు

తీరాచేస్తే తను లేవటమే జాగు అయిందన్న వూహ అబద్ధమయింది తను తప్ప ఇంకెవరూ మేలుకున్నట్టు లేదు ఇంట్లో

ముసిలిది మటుకు వంటింట్లో పని చక్కబెడుతున్నట్టున్నది — గిన్నెల చప్పుడవుతోంది

వీధి తలుపు తెరుచుకుని అరుగుమీదకు వెళ్లి నిలుచున్నాడు. వూడ్చి కళ్లాపి చల్లిన వాకిలి హిందూమత చిహ్నమైన ముగ్గు లేకపోవటాన విధవరాలి నుదురులా బోసిపోతోంది.

ఈ ఉపమానంలో ఉన్న అపశబ్దం మనసుని తాకటంతో కలవరపడి తిరిగిలోపలికి వచ్చేసేడు

నిద్రలేచిన దగ్గర్నించీ కాలకృత్యాలు తీర్చుకోవలిసిన తొందర ఒకటున్నదికద! అదృష్టవశాత్తూ మురళీ వాళ్లు పడుకున్న గది ఓ పక్కగావుండి వంట ఇంట్లోకి వెళ్లాలంటే హాల్లోంచి నేరుగావెళ్లే వీలు వున్నది

వంటిల్లు కూడా ముందు గదికి దీటుగానే వున్నదనటం పొరపాటు అంతకన్న ఘోరంగా వుందనటం సబబు

డైనింగ్ టేబిల్ నిండా ఎంగిలివళ్లాలు, వాటి కిందా మీదా ఎండిపోయిన మెతుకులు, తొక్కలు, వాట్లనిండా పుట్టేడు చీమలు, తూము దగ్గర గుడ్డతాలూకు గుల్లలు, మసిబారిన గోడలు, మకిలిగావున్న పాత్రలు, రోతగావున్న నేల కంపరమెత్తిపోతోంది విజంగా

ఇల్లు ఈ మట్టునేవుంచి, అమ్మగారు లేచేసరికి సిద్ధంచేసి వుంచకుంటే తిడతారట — ఉదయపు పలహారం తయారుచేసే హడావిడిలో వుంది ముసలిది

పరిశుభ్రతకి అలవాటుపడిన తను అడుగడుగునా ముందుకడుగేయనీకుండా వెగటు పుట్టేలా అడ్డుపడుతోన్న అశుభ్రతని సాధ్యమయినంతవరకూ అంటకుండా జాగ్రత్తపడుతూ, కొంత చూడకుండా భరిస్తూ మొత్తానికి అనుష్టాలన్నీ తీర్చుకున్నాడు

మళ్లీ వీధి అరుగుమీదికి వచ్చేశాడు ముసలిది పడకకుర్చీ ఒకటి తెచ్చి వేసి వెళ్లింది ఇంటికంటే గుడి పదిలం అన్నట్టు ఇంట్లోకంటే ఇక్కడే మెరుగన్నట్లనిపించి రిలీఫ్ ఇచ్చింది

స్నానం కాగానే సంధ్యావార్చటం తనకీ నాటి అలవాటుకాదు అయితే అనుకూలంగాని సమయాల్లో, ముఖ్యంగా పైవూరు వెళ్లినప్పుడు — పట్టుబట్ట, పంచపాత్ర లాంటివి అమరవచ్చును — అమరకపోవచ్చును కనుక అలాటప్పుడు ఆ తతంగానికి స్వస్తి చెప్పేస్తాడు కానీ భగవంతుణ్ణి మనస్సులో స్మరించుకోవటంలో ఏ అడ్డంకీ వుండదు కాబట్టి కళ్లు మూసి ప్రశాంతంగా ధ్యానంలో పడిపోయాడు తను

సుమారుగా ఎనిమిదీ ఎనిమిదిన్నరా అవుతోండగా పిల్లలు రాగాలుపెడుతూ మేలుకున్న సడి అయింది వాళ్ల ఏడుపూ గొడవతో సోఫియా కూడా లేచినట్టుంది—విస్కుంటూ అరవటం వినిపించింది మురళిలేచి పిల్లల్ని ముసలిదానికి అప్పగించి తన దగ్గరకొచ్చి కూర్చున్నాడు

కొంతసేపయ్యాక "ఏమయిందిరా ఉద్యోగం? వివరాలేమీ రాశావుకాదు ఉత్తరంలో" అని మెల్లగా కదిలించాడు తను

కాస్సేపు ఏమీ మాట్లాడలేదు మురళి ఆ తర్వాత అన్నాడు— "నేను ఆస్పత్రిలో మందులు అమ్మేసుకుంటున్నానని రిపోర్టులు వెళ్ళాయిట పైకి నాకు ముందు తెలియలేదు మొన్న అకస్మాత్తుగా కరప్షన్‌వాళ్లు హాస్పిటల్ చెక్ చెయ్యాలంటూ వచ్చేశారు తప్పుకోడానికి ఏమాత్రం ఆస్కారం లేకపోయింది నాకు"

"తప్పుకోవటమేమిటి? ఏమిటి వీలుకాలేదు?" తనకు అర్థం కాలేదు

తన మొహం వంక చూసి తల వంచుకున్నాడు మురళి

"ఖర్మం చాలక క్రితం రోజే మందులు ఖరీదు చేసినట్టుగా బిల్లు వున్నాయి. అదే రుజావుగా రాసుకుపోయారు" అన్నాడు తప్పు చేసినట్టు

"మరి ఆ మందులు..?" అప్పటికి సంశయం నివృత్తి అయి వాక్యం పూర్తిచేయలేకపోయాడు తను











తలెత్తలేదు మురళి చేసిన పాపానికి ఫలిత మనుభవిస్తున్నవాడి దైన్యం వాలివున్న మురళి మొహంలో ప్రతిఫలిస్తోంది.

మనసు కలచినట్టయి నిట్టూర్చాడు

డైనింగ్ టేబిల్ దగ్గర మొదట సోఫియానే ఎత్తుకొచ్చింది

"ఈ రోజుల్లో ఎవరండీ మడికట్టుకు నుంటున్నదీ—? పైకి అందరూ పత్తిత్తు కబుర్లు చెప్పేవాళ్లే అవకాశం దొరికితే గుళ్లూ గోపురాలూ గుట్టుచప్పుడు కాకుండా గుటకాయస్వాహా చేసి హాష్ కాకీ అవి పైకి చూపించే దిగమింగుడు రాయుళ్లే అంతా ఎటొచ్చీ దొరక్కుండా తప్పించు కునే తెలివితేటలుండాలి తప్పివచ్చి పట్టుబడినా నోరు ముయ్యగల చాకచక్యముండాలి చేవ వున్నవాళ్ల భోగమే భోగం

ఇదిగో ఈయనా వున్నారు ఎందుకూ—? అడుగుల శబ్దం కాకుండా రండీ అంటే కాలికి డబ్బాలు కట్టుకువచ్చే రకం తెలివితేటలు శూన్యం దీనికితోడు చేతకాని తనమొకటి రెండు ముక్కలు అతుకు పెట్టమనిస్తే తుంచి మూడు ముక్కలు చేసుకొస్తారు ఇదండ ఈయన తీరు" అన్నది మహానిరసనగా

మాటలబట్టే తెలుస్తోంది ఆవిడ మొగుడన బడేవాడి కిచ్చే విలువా, గౌరవమున్నూ

"నోరు ముయ్" మురళి అగ్నిహోత్రంలా మండిపడిపోయాడు "ఇంకా వాగేవంటే పళ్లు రాలగొట్టేస్తాను ఊరుకున్నకొద్దీ మితిమీరి పోతున్నావు. చాతకానివాణ్ణంటావా నన్ను" అంటో చెయ్యెత్తి కుర్చీలోంచి లేచిపోయాడు

ఇద్దరూ రెచ్చిపోతే అక్కడే సంగ్రామం చూడాలిసొస్తుందో అని తనయినా జంకి, "ఊర్కోరా — వూర్కో" అని మురళి భుజం పట్టి ఆపుచేసేడు కానీ సోఫియా మాత్రం రవ్వంతయినా బెదరలేదు

పైగా, "అహ — ఆలినణచటానికి మాత్రం బుసబుస పొంగుకొస్తుంది పౌరుషం ఏం — ఆ కంపువుండరుమీద చూపించలేకపోయారేం? మీమీద అర్జీలు పంపించే ధైర్యం వాడికొచ్చిందంటే మీ చవ్వతనం చూసి కాదూ—?" అంటో రగిలే అగ్నిలో ఆజ్యం చిలకరించింది.

"అదిగో — ఆ తప్పుడు కూతే కూయొద్దంటు న్నాను" మురళి పట్టరాని కోపంతో బుసలు కొడుతూ కళ్లెర్రచేసినా ఆమె తగ్గలేదు

"ఉన్నమాటంటే ఉలుకెక్కువనీ — ఎందుకలా గొంతు చించుకుంటారు అయిన అల్లరి చాలక ప్రయోజకత్వం లేనప్పుడు అలాటి సాహసాల్లోకి జారబడకుండానన్నా వుండాలిసింది నలుగుర్లో ఈ తలవొంపులన్నా తప్పి ఉండేది" అన్నది ఈసడిం చేస్తూ

మురళి కూడా తక్కువ చెయ్యక అందుకున్నాడు "అసలు ఈ గోవారంతా నీ మూలాన కాదూ! వచ్చిన దాన్తో తృప్తిపడితే ఈ పెడత్రోవలు తొక్కే కర్మేమిటి నాకు పుట్టింది కూటికి తక్కువ కొంపలో అయినా నోట్లో వెండి చెంచా పెట్టుకు పుట్టినదానల్లే ఫోజులు పోతావు జమీందారీ పోకిళ్లు కావలిసొచ్చయి నీకు న్యాయంగా వచ్చే సంపాదనంటే చులకన కళ్లుకప్పి తెచ్చిన ముదనష్టమే ఘనం

## తాళం

ప్రతి మనిషికి
చెప్పుకోలేని ఓ బాధ
ప్రతి యింటా ఓ విషాద గాథ—

ప్రతి కంటిలో ఓ అనాగరిక భాష
ప్రతి యింటిలో ఉప్పు సముద్రాల ఘోష—

ఎక్కడ చూసినా
ఆనందంకోసం పరుగులు
ఎంత జాగ్రత్త పెట్టినా
మనసుకి మరుపులు, చిరుగులు—

అందుకే—

నోటికి పెదవులు
ఇంటికి తలుపులు!

తెరిస్తే కంపు!
మూస్తే యింపు!!

—ఆచార్య తిరుమల

ఎక్కడికిపోతాయి — నోళ్లు కొట్టుకుతినే బుద్ధులు మీ వంశంలోనే ఉన్నాయి" అన్నాడు కసిగా

"అను — అను — మా అన్నో దోపిడిగాడు, నేనో టక్కులాడిని మా వాళ్లంతా లోఫర్లు మరి వంటరి ఆడపిల్లనిచేసి మభ్యపెట్టి వశం చేసు కున్నావే — అది మర్యాద లక్షణమా? నట్టేటముంచి పరారవుదామని చూసేవే అది నిజాయితీ తనమా?" పాతవి తవ్వి తీసింది సోఫియా

"అది అంతా నువ్వు నా కోసం పన్నిన వల, మోసం"

"నీదే మోసం"

తను వున్నాడన్న జ్ఞానమన్నాలేకుండా నువ్వంటే నువ్వని రెట్టించుకున్నారు ఆవేశంలో విచక్షణ మరిచిపోయి నోటికొచ్చినవన్నీ గట్టిగా అరుచుకున్నారు

పదార్థాలన్నీ చప్పగా చల్లారిపోయాయి తనక్కడ నిమిత్త మాత్రుడిగా, ప్రేక్షకుడిగా, శ్రోతగా మాత్రమే మిగిలిపోయాడు

తనకర్థమయింది— కామేశ్వరిది గడుసు తనమొక్కటే సోఫియాది గయ్యాళి తనమూ, గత్తర తనమూ కూడా

* * *

తిరిగి వచ్చేటప్పుడు స్టేషన్ దాకా వెంట వచ్చాడు మురళి త్రోవలో అడిగాడు తను—

"ముందేం చేద్దామని?"

"కేస్ నడుస్తోంది. డబ్బు ఖర్చుపెట్టగలిగితే ప్రయోజనముంటుందేమోనని ఆశగా వుంది అందుకే మీకు రాశాను" అన్నాడు

"ఎంత కావాల్సి వుంటుందేం?"

చెప్పాడు కొద్దిగా పెద్ద మొత్తమే అది తానంత అవసరముంటుందని అంచనా వేసుకోలేదు తెచ్చిన మటుకు వాడిచేతిలో వుంచి, "వెళ్లి మనియార్డరు చేస్తాను నువ్వూరికే చింతపడి మనస్సు పాడుచేసుకోకు నీ ప్రయత్నం నువ్వు చెయ్యి అంతే వివరాలు రాస్తూండు" అని మాటిగా చూడ్డానికే బిడియపడుతోన్న వాడిని స్వాంతన పరిచి వచ్చేశాడు

**(ఇంకా వుంది)**




**ఎ. హెచ్. ఎ. - రాజమండ్రి**

నా పరిస్థితులు తెలియక ముందు నన్ను ప్రేమించి, నాతో పార్కులకి సినిమాలకి తిరిగిన ఓ నయవంచకి నా ఆర్థిక స్థితి తెలియవచ్చాక మానేసింది.

★ నయం—ఇంకా పెళ్లికి వచ్చాక తెలుసుకో లేదు. అయినా స్నేహం చేయడానికి ప్రాతిపదిక డబ్బు కాదు. కాని ప్రేమ పెళ్లికి దారితీస్తుందంటే—ఎలా బ్రతుకుదాం మనం అని ఆలోచించుకోవడం — అవసరమే. కామన్ సెన్సు. అందుకే అబ్బాయిలు అప్పులు చేసి పోజులు కొట్టకూడదు.

**ఉదయ - కృష్ణలంక**

పెళ్లినాడు జానకి— మరునాడు తాటకి అన్నా డొక కవి ?

★ నయంబాబూ. నేను పెళ్లినాడు తరవాతా కూడ తాటకిలాగే వున్నాను! లేకపోతే మోసం చేశా నందురేమో. (మనలో మనమాట భార్య అంటే భరించవలసిన బాధ్యత వుండి అలా అనిపిస్తుందను కుంటాను ?)

**బి. బిహెచ్ - కాళిబగ్గ**

మన శరీరం మన అదుపులో వుంటుం దంటారా ?

★ ఉండదు భవానీ — మధ్య వయస్సుదాటాక! అలా వుంచుకోడానికి చాలా కష్టపడాలి ?

జీవితంలో శాశ్వతమైనది ఏది ?

★ జ్ఞాపకాలు. మనం మన ముందువారి జ్ఞాపకాలు తిరగేసుకుంటాం. మన జ్ఞాపకాలు మన తరవాతివాళ్లు తిరగేస్తారు.

**ఎ ఎస్. ఎస్. - మంగవరం**

మీరు మేమడిగిన ప్రశ్నలకి సరిగా జవాబు చెప్పడంలేదు. బహుశా మద్రాసులో వేసవి ప్రభావమా ?

★ మద్రాసులో వేసవా ?! ఎవరేనా వింటే నవ్వుతారు!

**వి. బి. ఆర్. - తిరువూరు**

దేవదాసు—పార్వతి, అనార్కలి—సలీమ్ ప్రేమ గాథలని విని మనవాళ్లు నేడు జాలిపడుతున్నారు. అలాంటి అన్యాయం నేటి యువతీ యువకులకు చేయకుండ వుండరేం ?

★ ఏం చేస్తున్నారు ? ముసలాళ్లకిచ్చి పెళ్లి చేస్తున్నారా ? సజీవంగా గోరి కట్టేస్తున్నారా ? సంపాదనలేకుండ లేచిపోవద్దనడం అన్యాయం చెయ్యడమా ? కుర్రకారుకి ప్రేమించే హక్కు వుంది. కాని ప్రేమతోపాటు మోయవలసిన బాధ్యతలను భరించకల శక్తి కావాలంటున్నారంతే... ఐదో క్లాసు పిల్లలు లేచిపోవడం, పదో క్లాసు పిల్లలు పిల్లల్ని కనడం చూపించి — నేటి సినిమాలు ప్రేమకి కాదు పట్టం కడుతున్నది, మోహానికి.

**వి ఎస్. బి. - హైదరాబాదు**

సంప్రదాయానికి కళంకం తెచ్చే విధంగా విచ్చలవిడిగా పిచ్చి డ్రస్‌లలో తిరిగే వీరనారీమణులకు మీ సలహా ?

★ డ్రస్సు తమకు నప్పుతుందా లేదా చూసుకోమంటాను. అయినా సంప్రదాయానికి కళంకం ఒక్క ఆడపిల్లల దుస్తులే తెస్తున్నాయా?! మగవాడికి లేని సంప్రదాయపు కట్టుబాట్లు యిలాంటి 'గడిచిపోయే' వాటిపై ఆడదానికి మటుకు ఎందుకు ? వెనకటికెక్కడో ప్రొఫెసరుగారు "జీన్సు వేసుకొని తెలుగు సాహిత్యం చదవడమేమిటి" అని వాపోయాట్ట! సూటు వేసుకుని తెలుగు చెప్పవచ్చా అని అడిగిందటా పిల్ల. ఇదిగో అలా వుంది మీ బాధ.

**టి. జి. - సిద్ధిపేట**

మీ ఆడవారికి సమాన హక్కులు కావాలి. కాని పెళ్లి చేసుకునేప్పుడు తమకంటే ఎక్కువ చదువుకుని వుండాలి...

★ చిత్రం. లేకపోతే తరవాత ఆ మగవాడు 'తక్కువతన'మనే రోగగ్రస్తుడై సంసారం నరకం చేస్తాడనీ, చేసే అవకాశాలున్నాయనీ — ఆడదాని భయం ?!

**ఎం. ఎస్. - బైపల్లి**

మనీ + షి డబ్బు + ఆడది=మనిషి. ఈ ఫార్ములా అర్థం కాడంలేదు. వివరిస్తారా ?

★ మనీ కాదు. మెనీ! అని చెప్పి చూడండి సులభంగా అర్థం అవుతుందేమో. నా కసలే లెక్కలు రావు.

"వెడలెను విఘ్నరాజు అసురుని దునుమాడగ" —[ఫొటో : సుధాకర్ యడవిల్లి]






ఆకాశం, భానుడి రాకకోసం నింగంతా కళ్ళు చేసుకుని చూస్తోంది

కర్మేంద్రియాణి సంయమ్య — య ఆస్తే
మనసాస్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా — మిథ్యా
చారస్సఉచ్యతే॥

శ్లోకం స్పష్టంగాను, భావయుక్తంగాను చెప్పినా, వయసుతో పాటే సడలిన కంఠం శ్రావ్యతనంతగా పలికించలేకపోయింది, సీతారామయ్య గొంతు

సీతారామయ్యగారు సనాతనుడు, గాంధేయవాది నిరాడంబరుడునూ చేరినది ఏ వుద్యోగమైనా నీతిగా రిటైరయ్యాడు అసత్యమాడటం నేరమంటాడు ఉన్న వూళ్ళోనే వుద్యోగం చేశాడు కాబట్టి స్థానికంగా ఎలుకుబడి బాగానేవుంది సీతారామయ్యగారు స్వాతంత్ర్యోద్యమంలో ఆత్మశుద్ధితో పాల్గొన్న కారణాన, ఆనాటి తోటి కార్యకర్తలు పెద్ద పెద్ద పదవులలోవున్నా, సీతారామయ్యగారన్నా, ఆయన మాటన్నా మహాగౌరవం వారికి.

సీతారామయ్యగారి సతి, సీతాలక్ష్మీదేవి భర్తకన్నివిధాలా తగిన యిల్లాలు. ఆమె మాటంటే ఆయనకు వేదం కాకపోయినా విలువైనదే

క్రితం రాత్రి జరిగిన సంఘటనను పురస్కరించుకొని "వాడు మనల్నేమి కోరాడులెద్దూ? చాలా మందిళ్ళల్లోనూ వున్నాయి, వాడికి కావాలనిపించి అడిగాడు" అనింది సీతాలక్ష్మీదేవి భర్తకు కాఫీ కప్పు అందిస్తూ.

అప్పుడే పూజ ముగించుకొచ్చి సోఫాలో కూర్చున్న సీతారామయ్య కాఫీ కప్పు అందుకుంటూ ఆమె కళ్ళల్లోకి అనురాగంతో చూస్తూ "నేనుమాత్రం ఏమన్నాను. అది అంత అవసరమా అని అన్నాను" అన్నాడు.

నిశ్శబ్దంగా అతని కళ్ళల్లోకి చూసింది. ఆ చూపులో అనురాగమెంతుందో, అర్థింపూ అంత వుంది.

ఆమె మాటను కాదనలేదు తనలో జీర్ణించుకపోయిన గాంధేయతత్వం తన్ని రాజీ పడనీయటంలేదు. అయినా ఒప్పుకోక తప్పలేదు. చివరిసారిగా ప్రయత్నం చేయమని బోధించిందంతరాత్మ.

"చూడు సీతు, ఆ టూ యిన్ వన్‌లు, త్రి యిన్ వన్‌లు లేకపోతే సరదా తీరదా? ఒక్కపూట భోజనానికి కూడ నోచుకోని దరిద్రనారాయణులతో

పొల్చుకుంటే మనం శ్రీమంతులమేమో ! అనవసర మైన ఆర్భాటాలు కాకపోతే" అని సీతాలక్ష్మివైపు చూశాడు.

అప్పటికే సహనం కోల్పోయిన ఆమె, ఇంకా భర్త కళ్ళల్లోకే చూస్తూవుంది. ఆ చూపుల్లో విరక్తి భావమే ఎక్కువ పాళ్ళున్నట్లు కనబడింది సీతారామయ్యకు.

"అలాగే కానమను" అన్నాడు, విషయాన్ని విషమంగా చేయటం యిష్టంలేక.

ఆమె కళ్ళు కృతజ్ఞతాపూర్వకంగా మెరిశాయి సీతాలక్ష్మి కళ్ళకే ఆ శక్తివుందా ? లేక అందరి అందమైన ఆడవాళ్ళకు ఈ శక్తి వుంటుందా ? అన్న సందేహంలో పడ్డాడు ఖాళీ కప్పు అందిస్తూ.

ఒక్కడే కొడుకు రాజశేఖరం, టూ యిన్ వన్ కావాలని పట్టుబట్టి అడుగుతున్నాడు సీతారామయ్యని కాదు—అతని తల్లిని, సీతాలక్ష్మిని. ఆమె భర్త నడుగుతోంది

ఎప్పట్నించి ? రాజశేఖరం బియస్సీ పాసై, యమెస్సీలో కడుగు పెట్టినప్పటినుంచి యంయస్సీ పట్టా చేతికొచ్చింది కాని అతని కోరిక కోరికలాగె వుండిపోయింది సరదాను చంపుకోలేకపోతున్నాడు

ఏదోవిధంగా కొడుకు అసంతృప్తిని కనబరుస్తున్నాడు ఇక లాభం లేదనుకుని సీతాలక్ష్మి రంగంలోకి దిగింది కార్యం సాఫల్యమయ్యింది

"బాబు మీ నాన్నగా ఒప్పుకున్నారు, తెచ్చుకోవయ్యా" అని కొడుక్కు చెప్పుతూంటే విన్నాడు సీతారామయ్య

సీతారామయ్యదొక గొప్ప సుగుణం ఒక్కసారి ఏదైనా ఒప్పుకోవటం అంటూ జరిగితే, మనసా, వాచా ఒప్పుకుంటాడు మళ్ళీ దాన్ని గురించి యితరత్రా ఒకరి బలవంతంమీద ఒప్పుకున్నట్లు భావించడు

అప్పుడే దినపత్రిక వచ్చింది.

'మరో పదేళ్ళల్లో దేశంలో దారిద్ర్యం లేకుండా చేస్తాం" అని నాయకుడి ప్రకటన చదివాడు సెబాష్ ఈ ప్రకటన టూ యిన్ వన్‌లా తోచింది చెప్పేది ఒకటి చేసేది వేరొకటి

"రెండేళ్ళల్లో నిరుద్యోగానికి స్వస్తి" మరో తియ్యటి స్టేటుమెంటు సెంటిమెంటును ఆకట్టుకునే స్టేట్‌మెంటు

## టూ - యిన్ - వన్

కళ్ళు చిట్లించి, శూన్యంలోకి చూశాడు సీతారామయ్య

అంతా టూ యిన్ వన్‌ల మయంలా తోచింది

'తను కూర్చున్న బెడ్ కం సోఫా కూడ టూ యిన్ వన్ కాదా ? ప్రతి ఆడది ప్రతి మగాడు – ప్రతి భార్య ప్రతి భర్త టు యిన్ వన్‌లు కాదూ ? మనసులోని ఆలోచనకు బాహ్యప్రవర్తనకు అంతూ పొంతూ వుండదు వోటు టు యిన్ వన్ కాదు ? ఒకడిని వోడిస్తుంది, మరొకడిని గెలిపిస్తుంది వోటు అంతే! ఒకడిని బాగుపరుస్తుంది, ఒకడిని ఏడిపిస్తుంది ఈమధ్య రైల్వేలు కూడ టూ యిన్ వన్‌లుగా వున్నాయి ఇంటికీ తీసుకెళ్తాయి, మింటికీ తీసుకెళ్తాయి యాక్టర్లే డైరక్టర్లు–రైటర్లునూ ఇలా సాగదీస్తూపోతే టు యిన్ వన్‌లు కాని దేదని అనిపిస్తుంది

నేటి సినిమాల్లోని సాహిత్యం, నేటి రాజకీయవాదుల సాంగత్యం ఏది కాదు టు యిన్ వన్ ?

ఇంతెందుకు దేవుడు, ఎవరు ? దేవుడు బాబు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపాలలో త్రి యిన్ వన్ కాదు ?!

"స్చ్" అని నిట్టూరుస్తూ పేపరు త్రిప్పాడు

"అయ్యా"

"ఎవరూ ?" పేపర్లోంచి తల బయట పెట్టి గుమ్మంవైపు చూస్తూ అడిగాడు

"నేనండి ముకుందాన్ని"

"ము కుం ద మా . రా రా రా ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు" అని లేచి వెళ్ళి "అంతా బావున్నారా ముకుందం" అంటూ కరచాలనం చేస్తూ సాదరంగా తోడుకొనివచ్చి తన ప్రక్కగావున్న కుర్చీలో కూర్చొబెట్టాడు, బలవంతంగా

ముకుందం సీతారామయ్యకన్నా చిన్నవాడు చిన్న వుద్యోగిమా తన తరువాత రిటైరయ్యాడు చిన్న వుద్యోగంనుండి ఎదిగినవాడు అందుకని సీతారామయ్యను 'అయ్యా' అని సంభోదించేవాడు

"మీ దయవల్ల బాగానే వున్నామండయ్యా" వినయంగా చెప్పాడు సీతాలక్ష్మి కాఫీ ఇచ్చిపరామర్శించి వెళ్ళింది

అవి ఇవి, మాట్లాడుకున్నాక "ఏవిటి, ఇలా వచ్చావ్" అని అడిగాడు సీతారామయ్య

"మీతో ఓ సహాయం కావల్సి వచ్చానయ్యగారు"

"నాతోనే ?"

"అవునండయ్యా మీ చేతనయినదే మీరు సహాయం "

మధ్యలోనే అందుకుని "నా చేతనయినదే అవుతే తప్పక చేస్తా" అభయమిచ్చాడు సీతారామయ్య

"ఏం లేదండయ్యా మా అబ్బాయి పి హెచ్‌డి చేశాడు "

"అబ్బా! పి హెచ్‌డియే విన్నభినందించవలసిందేనయ్యా వెరీ గుడ్ తరువాత ?" అంటూ ముకుందం భుజం తట్టాడు ప్రశంసాపూర్వకంగా

"యూనివర్శిటీ కాలేజిలో లెక్చరర్ పోస్టుకు దరఖాస్తు పెట్టాడు మీకు తెలిసినాయన సెలక్షన్ కమిటి చేర్‌మెన్ బాబు దయచేసి మీరొకమాట చెప్పితే " జాలిగ ముగించాడు

"చేర్‌మెన్ ఎవరూ ?"

"రాజారాంగారు"

"ఎవరూ, మన రాజారామే!" 'మన' అనడంలోనే పొంగిపోయాడు ముకుందం

"అవునయ్యా, ఆయనకు మీ మాటంటే గొప్ప గౌరవం" తలూపాడు సీతారామయ్య, 'రాజకీయ రంగంలో రాజారాం అంతవాడవ్వటానికి కారణం తను' అని మనసులో అనుకున్నాడు

ఆమధ్య ఆర్ టి సి బస్సు డిపోకు ప్రారంభోత్సవం చేయటాని కొచ్చినప్పుడు, రాజారాం తనింటికొచ్చి "ఏమయ్యా, సీతారామయ్యా,మమ్మల్ని చూడటానికి కాకపోయినా మీ చెల్లెని చూడటానికొచ్చినప్పుడైనా హైదరాబాద్‌లో మేమూ వున్నామని గుర్తుకు రాదేమయ్యా అసలు మేము క్షేమంగా వున్నామా లేదా కనుక్కోరాదయ్యా, మాకు గురువు లాంటి వాడవు" అని పెద్దల సమక్షంలో అన్నాడు

లందుకు సమాధానంగ ఓ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు సీతారామయ్య

"అంటే, ఇక్కడ చెప్పినంత తియ్యగా, అక్కడి కొస్తే పలకరించమనేగా నీ యభిప్రాయం." రాజారాం వున్న విషయం అన్నాడు మళ్ళీ నవ్వే సమాధానమయ్యింది









**ఎమ్. ఎస్. ఆర్ — బెంగుళూరు**

నా వయస్సు 35 సంవత్సరములు. మలములో చిన్న నులిపురుగులు పడుతున్నవి. కొన్ని మాత్రలు వాడాను. నివారణ కాలేదు. పూర్తి నివారణకై తగిన వైద్యము కోరుచున్నాను.

★ త్రెడ్‌వర్మ్స్ ఉన్నప్పుడు ఒక వారంపాటు పైపరజీన్‌సిట్రేట్ మాత్రల రూపంలోగాని, ద్రవ రూపంలోగాని వాడవలసి ఉంటుంది. ప్రతి రోజూ రాత్రిపూట రెండు టీ స్పూనుల పైపరజీన్ సిట్రేట్ ద్రవాన్ని ఒక వారంపాటు తీసుకొంటే పురుగులన్నీ పోయే అవకాశం ఉంటుంది. అవసరం అయితే ఒక నెల తర్వాత మలపరీక్ష చేయించుకొని మరలా వాడవచ్చును.

ఇంట్లో అందరికీ ఒకేసారిగా ఈ మందు వాడటంవల్ల ఈ పురుగులు "నిరంతరంగా" కుటుంబంలో ఉండిపోయే అవకాశం తప్పుతుంది. వ్యక్తిగత అలవాట్లలో మార్పులు, మలవిసర్జన సమయాలలో పాదరక్షలు ధరించటం చాలా అవసరం.

**ఎస్. వి. ఆర్. — రాయవరం**

'ఇస్నోఫీలియా'తో బాధపడేవారికి అరచేతులకీ, పాదాలకీ శక్తివంతమైన అయస్కాంతములను తాకించటం, అయస్కాంతీకరణ చేసిన నీటిని త్రాగటం చేస్తే రోగ విముక్తి కలుగునని తెలిసింది. ఇది నిజమా?

★ ఇస్నోఫీలియా అనేది రోగం కాదనీ రోగ లక్షణమనీ తెలుసుకోవలసి ఉంటుంది. ఇస్నోసిల్స్ అనేవి రక్తంలో ఉన్న తెల్లకణాలలోని ఒక తెగ మాత్రమే. శరీరాన్ని, కొన్ని క్రిముల బారినుంచి రక్షించటానికి ఇస్నోసిల్స్ సంఖ్య పెరగటం జరుగుతుంది. అలర్జీ మూలంగా ఏర్పడే రోగాలు ఉన్నప్పుడు ఇస్నోసిల్స్ సంఖ్య అధికం అయ్యే అవకాశం ఉంటుంది.

పై విషయాల దృష్ట్యా అయస్కాంతం ఎంతవరకూ ఉపయోగపడుతుందనేది వివాదాంశం అవుతుంది.

**డి. ఎ. — బారువ**

నా వయస్సు 19 సంవత్సరములు. రెండు సంవత్సరములనుండి ఆయాసము వస్తున్నది. మందులు వాడుతున్నాను. మందు వాడిన రోజున కొంచెము తగ్గుతుంది. మందు వాడనిరోజున విపరీతముగా వుంటుంది. జీవితాంతము ఇలా మందులు వాడవలసిందేనా? దీనికి మీ సలహా కోరుతున్నాను.

★ శరీరానికి పడని వస్తువులవల్ల, గాలివల్ల, దుమ్మువల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. దీనినే అలర్జీ అనటం జరుగుతుంది. ఈ అలర్జీవల్ల ఊపిరితిత్తులలోని గాలిగొట్టాలు ముకిలించుకొని మామూలుగా గాలి పోవటం జరుగక ఆయాసం రావటం జరుగుతుంది.

ఈ అలర్జీ రావటానికి గల కారణాన్ని కనుగొని, ఆ పదార్థాలను వాడటం మానవలసి ఉంటుంది. కొన్ని ప్రాంతాలలో అలర్జీ క్లినిక్‌లు ఉన్నాయి. వాటిలో ఈ అలర్జీలకి విరుగుడు లభించే అవకాశం ఉంటుంది.

అంతవరకూ ఆయాసం వచ్చినప్పుడల్లా మాత్రలు వాడవలసి ఉంటుంది. కొందరికి కాలగతిలో దానంతట అదే ఈ అలర్జీ లక్షణం పూర్తిగా పోవటం కూడా జరిగే అవకాశం ఉన్నది.

**యు. వి. — వేలంగి**

హస్తప్రయోగము వలన సిఫిలిస్ వ్యాధి వచ్చే అవకాశం వున్నదా?

★ ఏమాత్రమూ లేదు. రోగగ్రస్తమయిన స్త్రీ పురుషులు లైంగిక కలయిక జరపటంవల్లగాని, రోగగ్రస్తమయిన భాగాలలోనుంచి కారే 'రసి' కురుపులు, గాయాలు ఉన్న చర్మంమీద తగలటం వల్లగాని, ఈ రోగం వచ్చే అవకాశం ఉన్నది.

---

"ఈ నవ్వేనయ్యా బాబు నిన్నింత గొప్పవాడిగ చేసింది" అని మళ్ళీ పొగిడాడు సీతారామయ్యని.

అప్పుడు అక్కడ చేరిన అధికారులు, అనధికారులు సీతారామయ్యను తోచినవిధంగా ప్రశంసించారు.

రాజారాం గొప్పవాడే పలుకుబడిగల వర్గంలో వాడే. పంధొమ్మిదివందల నలభైఏడు పూర్వం రాజారాంతో గడిపిన రోజులు జ్ఞాపకం వచ్చి నవ్వుకున్నాడు.

తలరాత బాగుండాలే కాని, పదవులకేం కొదువ. అప్పట్లో తనకు సహాయకుడుగా చేరిన రాజారాంను ఎలా తీర్చి దిద్దాడో! ఆనాడు తనిచ్చిన క్రమశిక్షణ రాజారాంని ఎంత ఎత్తున వుంచగల్గిందో తలుచుకొని సంబరపడ్డాడు.

రాజారాం సీతారామయ్యతో సెలవు తీసుకుంటూ, పాదాభివందనం చేసిన సంఘటన చూసిన వాళ్ళకి తెలుసు సీతారామయ్య గొప్పతనం.

ఆరోజు ముకుందం అక్కడే వున్నాడు.

"సరే ముకుందం" అంటూ ముకుందం అబ్బాయి గురించి వ్రాసిన వివరాల కాగితాన్ని తీసుకున్నాడు.

"మీమీద భారంవేసి పోతున్నానయ్యగారు, అంతా మీ దయ" అని రెండుచేతులు జోడించి నమస్కారంచేసి సెలవు తీసుకున్నాడు. ముకుందం 'తప్పకుండా చేయాలి ముకుందం మంచివాడు నీతిపరుడు ఆస్తిపాస్తులు లేనివాడు' అని అనుకున్నాడు.

హైదరాబాద్‌లో తన చెల్లిని చూసి రాజారాంతో మాట్లాడి తిరిగొచ్చాడు సీతారామయ్య అసంతృప్తితో. హైదరాబాద్ వెళ్ళేముందున్న వుత్సాహం, ఆత్మస్థైర్యం, రెండూలేవు తిరిగొచ్చేటప్పుడు.

రాజారాం తనతో మాట్లాడలేదా, అంటే గంటకు పైబడి తనతో ఏకాంతంగా గడిపాడు. మరైతే అసంతృప్తెందుకు?

ఫలితం ఆశించినవిధంగా జరుగలేదు కాబట్టి.

రాజారాం తత్వం తనకు బోధపడలేదు. తన క్రమశిక్షణవల్ల ఎదిగిన రాజారామేనా అని అనిపించింది. పాపం ముకుందం! అనుకున్నాడు.

జీవితం చదరంగం. నలుపు తెలుపుల పోరాటం. కరెక్టు చీకటి వెలుగుల్లో తారాటం. పాపపుణ్యాలమధ్య ఆరాటం. మంచిచెడ్డల చెలగాటం. ఇవన్నీ టూ యిన్ వన్‌లలాగే తోచాయి.

చిరునవ్వు చిందించబోతే అట్టహాసం పదవులను చీల్చుకొని బయట ధ్వనించింది శృతి గతితప్పి అపశృతిలా తోచింది.

ఆత్మ—మనిషి మనసు వేరు వేరు కాని ఒకే పంజరంలో బంధింపబడ్డ శక్తులు. ఇది టూ యిన్ వన్ తత్వవిచారమే!

ముకుందానికేమని చెప్పాలి? అసలు ఆయనొస్తే ముఖం ఎలా చూపాలి? సీతారామయ్యకు సమస్యగా వుంది.

ఇక రెండు రోజుల్లో లిస్టు వేస్తారు. ముకుందం ఏ క్షణంలోనైనా రావచ్చు. సీతారామయ్య మనస్సు గి పెడుతోంది.

లిస్టు వేశారు. ముకుందం రాలేదు. ఇక ముందు కూడ ముకుందం రాడు. ముకుందం లాంటివాళ్ళు తనలాంటివాళ్ళు వారి దగ్గరకెప్పుడూ రారు.

రాకూడదు కూడ.

కారణం?

ముకుందం కొడుకు పేరుకు బదులు సీతారామయ్య పుత్రుడు రాజశేఖరం పేరు లిస్టులో వేశారు అందుకని.

క్రొత్తగా కొన్న టూ యిన్ వన్ని రాజశేఖరం ట్యూన్ చేశాడు. అది పాడుతున్నట్లులేదు. పగలబడి నవ్వుతున్నట్లుంది.

హరే రాం! సీతారామయ్య కూడ టూ యిన్ వన్ అయిపోయాడని గత జీవితం వెల వెల బోయింది.

# ధర్మో రక్షతి రక్షితః

## భాగం - 3

(గత సంచిక తరువాయి)

పరమేశ్వరుడు భుజాన్ని మూటవేసుకుని నెమ్మదిగా నస్తున్నాడు. మార్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. కాలికి జోడు లేకపోవటంవల్ల గెంగెలా అడుగులేస్తూ నడుస్తున్నాడు.

"ఏయ్ పంతులూ"...ఎవరో పిలిచినట్లయింది. ఆగి చూశాడు. ఎదురింటి అరుగుమీదనుంచి ఎవరో మధ్య వయసావిడ పిలిచింది.

ఒక్కక్షణం విస్తుపోయాడు. ఈ ఊళ్ళో తమ కుటుంబాన్ని ఎవరూ అలా పిలవరు. ఎవరీమె? కొత్తగా వచ్చిందా ?

ఊరు స్వరూపం మారిపోయింది. ఒకప్పుడు ప్రాథమిక విద్యమాత్రమే వుండేది. ఇప్పుడు పదో తరగతివరకూ వుంది. కొత్త మేష్టర్లు వచ్చారు. గుమాస్తాలొచ్చారు. ఒక సినిమా హాలొచ్చింది. కొబ్బరికాయల హోల్‌సేల్ దుకాణాలు...ఊరి స్వరూపమే మారిపోయింది.

రోడ్డు జంక్షన్‌ని కలుపుకుని తారు రోడ్డు వచ్చేసింది. బస్ ఊళ్ళోకి వచ్చేస్తోంది.

ఆ పిల్చిన ఇంటికే నడిచాడు.

"మేమీ ఊరికి కొత్తగా వచ్చేం. మా ఆయన సినిమాహాల్లో ఆపరేటర్."

"అయితే ఏమిటి ?" అన్నట్టు చూశాడు పరమేశ్వరుడు.

"మా మామగారి తద్దినం ... ఎల్లుండి... రాగలవా?" అడిగిందామె. ఆమెకు నలభై యేళ్ళు.

పరమేశ్వరుడికి నోట మాట రాలేదు. ఆమె పిల్చిన విధానం, అడిగినతీరు ... రెండూ అతని హృదయాన్ని గాయపరిచేయి. అయినా తమాయించుకున్నాడు.

"నేను అలాంటి వాటికి రానండి. ఊళ్లో ఇంకా పురోహితులున్నారు. ప్రయత్నం చేయండి !" అన్నాడు నెమ్మదిగా.

"ఏం ? మేమేం కాని వాళ్ళమా! కులం తక్కువవాళ్ళమా ?" అందామె.

"అదికాదండీ ... నాకా మంత్రాలు అంత ఇదిగా రావు."

"పోనీ మంత్రాలు రాకుంటే భోక్తగా రా" అందామె.

పరమేశ్వరుడికి ఇరవై ఆరేళ్ళు. పదేళ్ళుగా పౌరోహిత్యంలో తిరుగుతున్నాడు కాని ఇంతవరకూ ఇతన్ని అలా అడిగినవాళ్ళు లేరు. సరిగ్గా అప్పుడే పక్కింటి తలుపులు తెరుచుకుని సుబ్బలామె బయటకు వస్తూ ఆమె మాటలు వింది.

"అదేంటమ్మా ... ఆయన ఎవరనుకుంటున్నావు ? వేదపండితుడి కొడుకు. ఆయన తరువాత ఆయనంతటివాడు. ఎవరితో ఏం చెప్పాలో తెలియదా !" అంది పరమేశ్వరుడికి నమస్కరిస్తూ.

"మీకు కావలసిన బ్రాహ్మణుని నేను పంపుతాను. నేను రాలేనమ్మా...సెలవు" అంటూ పరమేశ్వరుడు అక్కడినుంచి కదిలేడు.

ఒకప్పుడా వూళ్ళో వాగ్మేశ్వరశర్మ ఒక్కడే పురోహితుడు. ఆయన తరువాత పరమేశ్వరుడు. కాని ఇంతలో శర్మగారి అల్లుడు పేరయ్యశాస్త్రి ... మామగారు పోవడంతో ఈ ఊరు వచ్చి అదే ఇంట్లో వుంటూ పౌరోహిత్యాలు చేసుకోవటం మొదలు పెట్టేడు. శర్మగారింటికేకాక...ఆశ్రమాలకు అతనే వారసుడయ్యేడు.

**జరిగిన కథ — 4** · యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు. ఆయన భార్య లలితాంబ. వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు, గౌతమశాస్త్రి, మీనాక్షిలు. పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు. శ్రీరాముడు అమలాపురంలో చదువుకొంటానంటాడు. దీక్షితులు పెద్దకుమారుడు పరమేశ్వరశాస్త్రికి, ధూళిపాళ సోమయాజులు ప్రథమ పుత్రిక సుబ్బలక్ష్మికి బాల్య వివాహం జరిపిస్తారు. గృహప్రవేశం అనంతరం పనిలో పనిగా గౌతమ శాస్త్రికి ఉపనయనం కూడా జరిపించేస్తారు దీక్షితులుగారు. సోమిదేవమ్మ మరణంతో ఓ తరం మారిపోతుంది. శ్రీరామ్ ఎస్.ఎస్.ఎల్.సి పాసవడంతో పాలిటెక్నిక్ చదువుతానంటాడు. దీక్షితులుగార్కి ఇష్టం లేకపోయినా లలిత నచ్చ చెప్పడంతో అంగీకరిస్తారు. తన చదువు అయ్యే వరకూ పెళ్లి చేసుకోనని తండ్రితో ఖచ్చితంగా చెప్పేస్తాడు శ్రీరామ్. తన కూతురి పెళ్లి కోసం అప్పు కోసం ఆనందరావ్ దగ్గరకు వెళ్లిన దీక్షితులు ఎన్నడూ ఊహించని విధంగా అవమానం పొందాడు.

శర్మగారి ఆశ్రమాలలో చాలాభాగం...అల్లుడు సంపాదించటంతో ... పరమేశ్వరుడికి ఆశ్రమాలు తగ్గిపోయాయి.

దానికి తోడు మరో ఇద్దరు బ్రాహ్మణులు పొట్టచేతోస్త పట్టుకుని వచ్చేరు.

పరమేశ్వరుడు మరికొంచెం ముందుకొచ్చేసరికి, ఒక బ్రాహ్మణుడు కొత్తగా పెలిసిన కాఫీ హోటల్ మెట్లు దిగుతున్నాడు.

"కామశాస్త్రి !" పిలిచేడు పరమేశ్వరుడు.

సైకిల్ ఎక్కబోతున్న కామశాస్త్రి పరమేశ్వరుణ్ణి చూశాడు. నల్లగా . . వుంగరాల జుట్టుతో ... పంచె, పైమీద తువ్వాలుతో వున్నాడతను. చేతికి రిస్టువాచీ వుంది. ముప్ఫయి యేళ్ళుంటాయి అతనికి.

"నమస్కారమండీ !"

"నమస్కారం. నాలుగో ఇంటావిడ ఇంట్లో ఆబ్దీకంట. వెళ్ళి కనుక్కోండి" అన్నాడు.

"అలాగే . . మిమ్మల్ని పిలిచారా ?"

"అవును. నాకు కుదరదన్నాను."

"నేను వెళ్తానులెండి" అన్నాడు కామశాస్త్రి.

పరమేశ్వరుడు తలూపి ఇంటికి నడిచాడు అతని మనసంతా చికాకుగా వుంది.

ఉదయం యాగ్గికానికి వెళ్ళినచోటనే అతనికి అవమానం జరిగింది. వెళ్ళినచోట వాళ్ళెంత ఇచ్చిందీ చూసుకునే అలవాటు దీక్షితులుగారికే కాదు, పరమేశ్వరుడికీ అలవాటులేదు. కాని వెళ్ళినచోట అతనికి అవమానం జరిగింది.

గృహప్రవేశం చేయిస్తున్నాడు. సినిమాహాలు ప్రొప్రయిటర్ ... స్వయంగా వచ్చి, తను కొత్తగా కట్టుకున్న ఇంటి గృహప్రవేశానికి ఆహ్వానించేడు. తను జరిపించాలని కోరేడు. తండ్రిని ఆశీర్వదించడానికి రమ్మన్నాడు.

పరమేశ్వరుడికి అవతలవాళ్ళిచ్చిన సంభావనతో నిమిత్తం లేకుండా .. ప్రతి దాన్నీ శాస్త్రీయంగా చేయించే అలవాటు. తన ధోరణిలో తను గృహప్రవేశం చేయిస్తున్నాడు. పుణ్యావచనం ... సత్యన్నారాయణ వ్రతం చేయిస్తున్నాడు. అయితే పీటల మీద కూర్చున్న యజమాని అప్పడప్పుడే పైకొస్తున్న వ్యాపారస్తుడు. ఎందరో స్నేహితుల్నీ వ్యాపార సంబంధమున్న వాళ్ళని పిలిచేడు. వాళ్ళంతా వస్తున్నారు. దాంతో యజమాని చేసే కార్యక్రమం కంటే, వచ్చిన వాళ్ళని పలకరించడంలో శ్రద్ధ చూపించడం మొదలుపెట్టాడు.

మనస్సు దేవునిపై లగ్నం చేయకుండా అతను చేస్తున్న పూజమీద పరమేశ్వరుడికి చాలా చికాకు కలిగించింది. చాలాసేపు మనసులో తర్జన భర్జన చేసిన తరువాత ... మందలింపుగానే అన్నాడు— "చూడండి...మీరు మనసు నిటు లగ్నంచేయాలి" అన్నాడు.

"ఇంకా ఎంతసేపండి ? తెమల్చండి" కొంచెం చికాకుగా అన్నాడతను.

దాంతో పరమేశ్వరుడి మనస్సు చివుక్కుమంది. దూరంగా శాలువా కప్పుకుని కుర్చీమీద కూర్చున్న దీక్షితులుగారికి వినపడింది.

పరమేశ్వరుడు తలెత్తి తండ్రికేసి చూశాడు. దీక్షితులుగారు తల త్రిప్పుకున్నారు

దీక్షితులుగారు తల తిప్పకోవటంలో వున్న ఆంతర్యం పరమేశ్వరుడు గ్రహించలేదు. కాని యజమాని అన్నదానికి మాత్రం సమాధానంగా అన్నాడు—

“మీరు చిత్తం చెప్పలమీద, భక్తి దేవుడిమీద అన్నట్లుగా వుండి లాభంయేమిటి ? మీరు శ్రద్ధతో చేయాలి. నేను శాస్త్రీయంగా చేయిస్తున్నాను. దానికి కొంత ఆలస్యం కావచ్చు” అన్నాడు. యజమాని ఒకక్షణం తెల్లబోయాడు. అతనెరిగిన బ్రాహ్మణుడింతవరకూ. “చిత్తం ... తొందరగా తెమల్చమని సెలవా...అలాగే చేద్దాం” అనే వాళ్ళే. అందువల్ల కొంత తడవు ఆశ్చర్యంచెంది మాట్లాడ లేదు.

సత్యన్నారాయణవ్రతం పూర్తయింది పెద్ద పెద్ద వేద పండితులకు, మిగిలిన బ్రాహ్మణులకు భారీగానే సంభావన లిచ్చేడా షావుకారు.

వ్రతం పూర్తయిన తర్వాత కథ చదువుతుంటే యజమాని లేచి. .వచ్చిన ప్రముఖుల్ని పలకరిస్తూ; వాళ్ళకి మర్యాదలు చూస్తూ వుండిపోయేడు.

కథ పూర్తయిన తరువాత వచ్చి కొబ్బరికాయ కొట్టి వ్రతం అయిందనిపించేడు.

వ్రతం పూర్తయింది. భోజనాలకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. పరమేశ్వరుడు తన సామాను సర్దు కున్నాడు. యజమాని తన హడావిడిలో తానున్నాడు. పరమేశ్వరుడు సెలవు తీసుకొందుకు యజమాని దగ్గరకు వెళ్ళాడు. అతగాడు 'మంచి'దన్నట్లుగా తలూపేడు. పరమేశ్వరుడు వెనక్కి తిరిగేడు.

అప్పుడు గుర్తొచ్చింది యజమానికి...పరమేశ్వ రుడికి దక్షిణ ఇవ్వలేదని.

“ఆదేమిటండి...డబ్బు తీసుకోకుండా వెళ్ళి పోతున్నారేమిటి ? నేనేదో హడావుడిలో మర్చి పోదుమ ... వుండండి ... తాంబూలం తీసుకుని వెళ్ళండి...” అన్నాడు.

“పుచ్చుకునే వుద్దేశ్యం నాకులేదు” అన్నాడు పరమేశ్వరుడు.

“అదేం?” ఆశ్చర్యపోతూ అన్నాడు

“నేను చేయించిన కార్యం ... యజమాని శాస్త్రీయంగా మనస్పు లగ్నంపెట్టి చేస్తే నాకానందం అలాకాక మొక్కుబడి తీర్చుకున్న విధంగా చేస్తే . దానివల్ల మికూ లాభంలదు...నాకూ అల్లాగ్గానే. పొట్టకూటికి చాలా వృత్తులున్నాయి. నేనీవృత్తి చేపట్టింది పొట్టకూటికేకాదు ... ఇహం పరమూ రెండువిధాలా శ్రేయస్కరమని ..ఇహ ఆపరంలేకపోయి నాకా ఈ ఇహం గురించి తాపత్రయం పెద్దగాలేదు. అందువల్ల మన్నించండి” అన్నాడు పరమేశ్వరుడు.

యజమానికి పరమేశ్వరుడి మాటలు సగం అర్థం అయ్యేయి, సగం అర్థం కాలేదు.

“చూడు పంతులూ .. నీ బిజినెస్ నీది...నా బిజినెస్ నాది. బిజినెస్‌కి కొంత శాంతం అవసరం... అంతేకాని ఏటలా ఎగిరి పడతావు ?”

పరమేశ్వరుడి హృదయం గాయపడింది. ఆర్ష విద్యలు పొట్టకూటికి వినియోగించుకోవాల్సిరావటం తన ఖర్మ. వాటిపట్ల...గౌరవం లేనిచోట యాగ్గికం చేయాల్సి రావటం పూర్వజన్మ పాపం.. వాపోయేడు.

“ఇంద...తీసుకోండి. .” మరో పాతిక జతచేసి వందరూపాయలు తాంబూలంలో పెట్టి ఇవ్వ బోయాడు



గ్రహించను. మరోసారి మీరు భక్తి శ్రద్ధలతో ... కార్యం చేయండి. అప్పుడు మీరు తాంబూలామే ఇచ్చినా నేను అంగీకరిస్తాను'' అన్నాడు పరమేశ్వరుడు.

అప్పటికే యజమాని తాలూకు వాళ్ళు ఇద్దరు అక్కడికి వచ్చారు. దాంతో యజమానికి తీవ్రంగా కోపం కలిగింది.

''ఎల్లవయ్యా ... ఎల్లు ... ఊర్లో నువ్వొక్కడివే బ్రాహ్మడివికావు. ఎలాసెప్తే అలా చేయించి కనిపెట్టుకుని మమ్మల్ని సూసేవాళ్ళు సాలామంది వున్నారు'' అన్నాడు.

పరమేశ్వరుడు మాట్లాడలేదు. తలదించుకుని వచ్చేశాడు. విచారంతో అతని హృదయం అట్టుడికి పోయింది.

అక్కడినుంచీ వస్తూంటే ఈమె పలకరింపు, ఈ అవమానమూను.

పరమేశ్వరుడు జారిపోతున్న మూటను ఎగదోసుకుని నడవటం మొదలుపెట్టాడు.

తండ్రిలా తనూ వేద పఠనం మాత్రమే చేయాల్సిందేమో. అన్ని తపస్సులలోనూ ఉత్తమోత్తమమైన తపస్సు వేద తపస్సు. ఆ వేద తపస్సు మాని, పొట్టకూటికి అర్థ విద్యల్ని ఉపయోగించుకుని అవమానాల పాలవుతున్నాడు.

కానీ జీవనమో...? వేదశాస్త్ర మీమాంసకుల్ని ఒకప్పుడు ప్రభువులు ఆదరించేవారు. అగ్రహారాలిచ్చేవారు. అన్నోదకాలకు లోటు లేకపోవడం వల్ల వారు పఠనం చేసుకుంటూ శాస్త్ర చర్చల్లో కాలం గడిపేవారు. ప్రభువులకు సలహాలిచ్చే మేధావి వర్గంగా నిలిచిపోయేవారు.

అయితే కాలం మారిపోయింది. ప్రజాప్రభువులొచ్చేరు. అగ్రహారాలూ, జమీలు అంతరించాయి. ఈనాడు వేద పఠనచేస్తూ కూర్చుంటే సంసారాలు నడవవు. యజ్ఞయాగాదులు పూర్తిగా ఆగిపోయాయి. తన తండ్రి, యజ్ఞయాగాదులకు ఋత్విజుడుగా వెళ్ళి రెండేళ్ళు దాటిపోయింది. అప్పుడెప్పుడో సూరయ్యగారు కాకినాడలో రుద్రయాగం చేయించినప్పుడు వెళ్ళారు. ఆ తరువాత ఈ చుట్టుపక్కల జరిపిన యాగాలు లేవే.

పరమేశ్వరుడు కొత్తగా వెలిసిన పంచాయితీ గ్రంథాలయం దగ్గరకొచ్చేడు. అక్కడ కొంతమంది కుర్రాళ్ళు కూర్చుని బిగ్గరగా మాట్లాడుకుంటున్నారు. అంతా పాంటూ చొక్కా ఈడు వాళ్ళే. అందులో కొందరు వేసుకున్న పాంటుల్లో ఏనుగుల్ని దూర్చవచ్చు — అంత వదులుగా వున్నాయి. మరి కొందరి జుట్టు ఏడాదికోసారి ఆ ఊళ్ళో కార్యక్రమానికొచ్చే భామా కలాపంలో కృష్ణుడి జుట్టులా వుంది. చెవుల్ని దాటి చెంపలమీద పడుతోంది. వాళ్ళు తెలుగు ఇంగ్లీషు కలగలిపి మాట్లాడుకుంటున్నారు.

వాళ్ళల్లో వాళ్ళు నవ్వుకుంటున్నారు. కొందరు రాజకీయాలు మాట్లాడుకుంటుంటే, కొందరు ఉద్యోగాలు గురించి మాట్లాడుకుంటున్నారు. మరి కొందరు వయసు పొంగు కోరుకునే ... కబుర్లు చెప్పుకుంటున్నారు.

వాళ్ళ మధ్యలో వున్నాడు శ్రీరామ్. తెల్లటి పాంటు, పైన పాలిష్టర్ షర్టు; హుందాగా వున్నాడు. అతని పక్కన బుచ్చిరాజు పెద్దకొడుకు కాటంరాజున్నాడు. బుచ్చిరాజు ఒకప్పుడు పెద్దరైతే కాని ఇప్పుడు భూస్వామి అయిపోయాడు. పెద్ద కొడుకు పట్నంలో శ్రీరామ్‌తోటే ... సివిల్ ఇంజనీరింగ్ డిప్లమో తీసుకున్నాడు. ప్రస్తుతం నిరుద్యోగి ... చిన్నకొడుకు సుబ్బరాజు మాత్రం గౌతమ్ సహాధ్యాయిగా ... ఆతనితోపాటు ఈ ఊరి మిడిల్ స్కూల్ దాటకుండా వుండిపోయాడు. విసుగెత్తి చివరకు చదువు మానుకున్నాడు.

కాటమరాజు చేతిలో సిగరెట్ పొగలు కక్కుతోంది. అతనేదో అంటున్నాడు బిగ్గరగా. పక్కనున్న శ్రీరామ్ నవ్వుతున్నాడు.

ఇవతల పక్కనున్న ఏడుకొండలు కూడా నవ్వుతున్నాడు. ఏడుకొండలు హరిజనుడు. అతని తండ్రి పంచాయితీ మెంబరు. అంతేకాదు పదెకరాల భూవసతీ, హరిజనవాడకెళ్ళే దారిలో మిద్దె వుంది. అతనూ శ్రీరామ్‌తో అదే కోర్సు చదివేడు. అయితే అతనికేదో హాస్టలు పదుపాయం, అవీ కల్పించి ప్రభుత్వం కొంత వేతనమిచ్చి చదివించింది. ఏడుకొండల్ని చూడగానే పరమేశ్వరుడికి హరిజనవాడ గుర్తుకొచ్చింది.

పూర్వం హరిజనులు పుర ప్రవేశం చేసేవారు కాదట. అలాచేస్తే అగ్రజాతివారు విరుచుకు పడేవారట. ఎంత అమానుషం! సాటి మనిషిమీద ఎంత హింసా ప్రవృత్తి! అద్వైతానికి ఆదిగురువులు శంకరాచార్యులు. అలాంటి శంకరాచార్యులవారు అద్వైత వాదం ప్రతిపాదించింది. చండాలుడి వేషంలో వచ్చిన పరమేశ్వరుడిని ఎదుర్కొన్న తరువాతనేకదా! అంటే శంకరుడు మరే వేషమేమీ లేనట్లు మాలవాడివేషమే ఎందుకు కట్టినట్టు?...అప్పుడేకాదు...కిరాతార్జునీయం తను చదువుకున్నాడు. అర్జునుడికి పాశుపతాస్త్రం ఇచ్చే ముందు కిరాతుడుగా వచ్చేదే ... శంకరుడు... ఎందుకూ?

దశావతారాల్లో ఒక్కొక్క అవతారం ... ఒక్కొక్క జీవరాశి ... ఒక్కొక్క కులానిదీను. అంటే పరమేశ్వరుడు సర్వజీవరాసుల్లోనూ తను నిండి వున్నానని చెప్పటానికి కాదా?

ఎందుకీ కులోన్మాదాలు? అలా హరిజనవాడలో కెళ్ళి చూస్తే ఏ మానవత్వమున్న మనిషి మనసూ కరగదా. విద్యాగంధంలేక, కడుపునిండా కూడులేక, కట్టుకోవడానికి పుట్టగోచీ లేకా...అల్లాడుతున్నారే.

ఏ ఏడుకొండలో చదువుకున్నా చదువుకోక పోయినా ఫర్వాలేదు. తండ్రి తాలూకు పొలం వుంది. వ్యవసాయంచేసుకుంటాడు. కాని వాళ్ళతో!

ఆలోచనలు పరమేశ్వరుడితో నడుస్తున్నాయి.

''ఒరేయ్. మీ అన్నయ్య పనినయంరా. ఓ అంటె ఢం రాకపోయినా మీ వాడి కాలికి దణ్ణంపెట్టి మరీ డబ్బులిస్తారా!'' ఎవరో బిగ్గరగా నవ్వుతూ శ్రీరామ్‌తో అంటున్నారు.

అంతా గొల్లుమని నవ్వేరు.

''మనమూ వున్నాము ... చదువుకుని ..., ఉద్యోగాలులేక ఏడుస్తున్నాం'' మళ్ళీ అంతా గొల్లుమని నవ్వేరు.

పరమేశ్వరుడు తల తిప్పలేదు. వాళ్ళమాటలు వినబడినా వినబడనట్లే ముందుకు కదిలాడు.

తనకి ఓ అంటే ఢం రాదు...చదువుకోవాలని తను అనుకోలేదు. చదువంటే తను ఎ బి సి డి అని అనుకోలేదు. తను కృష్ణయజుర్వేదం 82 పన్నాలూ చదువుకున్నాడు. పదేళ్ళు శ్రమించి చదువుకున్నాడు. పంచకావ్యాలు పఠించేడు. ఇదంతా చదువని తను భ్రమలో వుండిపోయేడా? తనూ తమ్ముడిలా ఇంగ్లీషు చదువు చదువు కోవాల్సిందేమో!

ఏమిటీ పిచ్చి ఆలోచనలు? తల విదిల్చుకున్నాడు. సరిగ్గా ఫ్యాన్సీషాపు ముందర కొచ్చేసరికి







భార్య సుబ్బలక్ష్మి చెప్పిన మాట గుర్తొచ్చింది. పాలడబ్బా తీసుకురమ్మని చెప్పిన విషయం. సుబ్బలక్ష్మికి తొలిచూలు మగబిడ్డడు. రెండేళ్ళు నిండబోతున్నాయి. మలిచూలు ఆడపిల్ల ...ఆరునెలలు. తల్లికి పాలుపడలేదు. ఇంట్లో ఇదివరకులా నాలుగైదు ఆవులు లేకున్నా ఇంటబుట్టిన దూడవుంది కాని ఆ పాలు పిల్లకు అజీర్ణం చేసింది. దానితో పాలడబ్బా వాడమని సలహా ఇచ్చాడు ప్రైమరీ హెల్తు సెంటర్ డాక్టరు.

పరమేశ్వరుడు రొంటినున్న డబ్బుతీసి లెక్కపెట్టేడు. పదకొండు రూపాయిలుంది. గత రెండు మూడు రోజులుగా పరమేశ్వరుడా కొట్టు అతన్ని .. పాల డబ్బా విషయం అడుగుతూనే వున్నాడు. అయితే . పసిపిల్లల పాల డబ్బాల్ని దాచేసి వాటితో మేడలు కడుతున్నారో ఏంటో..."లేవండి...రేపు రండి"... అన్నాడా షావుకారు.

ఇప్పుడు కంటికి ఎదురుగా వున్నాయి. కాని ఇప్పుడు తన చేతిలో రెండు రూపాయలు తక్కువగా వున్నాయి.

తను వెళ్ళి అడిగితే...అతనా రెండు రూపాయలు అరువు ఇవ్వవచ్చు. కాని పరమేశ్వరుడికి అడగబుద్ధి కాలేదు. ఇంటి ముఖం పట్టేడు.

నిజానికా సినిమా హాలతను గృహప్రవేశంకి ఇచ్చిన డబ్బులను తీసుకునుంటే ... ఈ పాలడబ్బా కొనడమేకాదు, వచ్చే సంక్రాంతికి పిల్లలకు బట్టలు, సుబ్బలక్ష్మికొక చీర కొనగలిగేవాడేమో. తను పొరబాటు చేశాడా ? మొదటిసారిగా ఇన్నేళ్ళ తన ప్రవర్తన విషయం తను పునర్ విమర్శ చేసుకున్నాడు పరమేశ్వరుడు.

తనూ ఎటూ నిర్ణయించుకోలేకపోతున్నాడు. మనసు ఆందోళనగా వుంది. ఇంటికెళ్ళేసరికి ... నెయ్యి మనిషి అరుగుమీదనే ఎదురు చూస్తూంటుంది. ఇంట్లో నెయ్యి వాడకం ఎక్కువ. ఆవు నెయ్యి ... తండ్రి యజ్ఞవాటికకు కటా కటిగా సరిపోతుంది. చేతిమీదకు కొనుక్కోవాల్సిందే. నెయ్యి మనిషికి నలభై రూపాయలివ్వాలి. చేతిలో వున్నది పదకొండు రూపాయలు. ఇందాకా తండ్రి తాంబూలాలు ఇచ్చే వరకూ వున్నాడా ? లేదా ? లేదు ... వెళ్ళిపోయేడు. ఆయన దగ్గర ఏం డబ్బా వుండి వుండదు. ఆలోచనలతో జోరుగా నడుస్తున్నాడు పరమేశ్వరుడు.

## 2

"నా కసలు అలవాటులేదు. నన్ను బలవంతం పెట్టకండి" అన్నాడు శ్రీరామ్ నెమ్మదిగా.

అంతా నవ్వేశారు.

అంతా కల్పి పదిహేనుమంది కుర్రాళ్ళున్నారు అంతా చదువుకున్న వాళ్ళే. వాళ్ళ ఊళ్ళోవాళ్ళూ, పక్కనున్న గ్రామంలోవాళ్ళూ కుర్రాళ్ళంతా కలిసి పడవెక్కి లంకకు చేరారు.

గోదావరి మధ్యలో మేటవేసింది ఎండ తీక్షణంగా లేదు. గోదావరి చల్లగాలి వాళ్ళకి ఉల్లాసాన్ని కలిగిస్తోంది.

చుట్టుపక్కల జనసంచారంలేదు కోటిపల్లి నుంచి ముక్తేశ్వరం వెళ్ళే పడవలు, లంకను చుట్టి వెళ్ళిపోతున్నాయి. మిత్రులంతా, పడవెక్కి మేట వేసిన లంకకు చేరుకున్నారు.

పడవలోంచి దుప్పట్లు, తినుబండారాలు, పేకలు, మందు బాటిల్స్, సోడాలు, సిగరెట్లు దింపుకున్నారు.

దుప్పట్లు పరుచుకుని ముందు మందు ఓ పెగ్గు కొట్టి భవిష్యత్ కార్యక్రమం చర్చించుకుందుకి అంగీకారం కుదిరిపోయింది.

ఆ రోజు పార్టీ ఇస్తున్నది కాటమరాజు అతగాడికి విశాఖపట్నంలో మంచి ఉద్యోగం వచ్చింది జీతం తొమ్మిది వందలు రూపాయలు. అయితే ఆ ఉద్యోగం ఇంటర్వ్యూ అవగానే తండ్రి బుచ్చిరాజు విశాఖపట్నం వెళ్ళేడని, వెళ్ళేటప్పుడు నోట్లకట్టలతో వెళ్ళేడని, కొందరన్నారు. అక్కడినుంచి వచ్చి హైదరాబాదు వెళ్ళి నాయకుల్ని కలుసుకున్నాడని కొందరన్నారు ఏదిఏమైనా కాటమరాజు మాత్రం ఉద్యోగస్తుడయ్యేడు.




ఆ సందర్భంలోనే మిత్రులకు విందు . మందు ఏర్పాటు చేశాడు. శ్రీరామ్ రానని కూర్చున్నప్పటికీ మిత్ర బృందం వల్ల బయల్దేరక తప్పలేదు;

గ్లాసులో పానీయం పోశాడు దత్తుడు, దత్తుడు ఊరికి దత్తుడు, కుర్రకారుకి నాయకుడు మకుటంలేని మహారాజు. దానికి కారణం అతని వెనుక నున్న యాభై ఎకరాల పొలం .., నాయుడుగారి దత్తత పుత్రుడు కావటమే

అంతా గ్లాసులెత్తేరు

"తీసుకోవోయ్ . . శ్రీరామ్ . " అన్నాడు దత్తుడు.

"నాకసలు అలవాటులేదు. నన్ను బలవంతం పెట్టకండి" నెమ్మదిగా అన్నాడు శ్రీరామ్.

"అలవాటు తీసుకుంటే అదే అవుతుంది. తీసుకో" అన్నాడు కాటమరాజు.

"వద్దండి ..నా కసలు వాసనేపడదు."

"ఆకాటికి మేమంతా పుట్టిన దగ్గరనుంచీ ఉగ్గు కాకముందే తాగినట్టు మాట్లాడతావేంటి! ఫర్వాలేదు. లాగించేయ్" నవ్వేడు దత్తుడు.

"నేనందుకే రానన్నాను."

"ఇదెక్కడి వెర్రి బ్రాహ్మడయ్యా ! మా కాలేజీలో ఓ పంతులుండేవాడు కోడి తొడ అంటే పడి చచ్చేవాడు. మ అంటే మ పక్కన సున్నావుందా, ఆ పక్కన 'దు' అంటూ దూసుకొచ్చేవాడు. వాడి భోజనం నెలలో సగంరోజులు మా నాన్ విజిటేరియన్ హాస్టల్‌లోనే" అన్నాడు మరొకడు

శ్రీరామ్ లేచేడు.

"కూర్చో పంతులూ. ఎక్కడికి" అన్నాడు ఏడుకొండలు.

శ్రీరామ్ మాట్లాడలేదు. దూరంగావున్న మరో బృందంకేసి నడవబోయాడు.

"కూర్చోవయ్యా ! నీలాంటి మడి వాళ్ళకోసం 'గోల్డ్‌స్పాట్'లున్నాయి" అన్నాడు దత్తుడు.

శ్రీరామ్ కూర్చున్నాడు

గోల్డ్‌స్పాట్ గ్లాసులో పోశారు.

గ్లాసులు ముద్దు పెట్టుకున్నారు.

"ఛీర్స్ !" గొంతుకలు లేచాయి.

## ధర్మో రక్షతి రక్షితః

ఒక గుక్కతాగి అన్నాడు దత్తుడు —

"అసలు బ్రాహ్మలు సోమరసపానం చేసే వారట...యజ్ఞాలు చేసేటప్పుడు మాంసంతినకుంటే తప్పట, ఇవన్నీ వదిలేసి మడి...తడి అంటేఎలాగ?"

శ్రీరావ్‌కి ఆ 'కంపెనీ' ఇరుకుగా వుంది రెండు గుక్కల్లో డ్రింకు తాగేశాడు.

"నీకంటే గౌతమ్ నయం గురూ. మందు వరకూ ఎదిగేడో లేదో కాని మట్టు దాటేశాడు" అన్నారెవరో.

శ్రీరావ్‌కి అక్కడ వుండబుద్ధి కాలేదు. లేచి నెమ్మదిగా ... గోదావరి ఒడ్డు కొచ్చేశాడు. లంకని రాసుకుంటూ పడవ ముక్తేశ్వరం వెళుతోంది. అందులో ఆడవాళ్ళు ... ముసలాళ్ళు, యువకులు, బిచ్చగాళ్ళు, బ్రాహ్మలు . . మాలాళ్ళు .. మాదిగాళ్ళు...రెడ్లు...కమ్మలూ అందరూ వున్నారు అంతా పడవలో కూర్చుని వున్నారు. అందరి ధ్యేయం ఒక్కటే. అంతా ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకి చేరాలి. అంతా కూర్చున్నారు.

అలాగే 'బతుకు' అనే పడవలో ప్రయాణం సాగించేవాళ్ళ గమ్యంకూడా ఒకటేగా.

మరి ... వాళ్ళల్లో వాళ్ళ కెందుకీ కులాల ప్రసక్తి ... ! శ్రీరావ్‌కి చికాకుగా వుంది.

ఈ చికాకుకి కారణం కాటమరాజుకి ఉద్యోగం రావటమా ? తనూ ... కాటమరాజు కలసి చదువుకున్నారు. కాటమరాజు లెక్చరర్లని 'కాకా' పట్టేవాడు. జున్ను, పాలు, నెయ్యి... కందులు.. పెసలు సప్లయి చేసేవాడు. తను అవేం చేయలేకపోయాడు అంతమాత్రంచేత తనకేం అన్యాయం జరుగలేదు. తన ఫస్టు క్లాసు తనకి రానేవచ్చింది. మూడు సంవత్సరాలూ తను ఫస్టు క్లాసులోనే వచ్చేడు. కాటమరాజు మొదటి రెండేళ్ళూ అత్తెసరు మార్కులతో ప్యాసయ్యేడు. మూడో ఏడాది సప్లయ్‌లు — అత్తెసరు ప్యాసునుంచి సెకండ్ క్లాసుకి మార్చగలిగేయి.

జస్ట్ సెకండ్ క్లాసులో ప్యాసయ్యేడు.. తను చాలా కంపెనీలకు అప్లయ్ చేశాడు. ఉద్యోగం రాలేదు.

తనూ..., కాటమరాజు కలిసే ఇంటర్వ్యూకెళ్ళేరు. ఇంటర్వ్యూలో తను అన్ని ప్రశ్నలకు సమాధానాలు బాగా చెప్పేడు. పైగా డెబ్బయ్ శాతంతో ప్యాసయినందుకు ఇంటర్వ్యూ మెంబరు అభినందించేడు. అయితే అభినందనే మిగిలింది. ఉద్యోగం కాటమరాజుకి దక్కింది. ఏడాది గడిచిపోయింది నిరుద్యోగంలో... ఇంకా ఎంత కాలం... ?

ఎక్కడికి వెళ్ళినా కులం... ఇంటి పేరు ఏమిటి ? ఇవే ప్రశ్నలు. కులాన్ని గొయ్యితీసి పాతెయ్యాలి. అసలు మనుష్యుల్ని అవి అప్రయోజనం. ప్రభుత్వమే అనుక్షణం గుర్తుచేస్తోంది. స్కూల్‌లో మొదటి తరగతిలో జాయిన్ కావటానికిచ్చే అప్లికేషన్ మంచి ఉద్యోగానికి అప్లికేషన్‌వరకు... కులం... ఏమిటి ? అన్నదే ప్రశ్న. అసలా ప్రశ్న ఎందుకూ ? ప్రజాస్వామికం; ప్రపంచంలో పెద్ద ప్రజాస్వామిక దేశం... సెక్యులర్ స్టేట్... అని గొంతు చించుకునే రాజకీయవేత్తలు ఆ విషయం ఆలోచించరేం ?

> **కలసి పనిచేస్తే ఆర్థికాభివృద్ధి!**
>
> ఆఫీసుల్లో నలుగురితో కలసిమెలసి పని చేయడమే సంతోషకరం అని ఎక్కువమంది జపాను ప్రజలు భావిస్తున్నారు. నలుగురు కలసి పనిచేసేచోట తగినంత సమాచారం లభిస్తుంది. అంతేగాక ఆఫీసుల్లో సమైక్యతా సోదరభావాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. జపాను ఆర్థికాభివృద్ధికి మూలకారణం ఇదేనని భావిస్తున్నారు. విదేశీయులనుండి పూర్తి సమాచారం అందనప్పటికినీ, అమెరికన్లకు జపనీయులకు ఇందులో వ్యత్యాసమున్నట్లు ఒక సర్వేలో తేలింది. ఎక్కువ మంది అమెరికన్లు ప్రత్యేక గదులను, ప్రత్యేక డెస్కులను కోరుకుంటారు. జపాను ప్రజల్లో ఆరు శాతం మాత్రం ఆఫీసుల్లో ప్రత్యేక గదులను కోరుతున్నట్లు ఈ సర్వేలో తేలింది.

ఏమిటిది ? ఏమిటి తన ఆలోచనలు ? ఉద్యోగం తనకు రానందుకు విచారిస్తున్నాడా ? లేక కాటమరాజు పలుకుబడిలోనే, పచ్చనోట్లతోనే వుద్యోగం సంపాదించుకున్నందుకు ఈర్ష్యపడుతున్నాడా ?

రాయి తీసి నీళ్ళల్లో విసిరేడు. అలలు ఒడ్డును తాకుతున్నాయి... విడిపోతున్నాయి.

"ఇక్కడ కూర్చుండిపోయేరేం ?" అన్నాడు ఏడుకొండలు.

"ఏంలేదు."

"వచ్చేశారు వాళ్ళు... పదండి."

"ఎవరూ ?"

"మీకు తెలియదా ?"

"ఏంటి ?"

"దత్తుడుగారు మురమళ్ళ నుంచి అమ్మాయిల్ని పిలిపించేరు."

"వాళ్ళొస్తున్నట్టు నాకు తెలియదు."

"పెట్రొమేక్స్ లైట్లు వచ్చేయి... ఈ రాత్రి ఇక్కడే శివరాత్రి..."

శ్రీరావ్ కాళ్ళల్లోంచి వణుకు పుట్టింది.

"నేను వెళ్ళిపోవాలి..."

"ఎక్కడికి ?"

"ఇంటికి."

"ఇప్పుడింకేం పడవలు లేవే ?"

"ఆడవాళ్ళొచ్చిన పడవ ఏదీ ?"

"అదిగో బయల్దేరబోతోందిగా" అన్నాడు ఏడుకొండలు.

కొంచెం దూరంలో పడవ ఒడ్డును వదులుతోంది. గెడ పెట్టి తోస్తున్నాడు పడవవాడు.

శ్రీరావ్ పరుగు పరుగున అందుకున్నాడు ఒడ్డును వదలబోతున్న పడవను. కాలు నీళ్ళల్లో పడింది. మోకాలి వరకూ బంక అంటుకుంది. విదిలించుకుని పడవలో అడుగు పెట్టాడు.

**(ఇంకా వుంది)**



'టింగు రంగడు'లో చిరంజీవి

కారులో జోరుగా బయలుదేరిన రంగడు (చిరంజీవి) దారిలో రాధ (గీత)ను చూసి, "ఎక్కడి కెళ్లాలి, మరదలు పిల్లా ?" అన్నాడు ఉషారుగా.

"కొంచెం కారాపు ఫ్రెండ్, బావా!" అంది రాధ.

"ఎందుకు ?" అంటూ రంగడు బ్రేక్ వేశాడు.

తాపీగా అతని పక్కన కూర్చున్న రాధ వెంటనే తీవ్రరూపం దాల్చి, "చూడూ ... మా అంకుల్ ఇంట్లో తిష్టవేసి, మా ఆంటీని మాయమాటలతో లోబరుచుకున్నా ... హూఁ ... నన్ను మాత్రం కళ్ళు కప్పలేవు, మిస్టర్ ! చూడు – విన్నేం చేస్తానో–" అంటూ హఠాత్తుగా తారస్థాయిలో "హెల్ప్! హెల్ప్! ఏమండీ ... రక్షించండి ... హెల్ప్!" అంటూ కేకలెట్టసాగింది.

జనం చుట్టూచేరారు. ఒకడు "ఏమిటమ్మా? ఏమైంది ?" అని ఆదుర్దాతో అడిగాడు.

"ఈ దొంగ రాస్కెల్ బలవంతంగా నా కారెక్కి, అల్లరి చేస్తున్నాడండి," అంది రాధ.

లేదండి ... అంతా అబద్ధమండి," అన్నాడు.

"ఊర్కోవయ్యా ... మస్వేం చేయకుండానే ఒక గొప్పింటి ఆడపిల్ల రోడ్డెక్కి గొడవ చేసుకుంటుందా ? చూసా[illegible] – సెంటర్ మార్కెట్లోకా కొట్టండ్రా !" అని ఓ పెద్దమనిషి అన్నాడో లేదో సమూహంతంగా నలుగురు రంగడిమీద పడబోయారు. రంగడు ఇటు అటు చూసి, "ఆగండి...పోలీసులు!" అన్నాడు.

దాంతో జనం అతన్ని విడిచిపెట్టారు. "చాలా థాంక్సండి. సమయానికొచ్చి కాపాడారు," అంటూ రాధ ఆ జనానికి కృతజ్ఞతలు చెప్పకునేసరికి రంగడి ముఖం జేవురించిపోయింది. పళ్ళు పటపటలాడిస్తూ, "మరదలు పిల్లా ! నన్నే కొట్టిద్దాం అనుకున్నావ్ కదూ ? ఊఁ !" అంటూ కారును స్టార్ట్ చేశాడు.

తాతినేని ప్రసాద్ కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో తాతినేని ప్రకాశరావు నిర్మించిన అనిల్ ప్రొడక్షన్స్ "టింగు రంగడు" చిత్రం త్వరలో విడుదలవుతుంది.

'త్రిశూలం'లో కృష్ణంరాజు, రాధిక

## ప్రముఖ దర్శక నిర్మాత స్టూడియో అధినేత పాలువాయి రామకృష్ణ షష్ట్యబ్దిపూర్తి

"మా జీవితాలలో మేమిద్దరం మళ్ళీ రెండోసారి పొరబాటు చేస్తున్నాం," అన్నారు డాక్టర్ భానుమతీ రామకృష్ణ తన సహజ హాస్య ధోరణిలో – ఆగస్ట్ 8న పి. రామకృష్ణ షష్ట్యబ్దిపూర్తి మహోత్సవం చాలా నిరాడంబరంగా జరిగినప్పుడు..." మా వారు మొదట్నుంచీ చాలా షై... అసలు ఈ ఫంక్షన్ చేయటం వారికిసుతరామూ ఇష్టంలేదు. న్యూజెర్సీలో ప్రాక్టీస్ చేస్తున్న మా అబ్బాయి డాక్టర్ భరణి సతీసుతులతో పనికట్టుకుని ఇంతదూరం వచ్చింది ఈ వేడుకను కళ్ళారా చూసి తరించడానికి. ముఖ్యంగా మా అబ్బాయి పట్టుపట్టడం వల్లే ఈ శుభకార్యం జరిగింది. మళ్ళీ మా అబ్బాయి ఫ్యామిలీతో న్యూజెర్సీకి 11న తేదీన వెళ్ళిపోతున్నాడు. మా మనుమరాలు మీనా, మనుమడు వెంకటేశ్ ఇంత కాలం మాకెంతో కాలక్షేపంగా ఉన్నారు. ఇప్పుడు వాళ్ళంతా వెళ్ళిపోతే, మా ఇల్లు కొన్ని రోజుల వరకు చిన్నబోయినట్లుంటుంది. ముఖ్యంగా మా మనుమరాలు మీనా రూపంలోనూ, ప్రవృత్తిలోనూ చాలా వరకు నన్ను పోలి ఉంది. అందుకే నాకెంతో అటాచ్డ్. 'భక్తధ్రువ మార్కండేయ' చిత్రాన్ని రిలీజ్ చేశాక రెండు మూడు నెలల్లో స్టేట్స్‌కు వెళ్ళి కొంతకాలం ఉండిరావాలని ఉంది. మా అబ్బాయీ, కోడలూ రమ్మని ఎంతో రిక్వెస్ట్ చేశారు కూడా. వెళ్ళొచ్చాక ఇక్కడ కదుపులో చల్ల కదల కుండా ఊర్కే కూర్చోలేను. ఏదో వ్యాపకం ఉండాలి. అదే నాకు రిక్రియేషన్, రిలాక్సేషన్. నేనూ, జానకీ నటించే చిత్రాన్ని స్టేట్స్ నుంచి వచ్చాక మొదలెడ్తాను," అన్నారు భానుమతి.

# నాకు నచ్చిన జోక్‌లు!

— సుజాత

తన చుట్టూ ప్రదక్షిణం చేస్తూన్న భక్తుని వినాయకుడు ప్రశ్నించాడు : "ఏమిటబ్బాయ్, పువ్వులు మాత్రమే తెచ్చావ్ ? నువ్వు బి. యే. పాసయితే 108 కొబ్బరికాయలు కొడ్తానని మొక్కుకున్నావే ? జ్ఞాపకముందా ?"

"ఎలా మరచిపోగలనండీ ? కాని, నేనిప్పుడు పాసయింది ఒక పార్ట్‌లోనే కదా, స్వామీ ?" అన్నాడా విద్యార్థి.

"ఐతే, ఇప్పుడు 36 కొబ్బరికాయలు కొట్టి, మిగతావి మిగిలిన రెండు పార్టులూ పాసయినప్పుడు కొట్టవచ్చు కదా ?" అన్నాడు వినాయకుడు.

విద్యార్థి ఆలోచనలో పడ్డాడు.

* * *

"నా గురించి గిన్నిస్ వరల్డ్ రికార్డ్ బుక్‌లో ఎప్పుడు అచ్చవుతుందో ?"

"అంతగా నువ్వు సాధించిన విశ్వదాఖలా ఏమిటోయ్ ?"

"ఇంతవరకు కనీసం ఇరవై వేలకు పైగా కలలు కని ఉంటాను. కాని, విషయాన్ని ఎలా నిరూపించడం ?"

* * *

"అయ్యగారూ ! ఎందుకో ఈమధ్య మీకు నామీద నమ్మకం కాస్త తగ్గినట్లు అనిపిస్తోంది. నావల్ల ఏదైనా పొరబాటు జరిగిందంటారా ?"

"ఛ...ఛ... నమ్మకం లేకపోతే — మొన్న వినాయకచవితి రోజున నేను గుడికి వెళ్లేటప్పుడు నిన్ను ఇంటికి కాపలాగా ఉంచి, ఇనప్పెట్టె బీగాలు కూడా నీదగ్గరే ఇచ్చిపోతానట్రా ?"

"ఎందుకయ్యగారూ, అబద్ధం చెప్తారు ? ఆ బీగాలు ఇనప్పెట్టివా ? మీరే చెప్పండి."

* * *

"అమ్మా ! కాస్త అన్నం పెట్టండమ్మా."

"నిన్నటిదైనా పరవాలేదా ?"

"ఆకలి కడుపుకు ఏదయితేనేం, తల్లీ !"

"ఐతే, రేపు రా !"

* * *

"డాక్టర్‌గారూ ! కుడుములు, ఉండ్రాళ్ళు విపరీతంగా మెక్కి ఆయాసపడుతున్నవారి చేత ఆముదం తాగించడం ఎలాగంటారు ?" అని అడిగాడో యువకుడు.

"చెప్తాను... కాస్సేపు కూర్చో... మంచి ఎండలో వచ్చావు. డ్రింక్ ఏమైనా తెప్పించమంటావా ? లెమనేడ్ తీసుకో — ఎండకు పోయిగా ఉంటుంది," అంటూ డాక్టరు, నర్సుతో ఆ విషయం చెప్పాడు.

నర్సు తెచ్చిన బాటిల్‌ను ఆ యువకుడు ఖాళీ చేశాడు.

"లెమనేడ్ బాగుందా ? ఆముదం వాసన కొట్టలేదు కదూ ?" అని డాక్టర్ చిరునవ్వుతో అడిగేసరికి యువకుడు నెత్తి బాదుకుంటూ, "అయ్య బాబోయ్ ! నాచేత తాగించేశారా ? అసలు ఆముదం తాగించాల్సింది మా అత్తగారికండి... కొంప మునిగింది. ఇక వస్తా !" అంటూ ఏకాయేకీన ఇంటికి పరుగుతీశాడు.

* * *

"రోజు రోజుకీ ఈ పాపిష్టి ప్రపంచంలో అన్యాయాలు మితిమీరిపోతున్నాయండి."

"ఏంటట ?"

"ఈవేళ ఉదయం బజారుకు వినాయకుడి విగ్రహం, పూలూ, పళ్ళూ కొనడానికి వెళ్లినప్పుడు అక్కడ ఏ దగాకోరో ఓ దొంగనోటును నాకు చిల్లరగా అంటగట్టేశాడండి."

"అరెరే ! ఎంత అన్యాయం !"

"అన్యాయమా, అన్యాయమున్నరా? ఆ నోటును ఈవేళ సాయంత్రం నేను మార్చేటప్పటికి నా తల ప్రాణం తోకకు వచ్చిందంటే నమ్మండి !"

* * *

బస్సు వేగంగా పోతోంది. "ఎవరైనా ఏదైనా మంచి జోక్ చెప్పండి," అన్నాడు డ్రయివర్.

"ఏమిటయ్యోవ్, ఈవేళ వినాయక చవితి గనుక జోక్ చెప్పమంటున్నావా ?" అన్నాడు ప్రయాణీకుడు.

"బస్సు ఇప్పుడు వంద కిలోమీటర్ల వేగంతో పోతోంది. బ్రేక్ బొత్తిగా పడటంలేదు. చివరి ఘడియల్లో అందరం నవ్వుతూ చస్తాం. త్వరగా జోక్ చెప్పు, బాబూ ?" అన్నాడు డ్రయివర్.

* * *

"ఏమేవ్ ! నువ్వు సీరియల్ నవలలు రాస్తావని అందరికీ తెలుసుగాని — వినాయక చవితి పండుగకు కావలసిన సరంజామా నాలుగు పేజీల లిస్టులో — ప్రతి పేజీ చివరన 'సశేషం' అనీ, చివరన 'సమాప్తం' అనీ రాయాలేమిటే ?"

* * *

"కొళాయి రిపేరీ చేసేవాళ్ళనీ, టెలిఫోన్ రిపేరీవాళ్ళనీ ఒకేసారి పిలిపించడం – ఎంత పొరబాటయిపోయిందో తెలుసా ?"

"ఏమైంది ?"

"కొళాయి తిప్పితే ఎన్‌గేజ్డ్ సౌండ్ వస్తోంది. ఫోన్‌లో బుడగల శబ్దం వినిపిస్తోంది."

* * *

"చాలా థాంక్స్, సార్, మీ కంపెనీలో నాకు 600 రూపాయల జీతంమీద ఉద్యోగమిచ్చినందుకు— ఐతే, నాదొక చిన్న మనవి, సార్ ! మొదటి నెల మాత్రం ఒక్క రూపాయి ఇచ్చి, మిగతా 599 రూపాయలను రెండో నెల జీతంతో చేర్చి ఇవ్వండి, సార్ !"

"అరే ! ఎందుకయ్యా అలా ?"

"మరేం లేదు, సార్ ! మొదటి నెల వచ్చిన జీతాన్ని అలాగే వినాయకుడి గుడిలోని ఉండీలో వేస్తానని మొక్కుకున్నా, సార్ !"

* * *

"అయ్యా ! విపరీతమైన నష్టం వచ్చినందువల్ల మా 'గణపతి గ్రంథాలయం' లైబ్రరీని మూసేయాలనే నిర్ణయానికి వచ్చేశామండి. తమరు దొడ్డమనసుతో త్రుణమో — పణమో..."

"మూసేయడానికి చందా ఎందుకోయ్ ?"

"తాళం కొనడానికి మా దగ్గర డబ్బు లేదండి."








"ఇట్లా ప్రకటించడంవల్ల మన సినిమాకు కలక్షన్లు పెరుగుతాయంటావా ?"




## అవే లక్షణాలు, అయితే రూపం కొత్తది!

# క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా ఇప్పుడు ఆకర్షణీయమైన ప్యాక్‌లో!

మీ కుటుంబానికంతటికీ నచ్చే మజా రుచితో, కోకో, మాల్ట్, పాలు, పంచదార గల ప్రకృతిలోని మంచి లక్షణాలతో, మీకు యిష్టమైన అదే బోర్న్‌విటా–యిప్పుడు కొత్త, ఆకర్షణీయమైన ప్యాక్‌లో!

త్వరపడండి. కొత్త డబ్బా లేదా కొత్త రీఫిల్ ప్యాక్‌లో గల క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా తీసుకోండి బోర్న్‌విటా తయారుచేసుకోండి, తాగండిక.




**క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా**

దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక.

OBM/7833-TEL.

# సినిమా

## నటనలో ఘటన

హాలు ... సోఫాల్లో నారాయణరావు, పురోహితుడు, మరో ఇద్దరూ ఉన్నారు. ఎదురుగా టీపాయ్‌మీద పళ్ళెంలో ఆకులు, వక్కలు ఉన్నాయి. ఇంతలో డాక్టర్ ప్రవేశించాడు.

నారాయణరావు సంతోషంతో "రండి రండి. సమయానికి వచ్చారు. 26వ తేదీ ముహూర్తం బ్రహ్మాండంగా ఉందట...చూడండి, డాక్టర్‌గారూ! ప్రేమికుల్ని ఎంత కాలమని అలా విడదీసి ఉంచగలం? త్వరగా ఆ శుభకార్యం జరిపించేశామా — మన బాధ్యత తీరిపోతుంది. కదండీ, డాక్టర్‌గారూ!"

"నాకీ పెళ్ళి ఇష్టంలేదు !"

ఆ కంఠం వినిపించిన వైపు అందరూ తిరిగి, నిశ్చేష్టులైపోయారు.

ఆశా గంభీరమైన నడకలతో వస్తూ, నారాయణరావుగారూ ! ఒక్కసారి గతం గుర్తుకు తెచ్చుకోండి. ఆనాడు తాతయ్యను పిలిచి మీరన్న మాటలు తాతయ్య గుండెల్లో ఎన్ని బాకు పోట్లయ్యాయో మీకేం తెలుసు ? నజరుగా ఉన్న మీ అబ్బాయిని వలలో వేసుకోడానికి నేను కాలేజీలో చదువుతున్నానా ? అంతగా డబ్బే సంపాదించాలనుకుంటే నన్ను బజార్ల వెంట తిప్పమనలేదా ?" అంది.

నారాయణరావు తలొంచుకుని, "అది కాదమ్మా ... అదంతా ... ఏదో — " అంటూ నీళ్ళు నమిలాడు.

"ఎలా మర్చిపొమ్మంటారు ? ఈనాడు లక్షాధికారిణి అయ్యానుకాబట్టి నా చుట్టూ మీరు తిరుగుతున్నారు. మీరంతా డబ్బు మనుషులు ... డబ్బే మీకు ముఖ్యం ... డబ్బే మీకు కావాలి ... సారీ, డాక్టర్! నాకీ పెళ్ళి ఇష్టంలేదు ... దట్సాల్ !" అంటూ గిరుక్కున వెనుతిరిగి వడివడి నడకలతో నిష్క్రమించింది.



'పిడుగులాంటి మనిషి'లో శకుంతల

హాలులో ఉన్నవారంతా దిగ్భ్రమతో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

ఎం. బషీర్ అహ్మద్‌ఖాన్ నిర్మించిన నమస్తే మూవీస్ "నటన" చిత్రం విడుదలకు సిద్ధమవుతోంది. ఎం. బషీర్ ఎ.కె. కథ, పాటలు రాశారు. ఆర్కశ్రీ సంభాషణలకర్త. ఆర్. రామారావు ఛాయ, బాబ్జీ శిల్పం, అంకిరెడి కూర్పుతో సంగీత దర్శకుడు జె. పురుషోత్తం నిర్మాణ సారథ్యం వహించిన ఈ చిత్రానికి కాసుల గురుదేవ్ దర్శకుడు.



'పట్నం వచ్చిన పతివ్రతలు'లో గీత, రాధిక

## పట్నం వచ్చిన పతివ్రతలులో పల్లెలో పడతి పడే పాట్లు

శ్రీదేవి (గీత) పేడముందు కూర్చొని, పిడకలు చేయబోయింది. ఇంతలో తోటికోడలు లలిత (రాధిక) వచ్చి, "ఏంటక్కా, పాపం—పిడకలు చేస్తున్నావా ? నీ చేతులు వాసనైపోతాయి ... ఉండు — నేనిప్పుడే వస్తా," అంటూ వెనుతిరిగి, ఇంట్లోకి వెళ్ళింది.

శ్రీదేవి అసహ్యించుకుంటూ, "అత్తగారింట్లో అన్ని పనులూ చేసి సీతామాలక్ష్మి అనిపించుకో -- అన్నారు అమ్మా, నాన్నా ... పేడ ఇంత కంపు కొడుతుందని నాకేం తెలుసు ?" అని గొణుక్కుంది.

సెంటు సీసాతో లలిత ఆదరాబాదరాగా వచ్చి, "అక్కా ! నీ పెట్టెలోంచి తెచ్చాను సెంటు ..." అంటూ సెంటును స్ప్రే చేసి, "ఆఁ ... ఇప్పుడు పేడలో చేతులు పెట్టు," అంది. శ్రీదేవి ముఖకవళికలు గమనిస్తూ, "చూశావక్కయ్యా ! సీసాడు సెంటు పోశాం ... హుఁ ... ఈ పల్లెటూరే అంత. సెంటు కూడా పేడ కంపే వస్తోంది. అదే పట్నం అనుకో — ఆముదం కూడా ఎర్రటి రంగు పులుముకుని సువాసనలు వెదజల్లుతాయి," అంది లలిత.

శ్రీదేవికి ఏడవ్వాలో — నవ్వాలో తోచలేదు

విజయ బాపినీడు నేతృత్వంలో శ్రీనివాసా ప్రొడక్షన్స్ నిర్మించే "పట్నం వచ్చిన పతివ్రతలు" చిత్రంలో చిరంజీవి, మోహన్‌బాబు నాయకులు.

# మిల్క్ మెయిడ్

## రుచికరమైన పాల తయారీకి




కావలసిన విధంగా
రుచికరమైన తీయని
పాలను తయారు
చేసుకున్న తర్వాత,
ఆ పాలతో మీరు పాయసం,
మిల్క్ షేక్ రాజ్‌భోగ్, బర్ఫీ
లాంటి నోరూరించే రుచికర
మైన తీపి తినుబండారాల్ని
తయారుచేసుకోండి.
మిల్క్ మెయిడ్‌లో
తీపి వున్నది. మీకు
పంచదార ఖర్చు కలసివస్తుంది
కూడ.

అతి రుచికరమైన
పాలకోసం 3 అనువైన
పద్ధతులు:

1. 400 గ్రా మిల్క్‌మెయిడ్
డబ్బాను తెరవండి




2. అందులో వున్నదాన్ని పెద్ద
పాత్రలో పోయండి



3 ఖాళీ అయిన మిల్క్‌మెయిడ్
డబ్బాతో కొలిచి 3-4 రెట్లు
మీ రుచిని అనుసరించి నీళ్ళు
కలవండి బాగా కలపండి.
అత్యంత రుచికరమైన తీయని
పాలు మీకు లభిస్తాయి



ఇప్పుడు చెప్పినట్లు కలిపిన పాలు
వంట పదార్థములు వేయడానికిని
మరియు సాధారణ వాడకమునకు
మాత్రమే.

మధురమైన రుచులలో ఒక సొగసైన మార్పు

## మిల్క్ మెయిడ్

CAS-384 TE B

# సినిమా

## "దూరపు కొండలు"

"ఆగస్టు 23 నుంచి సెప్టెంబర్ 7 వరకు గుంటూరు ప్రాంతాలలో జరిగే మరో షెడ్యూల్‌తో షూటింగ్ అయిపోతుంది," అన్నారు నల్లంరెడ్డి ప్రసాద్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, పాటలు, దర్శకత్వంలో ఎస్. ఎల్. దేవి 'రాధికా ఆర్ట్ పిక్చర్స్' బ్యానర్‌లో నిర్మించే పై చిత్రంలో శరత్‌బాబు, జగ్గయ్య, పద్మప్రియ, కృష్ణవేణి, రమాప్రభ, అన్నపూర్ణ, ప్రకాష్ వగైరా నటవర్గం. మాటలను అప్పలాచార్య, గెనిశెట్టి రాశారు. శంకర్‌జీ సంగీతం, లక్ష్మణ్ గోరే ఛాయ, సోమనాథ్ శిల్పం, ఎస్. పి. సీరప్ప కూర్పు, కె. రవిప్రకాష్ నిర్వహణ, కె. గురుదేవ్ సహ దర్శకత్వంతో వి. రామారావు సమర్పిస్తారీ చిత్రాన్ని.

## మోహన్‌బాబు హీరోగా మోసగాళ్ళు - మొనగాళ్ళు

"మా చిత్రంలో మోహన్‌బాబు హీరో," అన్నారు శ్రీ వాణీ చంద్రా కంబైన్స్ "మోసగాళ్ళు-మొనగాళ్ళు" చిత్రానికి కథ రాసి, సమర్పించే ఎస్. వి. సుబ్బరాజు. ఆదుర్తి నరసింహమూర్తి సంభాషణలు రాస్తున్నారు. కె. వెంకట్రామరాజు, ఎ. సూర్యనారాయణరాజు నిర్మించే ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## "నా కొత్త చిత్రం నిషేధింపబడవచ్చు కాని, నేను ఊరుకోను" ప్రముఖ దర్శక నిర్మాత శాంతారామ్ పవార్

గతంలో "ఆద్మీ, పడోసి, డాక్టర్ కోట్నీస్ కీ అమర్ కహానీ, శకుంతల, దహేజ్, సురంగ్, దో ఆంఖే బారాహాథ్, ఝనక్ ఝనక్ పాయల్ బాజే, నవరంగ్" లాంటి అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన చిత్రాలు నిర్మించిన 'రాజ్‌కమల్ స్టూడియో' అధినేత, విఖ్యాత దర్శక నిర్మాత వి. శాంతారాం "చాలా కాలంగా నేను చిత్రాలు తీయడంలేదు. చలనచిత్రపరిశ్రమేకాక అసలుమనభారతదేశమే అధ్వాన్నమైపోయింది. సహృదయులకు, సజ్జనులకు విలువలేదు. స్వార్థపరులకు, అవకాశవాదులకు విలువ పెరిగిపోయింది. అందుకే అవినీతిని, అన్యాయాన్ని, అక్రమాలను ఖండించే 'ఝున్ ఝురా' (రగిలేజ్వాల) అనే చిత్రాన్ని ఈ సంవత్సరంలో ప్రారంభించబోతున్నాను. ఈ చిత్రం కోసం నేను ఎన్నో యదార్థ సంఘటనల వివరాలను సేకరించాను. మన సమాజంలోనే కాక ప్రభుత్వరంగంలో, ప్రభుత్వాధికారులలోని కుళ్ళునంతా కడిగేయదలిచాను. ఈ చిత్రం నిషేధింపబడవచ్చు. కాని, నేనూరుకోను. సుప్రీంకోర్టు దాకా వెళ్ళి పోరాడతాను. తప్పకుండా అంతిమ విజయం నాదే. ఆఖరికి ఇందిరా గాంధీ గురించి ఈ చిత్రంలో ప్రస్తావించినా—ఋజువులతో సహా చూపిస్తాను. ఆమె చెప్పేదొకటి, చేసేదొకటి. ఇలా ఉంటే దేశం ఏమయ్యేటట్లు ?" అన్నారు ఎంతో ఆవేశంతో. ఇప్పుడాయన ఇంటర్నేషనల్ నియోయూత్ ఫిలిం సొసైటీకి అధ్యక్షులు. "రేపటి పౌరులైన నేటి బాలల జాతీయ సమైక్యతకు, దేశ సౌభాగ్యానికి చలనచిత్రాలు ఏ విధంగా తోడ్పడతాయో గుర్తించారు. ఈ వయసులో నాకదే ఎంతో ఆనందం కలిగిస్తోంది," అన్నారాయన. ఇప్పుడాయన వయసు ఎనిమిది పదులు దాటింది. ఇంకా ఎంతో ఉత్సాహంగా చురుకుగా కన్పిస్తున్నారు. "ప్రబోధాత్మకమైన, ప్రయోజనాత్మకమైన చిత్రాలు తీయాలనేదే నా లక్ష్యం. ఆ లక్ష్యమే నాకు కొండంత బలాన్నిస్తోంది. నేను నా ప్రగతికోసం ఇంకా జీవిస్తున్నాను. నా సాధనం — సినిమా. ఆదినుంచి ప్రజోపయోగకరమైన సినిమాలే నిర్మిస్తున్నాను. పరిస్థితులకు లొంగి ఒకటి రెండు సార్లు తప్పటడుగులు వేసి ఉండొచ్చు... నాదెంతో ఆరోగ్యకరమైన శరీరం. పొగ పీల్చను, మద్యం సేవించను. జొన్న రొట్టెలే బాల్యంనుంచీ తింటున్నాను. ప్రతి రోజూ తగు వ్యాయామం చేస్తాను. నాకున్న వ్యసనమల్లా నావృత్తే. ఈసారి నాకున్న శక్తినంతా కూడగట్టుకొని, ఒక్కసారి విజృంభిస్తాను. కళాకారుడుగా నేను చేయవలసిందదే" అన్న శాంతారాం తన "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" సంగీత నృత్యమయ హిట్ చిత్రాన్ని 70 ఎం. ఎం. లో మళ్ళీ విడుదల చేయడంకోసం స్టీరియోఫోనిక్ రీరికార్డింగ్‌కు మిక్సింగ్ కోసం మూడునెలల వ్యవధిలో నాలుగు లక్షలకు పైగా వెచ్చించారు. ఈ ప్రయోగం విజయవంతమైతే, ఆయన పాత చిత్రాలు కొన్నిటిని ఇలాగే మళ్ళీ విడుదల చేస్తారట.



'మేఘసందేశం'లో అక్కినేని నాగేశ్వరరావు, జయసుధ

## ముద్దుల మొగుడుగా ఎ. ఎన్. ఆర్.

"నాగేశ్వరరావు పక్కన శ్రీదేవితోపాటు సుహాసిని కూడా నటిస్తుంది," అన్నారు కె. ఎస్. ప్రకాశరావు. ఈయన దర్శకత్వం వహించే మహిజా ఫిలిమ్స్ "ముద్దులమొగుడు" చిత్రంలో ఇంకా శరత్‌బాబు, రావుగోపాలరావు, నాగేష్, ఎస్. వరలక్ష్మి మున్నగువారు కూడా ఉంటారు. ఆత్రేయ మాటలు, పాటలు రాస్తున్నారు, ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకుడు. నవకాంత్ ఛాయాగ్రాహకుడు. సెప్టెంబర్ 7, 8 తేదీలలో పాటలు రికార్డ్ చేస్తాం. అక్టోబర్ 5 నుంచి 20, నవంబర్ డిసెంబర్ నెలల్లో 11–20 తేదీల మధ్య షూటింగ్ ఉంటుంది," అన్నారు నిర్మాత చెరుకూరి ప్రకాశరావు.

## వసంత కోకిల

"మృదు మధురమైన కంఠాన్నిచ్చిన భగవంతుడు కోకిలకు కారు నలుపు రూపును ఎందుకిచ్చాడో! అలాగే లేడిలా చెంగుచెంగున గంతులు వేసే ఓ పడుచు పరిస్థితుల ప్రభావం వల్ల పిచ్చిదైతే? అందుకే మా చిత్రానికి 'వసంత కోకిల' అని పేరెట్టాం," అని నిర్మాతలు ఎస్. పి. సుబ్బారావు, కె. రామకోటయ్య తెలియజేశారు. శ్రీదేవి, కమలహాసన్, స్మిత, సూప్రి, రమణమూర్తి పాల్గొన్న శ్రీ విఘ్నేశ్వరా సినీ ఆర్ట్ క్రియేషన్స్ "వసంత కోకిల" చిత్రానికి బాలుమహేంద్ర కథ, స్క్రీన్‌ప్లే, సమకూర్చి ఛాయాగ్రహణంతోపాటు దర్శకత్వం కూడా వహించారు. మాటలు, పాటలు గోపి రాశారు. ఇళయరాజా సంగీత దర్శకుడు. నరసింహారావు సంకలనకర్త.

స్త్రీజీవితంలో
ఎంతో అందమైన క్షణాలలో
ఒకభాగం ఖటావ్

ఖటావ్‌వారి టెర్గోసా చీరలు



Rediffusion/K/1619e/TL



'జీవన్‌ధార' హిందీ చిత్రంలో రేఖ, సింపుల్ కపాడియా, అమోల్ పలేకర్

## చిత్ర విచిత్రాలు

• అమితాబ్‌బచ్చన్‌కు మొట్టమొదట ముట్టిన పారితోషికం 150 రూపాయలు – మృణాల్ సేన్ చిత్రం "భువన్ షోమ్"కి నేపథ్యంలో వ్యాఖ్యానం చెప్పినందుకు అసలా చిత్రంలో నటించాలని అమితాబ్ ఎంతో ఆశపడ్డాడట గాని, పిలుపడింది కాదట

★ స్వర్గీయ మధుబాలను వివాహ మాడినప్పుడు కిశోర్‌కుమార్ ముస్లిమ్‌గా మారి, తన పేరును అబ్దుల్లాగా మార్చుకున్నాడు

★ "నో సెక్స్ ప్లీస్–వుయ్ ఆర్ బ్రిటిష్" అనే ఆంగ్ల చిత్రం లండన్ స్ట్రాండ్ థియేటర్‌లో 16–6–71నుంచి ఇంకా ప్రదర్శింపబడుతోంది

★ "నేనొక తమిళ చిత్రంలో నటిస్తున్నాను,', అంది పద్మిని ఇటీవల డాక్టర్ భానుమతి రామకృష్ణ ఇంట్లో కనిపించినప్పుడు "ఉన్నై విడమాట్టేన్" తమిళచిత్రంలో ఆమె హీరో విజయ్‌కాంత్ తల్లిగా నటిస్తోందట ఆమె ఇంకో విషయం చెప్పింది "నాతో ఒకటి రెండు చిత్రాల్లో నటించిన ఒక స్టార్ నాకో చోట తారసపడింది నా భర్త గతించినందుకు ఆమె సానుభూతి చూపడానికి బదులు 'మీ వారు పోయారు కదా ? మీ మెడలో ఇంకా మంగళసూత్రం ఉందేం?' అని అడిగింది అయిదోతనంపోయినా– మంగళసూత్రాన్ని అలాగే ఉంచేయడం మా కేరళలోని ఆచారం ఇంతకీ – నాకు తెలిసినట్లుగా రెండు పెళ్ళిళ్ళు చేసుకున్న ఆ స్టార్ నన్నడగవలసిన ప్రశ్నా ఇది ?"

★ "ఏక్ దుజేకే లియే" చిత్రాన్ని విషాదాంతం కాకుండా సుఖాంతం చేయమని తొలుత ఎల్ వి ప్రసాద్ సూచిస్తే, బాలచందర్ వెంటనే ఎంతో నేర్పుతో చేర్పులు, మార్పులు చేశారు అది చూశాక "విషాదాంతమే బావుండేలా ఉంది," అన్నారట ప్రసాద్

★ నటి జయభారతి ఒక మలయాళ చిత్రంకోసం కొచ్చిన్‌లోని ఓ హైందవాలయంలో నృత్యం చేసింది "జయభారతి ముస్లిమ్ వనిత ఆమె అసభ్యంగా నాట్యం చేయడంవల్ల ఆలయం అపవిత్రమైపోయింది," అంటూ ఒక బస్ కండక్టర్ కేసు పెట్టాడు కోర్టుకు హాజరైన ఆ నటి "నేను పుట్టుకతో ముస్లిమ్ వనితనే కావొచ్చు కాని, ఇటీవల హైందవమతం స్వీకరించి, వివాహం చేసుకున్నాను నేను భరతనాట్యం ఉడుపులతోనే డాన్స్ చేశాను అదెలా అసభ్యమౌతుంది ?" అని వాదించిందట

★ అమితాబ్‌బచ్చన్‌కు తల్లిగా నూతన్ ఓ చిత్రంలో బుక్ అయింది కాని, అమితాబ్ "నా మొదటి హీరోయిన్ ఈమె ఈమెను 'అమ్మా!' అని ఎలా పిలిచేది ? తల్లి పాత్రను వదిన పాత్రగా మలచండి," అని నిర్మాతను ఒప్పించాడు

# సినిమా

## మాజీ రాష్ట్రపతి గుర్తుపట్టిన దీప

"నాకిప్పుడు ఏర్పడిన మానసిక సంక్షోభానికి చిత్రాలే శరణ్యం," అంది దీప "నేను నా నట జీవితాన్ని కొనసాగిస్తాను స్విమ్మింగ్ డ్రస్‌లలాంటి అశ్లీల వస్త్రధారణ లేని నాకు నచ్చిన ఏ చక్కని పాత్రనయినా చేయడానికి సిద్ధమే అన్నట్లు – మీకో విషయం చెప్పనా ? వివాహమైన కొత్తల్లో నేను మా వారితో కొచ్చిన్‌లో కాపురం చేస్తున్నప్పుడు – అక్కడికి జనవరి మాసంలో మన ఎక్స్ ప్రెసిడెంట్ నీలం సంజీవరెడ్డిగారు ఏదో బ్యాంక్ ప్రారంభోత్సవానికి విచ్చేశారు వారికి పుష్పమాల అర్పించమని ఆ బ్యాంక్‌వారు నన్ను కోరారు సరే నన్నాను ఇదివరకెన్నడో మద్రాసులో జరిగిన ఆంధ్ర సోషల్ అండ్ కల్చరల్ క్లబ్‌వారి ఉత్సవానికి రెడ్డిగారు వేంచేసినప్పుడు కూడా నేను పుష్పమాలను అర్పించాను అప్పుడు వారు నా పేరేమిటని అడిగి తెలుసుకున్నారు కొచ్చిన్ విమానాశ్రయంలో వారు విమానం నుంచి దిగగానే వారికి మొట్టమొదట మాలను అర్పించింది నేనే వారు నన్ను ఇట్టే గుర్తుపట్టి, 'నువ్వు దీపవు కదూ ? ఇక్కడేం చేస్తున్నావ్ ?' అని ఆశ్చర్యంతో అడిగారు 'నాకు పెళ్ళయిపోయింది,' అని సిగ్గుపడుతూ చెప్పి, పక్కనే ఉన్న మా వారిని రెడ్డిగారికి పరిచయం చేశాను రెడ్డిగారు, మా వారితో కరచాలనం చేసి, 'కంగ్రాట్యులేషన్స్! అందమైన భార్యను పొంద గలిగిన మీరెంతో అదృష్టవంతులు,' అని అభినందించారు కాని, మా వారి దృష్టిలో నేనో అందగత్తెను కాను," అంటూ నిట్టూర్చింది దీప

## కోనేరు రవీంద్రనాథ్ దర్శకత్వంలో గాజు బొమ్మలు

"జూలై 1నుంచి 10వరకు విశాఖపట్టణంలో షూటింగ్ జరుపుకువచ్చాం," అన్నారు నటనాలయా కంబైన్స్ "గాజుబొమ్మలు" చిత్ర కథకుడు, దర్శకుడు, నిర్మాత కోనేరు రవీంద్రనాథ్ ఇతివృత్తం గురించి ఈయన టూకీగా చెప్తూ, "నేటి స్త్రీ అబలకాదు, సబల సమాజంలో కొందరు స్వార్థపరులు అరాచకత్వాన్ని రేకెత్తిస్తే నేటి మహిళలు ఏమాత్రం ఉపేక్షించరు స్వార్థపరులపై ధ్వజమెత్తుతారు, వెనుకపై తిరగబడతారు ధనికవర్గం మహిళలకు చెందిన స్త్రీగా అన్నపూర్ణ, మధ్యతరగతికి చెందిన మహిళగా సంగీత, విద్యార్థినీ లోకానికి చెందిన యువతిగా పూర్ణిమ, బీదవర్గానికి చెందిన వనితలుగా రమాప్రభ, కొత్తనటి చిత్ర పాల్గొన్నారు," అన్నారు శరత్‌బాబు, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, సాయిచంద్, మాతన్ ప్రసాద్, వీరభద్రరావు, వేలు ఇతర నటవర్గం ఆత్రేయ సంభాషణకర్త రమేష్ నాయుడు స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు రమేష్ ఛాయ, శ్యామ్‌కుమార్ కూర్పు నిర్వహిస్తున్నారు 

అశేష ప్రజానీకపు కోరికపై స్కీమ్
30-9-1982 వరకు
పొడిగించబడినది!

గెలవండి

డ్రా తేదీ:
31-10-82

# బంగారం! బంగారం! బంగారం!

## స్కోర్
## లక్కీ గిఫ్ట్ స్కీమ్

మొదటి బహుమతి
35 తులముల బంగారం
లేదా
రు 65,000 నగదు
మరియు
అమూల్యమైన 181
ఇతర బహుమతులతో

## ఉచితం!

ప్రతి రెండు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలతో ఒక లక్కీ బహుమతి కూపన్ ఉచితం। ప్రజల సమక్షంలో నిర్వహింపబడే కూపన్ డ్రాలో బహుమతి విజేతలు ప్రకటింపబడుదురు।




మరింతగా మీరు కొనసాగినంత ఎక్కువగా స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలను కొనండి। మీరు బహుమతులు గెలుచుకునే అవకాశాలు పెంపొందించుకోండి।

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వారా ఈ స్కీమ్ అనుమతింపబడినది.










# సీరియల్ దాంపత్య సంగీతం

## శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

ఆ రోజు సాయంకాలం కుమార్ని కలుసుకుంటా వని చెప్పిన విషయం గుర్తున్నా వెళ్ళలేక పోయాను. కుమార్ కేం చెప్పను? నేను పూర్తిగా ఓడిపోయాననా, నిన్ను పెళ్ళి చేసుకొనేందుకు నాన్న గారు సమ్మతించలేదనా, ఏం చెప్పాలి? అతన్ని నాఅంత నేను ప్రోత్సహించి లేనిపోని ఆశలు కల్పించాను. ఇప్పుడిక ఏ మొహంతో 'అన్నీ మర్చి పొమ్మని' చెప్పగలను.

నాన్నగారు మా పెళ్ళికి ముహూర్తం నిశ్చ యించారు. కుమార్ ఈ మధ్యలో ఒకటి, రెండు సార్లు నాకు ఫోన్ చేసాడు. కాని ఇంట్లో వున్నా లేనని అబద్ధం చెప్పించాను. అతనితో మాట్లాడే సాహసం నాకు లేదనిపించింది. సురేంద్ర రోజుకోసారి అయినా వచ్చిపోతున్నాడు. అతన్ని కాబోయే భర్తగా, ఊహించి అతనితో నవ్వుతూ మాట్లాడాలని చాలా సార్లు అనుకునేదాన్ని. కాని నేను చేసే ప్రయత్నాలన్నీ విఫలమైయ్యేవి. ఎందుకో, అతనిని చూడగానే, నా మనసు ముడుచుకుపోయేది. అతని మాటల్లో కన్పించే సుపీరియారిటీ కాంప్లెక్స్కి, నాకు తెలియకుండానే నేనెంతో చిన్నదాన్ని అన్ని విషయాల్లోను అనుకొనే దాన్ని 'భార్యలంతా భర్త సుపీరియర్గా వుండాలని కోరుకుంటారేమో తెలియదు కాని, నేను మాత్రం నాతో సమానంగా వుండే భర్తని, కోరుకుంటాను మొదటి కారణం సురేంద్ర నాకు నచ్చకపోవటం అదే కావచ్చు. కుమార్ నాకంటే సీనియర్ అయినా, ఎన్నో విషయాల్లో అతను మంచి చురుకైనవాడు, తెలివిగలవాడు అయినా, నన్నేనాడు తేలిగ్గా తీసిపారేసి మాట్లాడేవాడుకాదు. కుమార్ని పూర్తిగా మర్చి పోవాలని నేచేసే ప్రయత్నాలన్నీ సురేంద్రనిచూడగానే విఫలమయ్యేవి. ఒకవిధంగా సురేంద్రే కుమార్ గుర్తురావటానికి పరోక్షంగా కారణం అయ్యేవాడు. సురేంద్ర మాటిమాటికి రావటంవలన, అతనంటే అంతకుముందువున్న సదభిప్రాయం సన్నగిల్లసాగింది. రానురాను అతను నామీద ప్రకటించే చనువు, చొరవ భరించలేకపోయేదాన్ని.

నాన్నగారు, శారద చీరలకని, నగలకని బజారు వెళ్ళారు. నన్ను రమ్మని శారద చాలా బతిమ లాడింది. వాటిమీద నాకేనాడు మోజు, భ్రాంతి లేవు. అంత ఉత్సాహము మనసులో లేదు. అందుకే వెళ్ళ లేదు. పెళ్ళి విషయంలో అడుగడుక్కి నేను కనపరుస్తున్న నిరుత్సాహం నాన్నగారు గమనిస్తున్నా పట్టించుకోవటంలేదు. ఆయనకు కావలసినది, నేను సురేంద్ర భార్యను కావటం.

శుభలేఖలు అచ్చువేయబడ్డాయి. ముందు హాల్లో ఇద్దరు ముగ్గురు గుమాస్తాలు కూర్చుని అడ్రస్లు

(గత సంచిక తరువాయి)

వ్రాస్తున్నారు. కుమార్ని పెళ్ళికి పిలవటం నా బాధ్యత అనిపించింది. గబుక్కున రెండు శుభలేఖ లందుకొని పర్సులో వేసుకొని బయలుదేరాను.

కుమార్ ఇంటి ఆవరణలోకి రాగానే నా కాళ్ళు ఒణికాయి. చప్పున వెనక్కు తిరిగి పోదామ అన్పించింది. ఇంతలో అటువైపుగా వచ్చిన కుమార్ వదిన నన్ను గమనించి,

"నువ్వా! రా ... లోపలికి" అంది.

నన్ను చూడగానే ఆవిడ మొహం కళ తప్పటం గమనించాను.

"కుమార్ లోపలున్నాడు" అంటూ అతని గది చూపించి లోపలకి వెళ్ళిపోయింది.

"కుమార్!" అంటూ అతని గదిలో అడుగు పెట్టాను. పడక్కుర్చీలో పడుకొని ఏదో మాగ్జైన్ చదువుకుంటున్న అతను ఒక్కసారి నన్ను చూడగానే ఆశ్చర్యపడ్డాడు నేను అతన్నిచూసి కలవరపడ్డాను. కుమార్ ఈ పది, పదిహేనురోజుల్లో చాలామారాడు గడ్డం పెంచాడు. మొహం వాడి వుంది నా పెళ్ళి నన్నే బాధిస్తుందనుకున్నాను కాని కుమార్ నాకంటె ఎక్కువ బాధ ననుభవిస్తున్నట్టుంది.

"రా... కూర్చో స్వాతీ! జీవితంలో మళ్ళీ నిన్ను చూడలేనేమో అనుకున్నాను. ఈ రోజు చాలా మంచి రోజు."

"అదేం కుమార్. మనం ఎప్పటికి స్నేహితులమే" అన్నాను నీరసంగా

"ష్యూర్ కాని పెళ్ళి అయ్యాక నీ భర్త మన స్నేహాన్ని వ్యతిరేకిస్తే..."

"నన్నంత వ్యక్తిత్వం లేనిదాన్నిలా చిత్రించకు."

**జరిగిన కథ—2:** కాంట్రాక్టర్ రామనాధంగారి కూతుళ్ళు స్వాతి, శారద భార్య గుండెజబ్బులో మరణిస్తుంది. స్వాతి ఎం. బి. బి. యస్. ఆఖరి సంవత్సరం పరీక్షలు రాసింది. శారద బి.ఎ. చదువుతున్నా చదువుకంటే సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యత నిస్తుంది. ఎం. ఎస్ పూర్తిచేసిన కుమార్తో లోగడ తనకి తెలియనివి చెప్పించుకొనేది స్వాతి. ఆ విధంగా వారిద్దరూ దగ్గరవుతారు. చదువు పూర్తి చేసుకొని కెనడానుంచి వచ్చిన సురేంద్రతో స్వాతి వివాహం అతను అక్కడికెళ్ళేముందే నిర్ణయిస్తారు రామనాధంగారు. కుమార్ని పెళ్లి చేసుకొంటానన్న స్వాతి మాటలను లెక్కచెయ్య కుండా సురేంద్రతో ఆమె పెళ్లి ఖాయం చేస్తారు రామనాధంగారు.

"ఓహో పెళ్ళికి ఆహ్వానించటానికి వచ్చావన్న మాట" నా చేతిలో శుభలేఖను గమనించి అన్నాడు

ఔనన్నట్టు తలూపాను.

"సారీ స్వాతీ. నేను రెండు రోజుల్లో బయల్దేరి వైజాగ్ వెళుతున్నాను. బహుశ నీ పెళ్ళికి నేనుండను ఏమి అనుకోక" అన్నాడు అతని కంఠం బరువెక్కటం గమనించాను.

"అదేం అంత తొందర నానుంచి పారిపో తున్నావా ?"

"నీనుంచి పారిపోగలిగే స్థలం ఏదైనా వుంటే చెప్పు. నిశ్చింతగా వెళతాను."

".. ."

"నువ్వు జీవితంలో హాపీగా వుండాలని ఆశీర్వ దిస్తున్నాను. మనమధ్య స్నేహం నేను బతికున్నంత కాలం నిలుస్తుంది. నీ శ్రేయస్సుకోరే ఓ స్నేహితుడు వున్నాడని మరిచిపోకు."

"థాంక్స్" ఒక్కసారి అతని మాటలకు, నాకు తెలియకుండా నా గొంతులో గూడు కట్టుకొన్న దుఃఖం బయటకొచ్చింది.

హఠాత్పంఘటనకి కుమార్, కాఫీ కలిపి తీసుకొచ్చిన అతని వదిన ఇద్దరూ ఖంగారు పడ్డారు

"స్వాతీ! ఏమిటింత పిరికిపిల్లలా ఏడుస్తు న్నావ్!" అంటూ నా బుజం పట్టుకొని నన్ను ఓదార్చాలని చూసారు ఆవిడ.

"స్వాతీ! ఏమైంది" అంటూ ఖంగారుగా కుమార్.

నా బాధని నేనే మింగాను! ఒక్కసారి బాత్రూమ్ వైపు పరిగెత్తుకెళ్ళి మొహం కడుక్కున్నాను

కుమార్, అతని వదిన అర్థంగానట్లు నా వంక చూస్తున్నారు

"ఇక నేను వెళతాను కుమార్!" అన్నాను చటుక్కున

"స్వాతీ ఒక్క నిముషం వుండమ్మా!" అంటూ నా చేయి పట్టుకొని ఆపేసారు కుమార్ వదిన. "ఈ ముసుగులో గుద్దులాటెందుకు చెప్పు అతనికి నువ్వు కావాలి. నీకు అతను కావాలి."

"వదినా .."

"నన్ను చెప్పనీ కుమార్. ఎందుకంత దాపరికం. నీ పెళ్ళి కుదిరిందన్న విషయం విన్నప్పటి నుంచి 'దేవదాస్' అయిపోయాడు నా మరిది. నువ్వు అలాగే బాధ ననుభవిస్తున్నావు. నేను మీలా ఎక్కువ చదువుకోలేదు. అయినా మీ ఇద్దరిలో వున్న పిరికితనాన్ని నేను ద్వేషిస్తున్నాను. ఇద్దరూ డాక్టర్స్. మీ సంపాదనతో హాయిగా జీవించవచ్చు. ఈ రోజు కాదన్న రేపు మీ నాన్నగారు తప్పకుండా క్షమిస్తారు. అంతేకాని ఇలా ఇష్టంలేని పెళ్ళి చేసుకొని నువ్వు

సుఖపడవు. నీ భర్తని సుఖపెట్టలేవు..." ఆమె నిష్కర్షగా చెప్పిన అభిప్రాయాలు వినటానికి బాగున్నాయి. నాలో ధైర్యాన్ని కొంచెం కొంచెం రాజేసాయి. అయితే ఆవిడన్నంత సులభమా ఈ పెళ్ళి తప్పిపోవటం. శుభలేఖలు అచ్చయ్యాయి. ఇప్పటికే చాలామందికి తెలిసిపోయింది ఈ విషయం. నాన్న గారికి ఈ వూళ్ళో వున్న పరువుప్రతిష్ఠలు గంగపాలు చేయనా! అదేనా నా ధర్మం?

"వదినా! స్వాతి పెళ్ళి ఇంకా కొన్ని రోజుల్లోకి వచ్చింది. ఇప్పుడిక ఆ ప్రశక్తి అనవసరం." నా మనసు గ్రహించినవాడిలా కుమార్ అన్న మాటలకు, నేను తలూపాను.

"పెళ్ళి పీటలమీద పెళ్ళిళ్ళుకూడ తప్పటం నేను చూసాను. భగవంతుడు నిర్ణయించిన ముహూర్తం ఎప్పుడుందో ఎవరికి తెలుసు. ఆ అమ్మాయి నవ్వుతూ ఆ పెళ్ళి చేసుకుంటుంటే నాకేమిటి మధ్య. ఎంతో బాధని గుండెల్లో భరిస్తున్నట్లుంది ఆమె వైఖరి. ఆడపిల్ల మనసు నీ కర్థంకాదు కుమార్. అయినా పిల్లను పెళ్ళి చేసుకునే ధైర్యం నీకు లేదులా వుంది."

"అలా నన్ను ఛాలెంజ్ చేయకు వదినా! స్వాతి చాలా పిరికిపిల్ల. తను ధైర్యం చూపిస్తే — కృష్ణుడు రుక్మిణి నెత్తుకుపోయినట్లు ఈ క్షణం ఆమెను పెళ్ళి చేసుకోటానికి సిద్ధంగా వున్నాను." అంటూ సాలోచనగా నా వంక చూసాడు.

"అరే కాఫీ ఎవ్వరూ తాగలేదు. చల్లారి నట్లుంది. ఒక్కసారి వెచ్చచేసి తీసుకొస్తాను' అంటూ కుమార్ వదిన కాఫీ కప్పుల్ని తీసుకొని లోపలికి వెళ్ళారు.

"కుమార్! నేను రేపు నీతో వైజాగ్ వచ్చేస్తాను. తీసుకెళ్ళిపోరాదు." అన్నాను.

"అప్పుడు ఫలాన వాళ్ళమ్మాయి లేచిపోయింది' అంటుంది లోకం. విని తట్టుకోగలవా!"

"నేను లోకంకోసం ఎప్పుడు ఆలోచించలేదు మా నాన్నగారికోసం భయపడుతున్నానంతే! నీకు తెలియదు కుమార్ ఆయన మామీద ఎన్ని ఆశలు పెట్టుకున్నారో! ఆయన చిన్నవారుగా వుండగానే అమ్మపోయింది, అయినా ఆయన మరోపెళ్ళి తల పెట్టలేదు ఎందుకో తెలుసా? ఆ వచ్చేఆవిడ మమ్మల్ని ఎలా చూస్తుందో అన్న భయంతో. అమ్మపోయిన కొత్తల్లో శారద,నేను అమ్మకోసం బెంగపడుతుంటే మా బాధని మరిపించటానికి దేశం అంతా త్రిప్పారు. ఏనాడు ఇదిలేదని మేముబాధపడకూడదని అహర్నిశలు కష్టపడుతూ లక్షలు సంపాదించారు. ఆయన కల్లో కూడ ఆశించేది మా శ్రేయస్సే అని తెలుసుండ, నేను ఆయన్ని బాధపెట్టేపని ఎలా చేయను? నలుగురిలో ఆయన పరువుతీసి ఋణం తీర్చుకో మంటావా."

కుమార్ మౌనంగా వింటూ వుండిపోయాడు.

"అక్కడికి నాన్నగారికి నచ్చచెప్పాలని చాలా చూశాను. నాన్నగారికి ఆ సురేంద్రమీద అంతమోజు ఎందు కలిగిందో అర్థంకాదు. ఇప్పుడనిపిస్తోంది అసలు నువ్వు నాకు పరిచయం కాకుండా వుంటే బాగుండేదని"

"ఇప్పుడుమాత్రం ఏం స్వాతి, నన్ను పూర్తిగా మర్చిపో!"

నేను చురుగ్గా చూసాను! "ఆ విషయం నీకు చెబుతాను"

"స్వాతీ! ఇంకా మీ ఆలోచనలు దారిలోకి రాలేదా!" అంటూ వచ్చారు కుమార్ వదిన.



"మీరు చెప్పండి. ఏం చేయమంటారు !"

"నేను చెప్పినట్లు వింటానంటే చెబుతాను."

"అలాగే" అన్నాం ఇద్దరం.

"రేపు పెళ్ళి ముహూర్తం ఒకటుంది. నాకెలా తెలిసిందంటే మాకు తెలిసిన వాళ్ళమ్మాయి పెళ్ళి రేపే ! ఆ ముహూర్తానికే మీఇద్దరి పెళ్ళి జరిగేలా ఏర్పాటు చేస్తాం."

"పెళ్ళా ! ఇంత హఠాత్తుగానా ?"

"అదంతా నా కొదిలెయ్యి. మీ పెళ్ళి కాగానే, రేపే బయలుదేరి కుమార్, నువ్వు వైజాగ్ వెళ్ళిపోండి."

చాలాసేపు ఆలోచించిన మీదట 'నా అభ్యంతరం ఏం లేద'న్నట్లు తలూపాను.

"అయితే రేపు పొద్దున్నే మా ఇంటికి వచ్చేసెయ్యి."

"అలాగే వస్తాను" అని ఆమె చేతిలో ప్రామిస్ చేసి బయటపడ్డాను.

"స్వాతీ ! నీది తొందరపాటు నిర్ణయం కాదుగా !" నాతోపాటు బయటకు వస్తూ అన్నాడు.

"ఉహూ ఎప్పటికీ కాదు" అన్నాను నవ్వుతూ.

"ఆ రోజులాగా చేయవుగా. నువ్వు ఇంకా వస్తావని చాలా చీకటి పడేవరకు పిచ్చివాడిలా వెయిట్ చేసాను."

"సారీ. కుమార్ ! నన్ను క్షమించు. ఈసారి ఇలా సిగ్గుపడి నీ ముందు తలవంచుకునేలా ప్రవర్తించను" అన్నాను అంతులేని ధైర్యంతో.

"సరే చూస్తానుగా ! ఒకవేళ నీ నిర్ణయం మారితే వెంటనే ఫోన్ చేయి. అంతేకాని రేపు అందర్లో నన్ను అవమానం పరచద్దు ప్లీజ్ !"

"ఆ భయం నీ కొద్దులే !"

* * *

శారద తాము తెచ్చిన బట్టలన్నీ ముందేసుకొని చూస్తోంది. నేను ఇవేవి గమనించనట్లు నా గదికి రాబోతున్న నన్ను శారద గబుక్కున నా చెయ్యి పుచ్చుకొని వాటి ముందు కూలేసింది.

"అక్కా ! నీ పెళ్ళి చీరలన్నీ చూసి నా సెలక్షన్ ఎలావుందో చెప్పు" అంది ఉషారుగా.

"నీ సెలక్షన్‌కి ఎప్పుడూ వంక వుండదు" అన్నాను తప్పించుకోవాలన్నట్లు.

"అంత తేలిగ్గా చెప్పక. ముందీ చీరలు చూడు. ఈ పెద్ద బార్డర్ వున్న కంచి చీర చూసావా ? ఇది ముహూర్తం టైమ్‌లో కట్టుకుంటే బాగుంటుందని నేను అనుకున్నాను. నాన్నగారు సరే అన్నారు. ఈ చీర ఖరీదెంతో తెలుసా ? పదిహేను వందలు. ఇటు చూడు ఈ గ్రీన్ డబుల్ షేడ్‌లో వున్న జరీగడి చీర చాలా అందంగా వుందికదూ, ఇది రిసెప్షన్‌కికట్టుకుంటే బాగుంటుంది, ఇది కాస్త ధర ఎక్కువేలే రెండువేల రెండువందలు, మరి ప్యూర్ జరీట. ఈ సింపుల్ చీరలన్నీ ఏడొందలు, ఎనిమిది వందలే ఏవో చిన్న చిన్న ఫంక్షన్సప్పుడు కట్టుకో వచ్చనికొన్నాం. ఇక నగలు రెండు మూడు సెట్లు పట్టుకొచ్చాం, మిగిలినవి మంచి డిజైన్స్ చూసి ఆర్డర్ ఇచ్చి వచ్చాం. ఏం నీకు నచ్చాయా ?"

"మొత్తానికి నాన్నగారిచేత డబ్బు చాలా తగలేయించావన్నమాట."

"అలా అనకు. నాన్నగారు వింటే బాధపడతారు ఆయన మనకు ఖర్చుపెట్టటానికి ఎప్పుడూ వెనుతీయరు. ఆయనకు అందులోనే ఆనందంవుంది. ఈ చీరలు నగలు చూస్తుంటే నాకిప్పుడే పెళ్ళిచేసుకోవాలనివుందే" శారద నా భుజంమీద వాలిపోతూ అల్లరిగా అంది.

"కావాలంటే తీసుకోవే ! నాకివేమి నిజంగా వద్దు" అన్నాను రేపటిరోజు ఎలావుంటుందో తలచుకుంటూ.

"అబ్బ వరదాకన్నానే, ఎప్పుడూ సీరియస్సే ఎలా వేగుతాడో మా బావ" శారద సణుక్కుంటూ, చీరలు, నగలు అన్నీ ప్యాకెట్స్‌లో పెట్టడంలో నిమగ్నం అయింది.

నేను దీర్ఘంగా నిట్టూర్చి అక్కడనుంచి వచ్చేసాను. నాన్నగారు నా పెళ్ళిగురించి బహాశ ఓ రంగుల కల చిత్రించుకొని వుంటారు. అది అబద్ధం కాబోతోందని తెలిస్తే ఆయన నన్ను క్షమించగలరా !

ఎన్నో ఏర్పాట్లు ఆయన హోదాకి తగినట్లు చేస్తున్నారు. కాని కూతురి మనసు హోదాలమీద అంతస్తులమీద లేదని, తను ప్రేమించిన వ్యక్తికోసమే ప్రాకులాడుతోందని ఆయన గ్రహించగలిగితే ఎంత బాగుండును. నాకీ క్షోభ వుండదుగదా !

* * *

రాత్రంతా గట్టిగా నేను చేసుకున్న నిర్ణయం సడలనివ్వలేదు నాన్నగారు ఆఫీసుకు వెళ్ళగానే, బయలుదేరటానికి నిశ్చయించుకున్నాను. నాక్కావలసిన మెడికల్ బుక్స్, అవసరమైన సరంజామా, మామూలుగా నేను కట్టుకునే కొన్ని చీరలు మటుకు, వి ఐ పి కేస్‌లో సర్దుకొని క్రిందకు దిగివచ్చాను. శారద ఎవరితోనో హాల్లో నిలబడి మాట్లాడుతోంది

"అక్కా ! ఎక్కడికి బయల్దేరావ్ !" అంది ఖంగారుగా.

"నా చీరలు కొన్నిటికి మ్యాచ్ జాకెట్లు లేవు. తీసుకొచ్చుకోవటానికి వెళుతున్నాను" అన్నాను దానివంక చూసే ధైర్యం లేక ఎటో చూస్తూ.

"సరే. త్వరగా వచ్చేయి. డిస్టెంపర్ వేయటానికి మనుషులు వచ్చారు వంటవాళ్ళు మధ్యాన్నం వస్తారుట" అంది

"సరేలే" అంటూ బయటకు వచ్చేసాను.

కుమార్ ఇంటిముందు ఆటో దిగుతూనే ఆశ్చర్యపోయాను. ఒక రోజులో ఆ ఇంటి రూపురేఖలు చాలా మారిపోయాయి. ఇంటిముందు షామియానా వెలిసింది. మామిడి తోరణాలతోను, కాగితపు కత్తిరింపులతోను, నిండుగా వుంది. బంధువులో స్నేహితులో ఇంటినిండా బిలబిలలాడుతున్న జనసందోహం అంత చొరవగా లోపలికి అడుగు పెట్టటానికి నాకే మొహమాటంగా అన్పించింది

"రా, రా ! స్వాతి. నీకోసమే చూస్తున్నాం. ఇన్ని ఏర్పాట్లు చేసాక నువ్వు వస్తావో రావో అని ఒకటే ఖంగారు." అంటూ కుమార్ వదిన నా చేతిలో సూట్‌కేస్ అందుకొని, గబగబ లోపలికి తీసుకెళ్ళారు.

వంట ఇంట్లో పెద్దపెట్టున వంట ఏర్పాట్లని జరుగుతున్నాయి.

కుమార్ నన్ను చూస్తూనే సంతోషం, తృప్తి వెలిబుచ్చాడు కళ్ళతోనే ! అతను తలనిండా స్నానం చేసినట్లున్నాడు, ఒత్తైన అతని నల్లనిజుట్టు మాటిమాటికి నుదిటిమీద పడుతుంటే సవరించుకుంటున్నాడు. తెల్లని గ్లాస్కోలో, తెల్లని లాల్చీలో









మీ దినచర్య

# టాన్‌టెక్స్®

తోనే ప్రారంభించండి

పగలు మొదలు రాత్రి వఱకు టాన్‌టెక్స్‌నే ధరించండి. దాని అమరిక, పొందిక మీ దినచర్య లందు ఎంతో తోడ్పడును.

IS : 4964




మీకు ఖచ్చితంగా
సరిపోతుంది
టాన్‌టెక్స్

బ్రీఫ్‌లు • వెస్ట్‌లు • క్యాజుయల్స్ • స్పోర్ట్స్
పిల్లల దుస్తులు




TTK తంపూరి

Imageads-M- TT.1568 Tel



"దశబాహు లక్ష్మీగణపతి"

(శ్రీశైలం దేవస్థాన ఆలయ ప్రాకారశిల్పం • (ఫొటో: వెల్లటూరి పూర్ణానందశర్మ)

బుగ్గన చుక్కతో కొత్తగా కన్పించాడు నా కంటికి ఇద్దరం ఏం మాట్లాడుకోవాలో తెలియనట్లు మూగగా వుండిపోయాం ఇంతలో అతని ఫ్రెండ్స్ ఎవరో రావటంతో అతను బయటకు వెళ్ళిపోయాడు

## దాంపత్య సంగీతం

"స్వాతీ! బాత్‌రూమ్‌లో షాంపు అన్నీ సిద్ధం చేసాను వెళ్ళి-తలంటు పోసుకురా!"

"అయ్యో, నేనింతకుముందే స్నానంచేసానండి" అన్నాను. కొత్త ఇంట్లో నాకు చాలా మొహమాటంగా వుంటుంది.

"తలంటి పోసుకోవాలి ఈరోజు. షాంపుతోనే. రెండు నిముషాల్లో అయిపోతుందిలే. ఫరవాలేదు" అంటూ మరో మాటకి తావివ్వకుండా నన్ను నెట్టినంత పని చేసారు.

తరువాత ఆమె నన్ను కూర్చోపెట్టి తల చిక్కుతీసి జడ అల్లారు. బజారునుంచి కొనితెచ్చిన పూలజడ, ఇద్దరి ఆడపిల్లల సహాయంతో నా జడకి కుట్టటం మొదలుపెట్టారు.

"స్వాతీ! ఆ చీర విప్పేసి అదుగో ఆ పట్టుచీర కట్టుకో, రాత్రి కుమార్‌ని తీసుకెళ్ళి హడావిడిగా కొన్నాను. నీకు నచ్చుతుందో లేదో అని భయపడుతూనే కొన్నాం."

"ఎందుకండి ఇంత ఆర్భాటాలు చేసారు. ఇవన్నీ వుంటే కాని పెళ్ళికాదా!" అన్నాను వుండబట్టలేక.

"భలేదానివే ఒక్కరోజులో సింపుల్‌గా కాకపోతే, ఆర్భాటంగా ఏం చేయగలం? అక్కడికి కుమార్ స్నేహితులు, చాలామంది వచ్చి ఏర్పాట్లన్నీ వాళ్ళే చూస్తున్నారు."

పెళ్ళికూతురి వేషంలో నన్ను నేను నిలువుటద్దంముందు చూసుకుంటు, కుమార్ వదిన ఇచ్చిన పట్టుచీరలో ముస్తాబయ్యాను.

"అక్కా. నిన్ను పెళ్ళిరోజు మేకప్ చేయటానికి బ్యూటీ క్లినిక్‌నుండి ఇద్దరు హెయిర్ డ్రస్సర్స్‌కి చెప్పాను." అన్న శారద మాటలు గుర్తొచ్చాయి.




లింటాస్. L. 75-149 TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# దాంపత్య సంగీతం

"ఏమ్మా! అందరూ బయల్దేరదామంటు న్నారు గుడికి. నీ అలంకరణ అయిందికదా," అంటూ వచ్చిన కుమార్ వదిన నన్ను చూస్తూనే, ఒక్క క్షణం తృప్తిగా నవ్వి "ఇలాంటి సాదా పట్టుచీర నీకు నిజానికి తగదు, చీరకే అందం తెచ్చావ్ స్వాతీ! వుందు ఈ నగలు మన అత్తగారివి. కోడళ్ళనిద్దర్ని సమానంగా తీసుకోమని ఇచ్చిపోయారు" అంటు రెండు పేటల సైకిల్ చైన్, రెండు జతల గాజులు నా చేతికిచ్చారు.

రెండు మూడు కార్లలో అందరూ ఎలాగో సర్దుకొని గుడికి వెళ్ళాం.

అక్కడ కుమార్ స్నేహితులు కొంతమంది, కుమార్ అన్నయ్య, బ్రాహ్మలు ఇద్దరు మాకోసం ఎదురు చూస్తూ వున్నారు.

శాస్త్రోక్తంగా నాకు, కుమార్‌కి వివాహం అయింది. అంత త్వరగా గృహిణి నవ్వాలని కాని, అవుతానని కాని నేనంతకుముందు వూహించనందు వలన నా కదంతా ఆశ్చర్యంగానే వుంది.

* * *

ట్రైన్ బయలుదేరటానికి ఇంకా అరగంట టైమే వుంది. పొద్దునుంచి పెళ్ళి తతంగాలతో ఎక్కడా రెస్ట్ తీసుకోలేదు చాలా అలసటగావుంది. దానికితోడు ఇంట్లో ఎలాంటి గందరగోళం జరిగిందో అని కంగారుగా వుంది. మధ్యాహ్నం భోజనా లైయ్యాక, నాన్నగారికి, మా వివాహం అయినట్లు తెలియచేస్తూ ఆయన్ని క్షమించమని వేడుకుంటూ, ఈ రాత్రికే మేము వైజాగ్ వెళుతున్నట్లు వ్రాసి, ఎలాగైనా మా ఇంటికి పంపమని కుమార్ కిచ్చాను. నన్ను నాన్నగారు క్షమించరు.

"ఏమ్మా! స్వాతీ! వెళ్ళగానే, కాస్త తీరుబడి చేసుకొని ఉత్తరం వ్రాయి" ఏదో చెప్పారు కుమార్ వదిన.

అలాగే నంటూ తలూపాను. మనసంతా ఏమిటో తెలియని అయోమయంలో వుంది.

"అక్కా!" దూరంగా ఎవరో నన్ను పిలవటం విన్పించినట్లై ఉలిక్కిపడి చూపాను.

శారద వానిటి కేస్‌తో నిలబడింది. గబగబా శారద దగ్గరకెళ్ళాను.

"శారదా! నాన్నగారు రాలేదా ?" అన్నాను.

"రాలేదక్కా. ఆయన మనసేం బాగలేదు. వచ్చే స్థితిలో లేరు. దీనిలో నాన్నగారు నీకు పెళ్ళికని చేయించిన నగలు వున్నాయి. నీ పెళ్ళి కానుగ్గా నాన్నగారు పంపారు. తన బాధ్యత ఇదొక్కటైనా సవ్యంగా తీర్చుకోవాలని నాన్నగారి ఆశ."

"శారదా! నువ్వలా అనటం ఇప్పుడు సహజం. కాని మెల్లిగా ఆలోచించి చూడు. నేను చేసిన దాంట్లో తప్పు కన్పించదేమో. ఈ నగలే నా కొద్దే! వీటి గురించి నేనేనాడు ఆశపడలేదు. వీటిని మించింది నాన్నగారి అభిమానం, అదినాకు దొరికితే చాలు."

"సరే నీ ఇష్టం. కాని అక్కా! దేనికోసం అయితే తండ్రిని, తోడబుట్టినవాళ్ళను వదిలేసి వెళుతున్నావో, ఆ ప్రేమ నీకు జీవితాంతం వుండేలా చూడమని భగవంతుడిని కోరుకుంటున్నాం. వస్తాను" అంటూ మరో మాట విన్పించుకోకుండా పరుగులాంటి నడకతో వెళ్ళిపోయింది శారద.

"స్వాతీ!" శారద వెళ్ళినవైపే పిచ్చిదానిలా చూస్తూ నిలుచున్న నా దగ్గరకి కుమార్ రావటం నేను గమనించలేదు. అతను నా భుజంమీద చేయి వేస్తూ "వెళదామా! ట్రైన్ టైమైంది" అనటంతో బాధని దిగమింగుకొని అతని వెంట నడిచాను.

## అంతే తేడా!

ముక్కుతాడు
పసుపుతాడు
ఒకటే అని భావిస్తే
ముక్కుతాడు మనిషి పశువుకి కడితే
పసుపుతాడు పశువు మనిషికి కడుతోందని
కచ్చితంగా చెప్పొచ్చు

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

## 5

వైజాగ్ స్టేషన్‌కి అతని స్నేహితులు ముగ్గురూ, భార్యలతో వచ్చారు.

"ప్రయాణం జాలిగా అయిందా!" అంటూ పలకరించారు.

"స్వాతి! వీళ్ళు నా ఫ్రెండ్స్. ఇకనుంచి మన ఫ్రెండ్స్. సుధాకర్ వాళ్ళ శ్రీమతి శ్యామల, వీడు ప్రకాశ్, మిసెస్ సరోజ, వీడు అరవింద శ్రీమతి రాధ" అంటూ అందర్నీ పేరు పేరున నాకు పరిచయం చేసాడు కుమార్!

వాళ్ళంతా చొరవగా మాటలు కలిపే తీరు చూస్తుంటే ఇలాంటి వూళ్ళో మా యోగక్షేమాలు ఆలోచించే మంచి స్నేహితులే వున్నారన్న తృప్తి కలిగింది.

"అన్నట్టు ఇల్లు విషయం ఏమైంది."

"మొట్టమొదట నీకు ఒక్కడికే అని చెప్పావ్ కదోయ్! ఓ చిన్న ఇల్లు శ్రీనగర్‌లో చూసాం పెద్ద ఇల్లు కావాలని నువ్వు వ్రాసిన ఉత్తరం లేట్‌గా అందింది అయినా ఈ వైజాగ్ మహానగరంలో ఇల్లు దొరకటం మహా ప్రాబ్లమ్‌లే! కొన్నాళ్ళకు అలాగే అడ్జస్ట్ అవ్వాలి. మెల్లగా మరో ఇల్లు చూద్దాం అయినా ఇప్పుడు ఇల్లు గురించి గొడవ వద్దులే! మా ఇళ్ళల్లో కొన్నాళ్ళు వుండి మెల్లగా ఫ్యామిలీ పెట్టచ్చు. హడావిడి ఏమిటి."

"ఔను కుమార్! ఇప్పుడే చెల్లెమ్మని తీసుకెళ్ళి వంట – వార్పు అంటూ ఇబ్బంది పెట్టక్కర్లేదు. తనకు కొత్త కదా!" అంటూ సుధాకర్ అనటంతో, ఆడవాళ్ళంతా 'మా ఇళ్ళ కొచ్చేసేయండి' అంటూ మమ్మల్ని బలవంత పెట్టారు

కుమార్ బుర్ర గోక్కుంటూ "వదిన ఏదో మంచిరోజు అంటూ ముహూర్తం పెట్టి మరీ పంపింది అయినా ఈ వూళ్ళోనే వుంటాం కదా ఎప్పుడుపడితే అప్పుడే మీ ఇళ్ళల్లో తిష్ట వేసేస్తాం" అంటూ సర్ది చెప్పినమీదట, అందరు వూరుకున్నారు

వాళ్ళు తెచ్చిన రెండు కార్లల్లోను సామాను సర్ది చెరో కారులో కూర్చున్నాం వాళ్ళు చెప్పినట్లు ఇల్లు చిన్నదే ముందు చిన్న వరండా, తరువాత వరుసగా రెండు గదులు, చిన్న వంట గది. అయితే






ఇంట్లోకి వెళ్ళగానే మమ్మల్ని ఆశ్చర్యపరిచిన విషయం ముందు గదిలో టేబుల్, కుర్చీ, పేషెంట్స్ కూర్చోటాని కన్నట్లు పొడుగు బల్ల, రెండవ గదిలో డబుల్‌కాట్ మంచాలు, చిన్న డైనింగ్ టేబుల్, నాలుగు కుర్చీలు, వంట ఇంట్లో కొన్ని వంట సామాన్లు, స్టౌ, అన్ని అమర్చినట్లు వున్నది ఆ ఇల్లు!

''అదేమిటి. ఈ వూళ్ళో ఫర్నిచర్‌తో అద్దె కిస్తారా!'' అన్నాను ఆశ్చర్యంగా.

కుమార్ వాళ్ళవంక చూస్తూ ''లేదు. స్వాతి. ఇదంతా వీళ్ళ పని. ఏమిటో మీ ఉద్దేశ్యం'' అన్నాడు.

''ఏమిలేదు. రాగానే వేటికోసం వెతుక్కో కుండా!'' అన్నాడు అరవింద తేలిగ్గా తీసేస్తూ.

''కుమార్. నువ్వు మమ్మల్ని పెళ్లికి పిలవ లేదు కదా. కనీసం బహుమతి అయినా ఇచ్చి మమ్మల్ని మేము తృప్తిపరచుకోవాలని చేసాం'' అంటూ సరోజ అనేసరికి,

''కుమార్! దీన్ని గురించి పెద్ద సీరియస్‌గా తీసుకోక. మా ఆనందం కోసం చేసాం. అంతే!'' అప్పటితో ఆ ప్రసక్తి ఆగిపోయినా మా మనసుల్లో వాళ్ళపట్ల అంతులేని కృతజ్ఞత అలాగే నిండివుంది.

అందరం కుమార్ సలహామీద హోటల్లో భోంచేసాం. ఈసారి కుమార్ ఎవర్నీ పర్సు బయటకు తీయనివ్వలేదు. మమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్‌చేసి వాళ్ళు వెళ్ళిపోయారు. కుమార్ మరునాడు వంట క్కావాల్సిన ముఖ్యమైన సామాను తీసుకొస్తానంటూ అతను ఇంటికి రాగానే వెళ్ళిపోయాడు. ఇల్లు ఒక్కసారి చుట్టివచ్చి బద్ధకంగా అలాగే మంచంమీద పడుకున్నాను.

ఎవరో మృదువుగా చెంపమీద స్పృశిస్తుంటే బద్ధకంగా కళ్ళు విప్పాను. ఎదురుగుండా కుమార్! నీరెండ కిటికినుంచి లోపలికి ప్రవేశిస్తోంది.

''అప్పుడే బజారునుంచి వచ్చేసావా?'' అన్నాను బద్ధకంగా ఆవలిస్తూ.

''నే వచ్చి రెండు గంటలు పైన అయింది. లే కాఫీ తాగుదువుగాని.''

''ఇప్పుడు టైమెంత అయిందీ!''

''ఐదు దాటింది.''

''బాపురే. అంతసేపు పడుకున్నానా! మరి ఇంతసేపు నువ్వు ఏం చేస్తున్నట్లు.''

''ఈ స్లీపింగ్‌బ్యూటీని చూస్తూ కూర్చున్నాను'' అంటూ మెల్లగా నా చెంపమీద కొట్టి ''ఇంకలే. అలా బయట చూడు. ఎంత బాగుందో'' అంటూ కుమార్ నన్ను లేపి కూర్చోపెట్టాడు.

ఆ రెండు గంటలు అతను వూరికే కూర్చో లేదని వంట ఇంట్లోకి వెళ్ళాకగాని అర్థంకాలేదు. అంతకుముందు కాళీగావున్న అలమరాలన్ని ప్లాస్టిక్ టిన్స్‌లోను, పప్పులు వెచ్చాలతోను నిండుగా కళకళ లాడుతున్నాయి. వంట ఇల్లు సర్దిన ఆ తీరు చూసి ఆడవాళ్ళే అబ్బురపడేలావుంది. ఇన్ని సామాన్లు జీవితానికి కావాలని నాకంతముందు తెలియదు.

''ఏమిటలా చూస్తున్నావ్! నేను సర్దింది నచ్చకపోతే రేపు తీరుబడిగా మళ్ళీ నువ్వు సర్దుదువు గాని లే.''

''నేనా. నయం. నా సంగతి నీకు ఇంకా



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– ఎడి

తెలియదు. వంట ఇంటి విషయంలో ఎ. బి. సి.లు తెలియవు" అన్నాను ఏమాత్రం సిగ్గుపడకుండా!

"ఫరవాలేదులే! వాటిగురించి దిగులుపడకు. సరే త్వరగా డ్రస్ చేసుకురా. ఈ బందిఖాన నుంచి బయట పడదాం"

"బందిఖాన అనకు. ఇది మన స్వీట్‌హోమ్."

"స్వాతీ! ఈ ఇల్లు చూడగానే నువ్వు దిగులు పడలేదా. ఈ బీదవాడిని చేసుకున్నాక ఇలాంటివి తప్ప వనుకున్నావా!"

"అలాంటి వూహే నాకు రాలేదు. పెద్ద పెద్ద భవంతులకోసం, డబ్బుకోసం నేనేనాడు ఆశపడలేదు. కాబట్టి నాకు ■ చింతలేదు. ఇంకెప్పుడు నువ్వు అలా మాట్లాడకు. బీదతనమో, భాగ్యమో ఇద్దరిదీను. నన్ను విడతీసి మాట్లాడకు."

"సారీ స్వాతి. నువ్వు ఆనందంగా వుంటే నాకంతే చాలు. సరే త్వరగా వెళ్ళి స్నానం చేసిరా. బాత్‌రూమ్‌లో నీళ్ళు పెట్టేసాను."

"ఇదిగో మరొక విషయం కూడ విను. ఇలా నాకు సేవలేం చేయక్కర్లే. మెల్లగా నా పనులు చేసుకోటానికి నేను అలవాటు పడనీ!" అన్నాను. అతనలా నా పనులన్నీ చేసి పెడుతుంటే చాలా సిగ్గుగా అన్పించింది.

"నేనేం కష్టపడలేదులే. నువ్వు లేచేసరికి నీళ్ళు పోతాయని పట్టి పెట్టాను."

నేను స్నానం చేసి వచ్చేసరికి నా లైట్ బ్లూ ఆర్గండీ చీర, దానిమీద మాచ్ జాకెట్టు తీసి మీద పెట్టాడు కుమార్! అది చూసి నేను ఏదో అందామని నోరు విప్పేసరికి "మై డియర్ మేడమ్! దీన్ని కాదనకు. నీ చీరలు సెలెక్ట్‌చేసే బాధ్యత ఎప్పుడూ నాది. ఇందులో శ్రమలేదు. ఆనందం వుంది" అంటూ మరి నన్ను మాట్లాడనివ్వలేదు.

నా అలంకరణ అంతా అయ్యాక బొట్టు పెట్టుకోబోయి "అద్దం ఒకటి చాలా ముఖ్యం కుమార్, మంచిది చూసి కొందాం."

"ఆ బొట్టు ఇలా తే" అంటూ తనే అందుకొని నా నుదిటిమీద దిద్దాడు కుమార్.

"రోజూ అద్దం కొనకుండా ఇలాగే మానేజ్ చేద్దామా?" అన్నాను.

"మరి నాకీ అవకాశం పోదు. అద్దం కొంటే."

"నేనెలా వున్నానో చూసుకోవాలని వుంది."

"అవ్సరనలా. కావాలంటే నా కళ్ళల్లోకి చూడు."

"అంత చిన్న కళ్ళల్లో నేను కన్పించను బాబు."

ఇద్దరం ఇంటికి లాక్ చేసి బయట పడేసరికి సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి.

"ఇంతకీ ఎటు వెళదాం?" అన్నాను.

"ఎటు వెళ్ళినా మనకు కొత్తగానే వుంటుంది కాబట్టి అలా వెళదాం." ఇద్దరం ఏవో కబుర్లు చెప్పుకుంటు చాలా దూరం నడిచాం.

"అక్కడవో చిన్న కోవెల కనిపిస్తోంది. వెళదాం పద" అన్నాడు కుమార్ దూరానికి చూపిస్తూ.

**(ఇంకా వుంది)**



## పలుకుబడి ప్రభావం !

శ్రీమతి శుక్లావిజయ అనే ఆవిడ మద్రాసులో అత్యధికధునాతనంగా వేశ్య గృహాన్ని నడుపుతోందట. ఈగృహానికి గుంటూరుకు చెందిన ఆయేషా బేగం, ఆమె భర్తగా చెలామణీ అవుతూన్న ఇక్బాల్ కలిసి అరుణకుమారి అనే అమ్మాయిని సినిమాలలో వేషాలిప్పిస్తాం అని మాయజేసి తీసుకెళ్ళి, రెండు వేలకమ్మేశారట. ఈ కేసు చాలా బలంగా తయారైనా, శుక్లా విజయ్‌కు రాజకీయ నాయకులతోనూ, ప్రభుత్వాధికార్లతోను కల పలుకుబడితో ఈ కేసు చప్పున చల్లారి, అతీ గతి లేకుండా పడుందట.

## చిక్కుల్లోపడ్డ గొప్పింటి బిడ్డ!

కాలిఫోర్నియాకు చెందిన వెంతురా నగరంలో వో మన్మధరావు తన కామేచ్ఛను వో నారీమణి వద్ద యధేచ్ఛగా తీర్చుకుని, అనక ఆమె అడిగిన డబ్బు యివ్వక పోయేసరి కామెకు ఒళ్ళుమండి, ఇల్లు వూడ్చే ఎలక్ట్రికల్ పరికరం ట్యూబు అవతలి కొసకు యీతని పురుషావయవాన్ని దూర్చి, కరెంటు స్విచ్ ఆన్‌చేసి వదిలిందట. దాంతో ఆ వాక్యూమ్ క్లీనరాతని అవయవాన్ని రాపాడి వదిలిందట. గాయపడి, రక్తం కక్కిన దాంతో ఆతను ఆసుపత్రిపాలై తన పేరు చెప్ప నిరాకరించాడట తాను గొప్పింటి బిడ్డనని చెప్తూ.

### జైలుపాలైన జకరయ్య :

విజయవాడ నివాసి జకరయ్య అనే మేధావి మార్కాపురం అదేపనిగా వెళ్ళి అక్కడ అమాయక నిరుద్యోగులతో తాను వారికి చక్కనివుద్యోగా లిప్పిస్తాననీ, చక్క చక్కని జీతా లిప్పిస్తాననీ మాయ మాటలు చెప్పి, అట్టి వుద్యోగాలకు యివ్వాల్సిన మామూళ్ళివ్వండి అని సుంకంగా వసూళ్ళు చేసి, చట్టానికి పట్టుబడి మూడేళ్ళు జైలు శిక్ష, ఆరువేలు జరిమానా పొందాడట — అత్తెలివి !

### ఓడలో ఆడపనివారు !

వోడలో పనిచేసే ఆడవారు ఎంతవారించినా ప్రయాణికులతో సరదాలలో పడి గర్భం ధరిస్తూనే వున్నారనీ, దీనివల్ల తనకు చాలా బాధగా వున్నదనీ వర్జీనియాకు చెందిన నార్ఫోక్‌లో వో వోడకేప్టెను వాపోయాడట. నేవీ రూల్సుప్రకారం గర్భిణి అయిన స్త్రీ వుద్యోగం సముద్రయానంకు పనికిరాదట. ఆమెను రేవు డ్యూటీలకు మారుస్తారట. ఈ రూల్సువల్ల అసలు డెక్‌మీద పనిచేసే ఆడవారు తక్కువైపోతూన్నారట. ఒక యునైటెడ్ స్టేట్స్ వోడలో పనిచేస్తున్న వంద మంది ఆడవారు 1980 లో మితిమీరి ఆ వోడలోని ప్రయాణికులతో ఖులాసా సంబంధాలు పెట్టుకున్నందువల్ల వారిలో పలబై మంది గర్భిణులై చక్కాపోయారట!

### ఎవరికైనా పిల్లల్ని కనిచ్చే ఆడవారు !

కుటుంబం పెద్దదవుతోంది మొర్రో అని వో యిద్దరు పిల్లలు పుట్టగానే ఆపరేషన్లు చేయించుకోడం రివాజు. ఆడవారు కొందరు శాశ్వతంగా పిల్లలు పుట్టకుండా కూడా ఆపరేషన్లు చేయించు కుంటున్నారు అనేక కారణాలవల్ల. అలా ఆపరేషన్లు చేయించుకున్నవారి భర్తలిహ మళ్ళీ తండ్రులు కాలేరని, వారిని చూస్తే తమకు జాలి పుడుతోందని కనుక తమ భార్యలు ఆపరేషన్లు చేయించుకున్న ఏ మగాడికయినా పిల్లలు కావాలనే కోర్కె వుంటే తాము గర్భము ధరింప సర్వసిద్ధంగా వున్నామని కొన్ని వందల మంది ఆడవారు అమెరికాలో ప్రకటించారట. లూయిస్ విల్లీలో వో డాక్టరుగారు అటువంటి వో పురుషుని వీర్యాన్ని తీసి గర్భధారణకు ఒప్పుకున్న వో స్త్రీలో ప్రవేశ పెట్టి ఆమెను గర్భిణి చేశారట — ఎలాగయినా ఘోరెను ఘోరనే !

### మొదటికే మోసం తెచ్చిన చర్చ !

కర్నాటక రాష్ట్రం ఘటప్రభలో వో దంపతులిద్దరూ వో సుముహూర్తం నాటిరాత్రి పడగ్గదిలో ముచ్చట్లాడుకుంటూ కుటుంబనియంత్రణ గురించి చర్చ ఆరంభించి, ఆపరేషను మీరు చేయించుకోండి అంటే నువ్వే చేయించుకోరాదూ అని కన్నడంలో ఘర్షణపడి, ఆ ఘర్షణను వాగ్యుద్ధంగా మార్చుకున్నారట. ఈ పద్ధతి బొత్తిగా నచ్చని "ఆమె" కత్తి తీసుకుని తన భర్త పురుషావయవాన్ని నరుక్కున కోసి పారేసిందట — బాబోయ్ !

### 24గంటలలోగా ఆస్పత్రినుంచి అతఃపురానికి!

చార్లెస్ రాకుమారుడు తన భార్య డయానా ప్రసవించిన యిరవైనాల్గు గంటలలోగానే ఆమెను ఆసుపత్రి నుంచి రాజసౌధానికి తీసుకుపోయి తీరాలని చెప్పి, అంత పనీ చేశారట. అపురూపమైన యీ కాన్పులో రాజ కుటుంబంలోనే యీ సంఘటన అపురూపమట. డయానా ఆరోగ్యంగానే వున్నది. పిల్లవాడూ చక్కా వున్నాడు. ఇహ ఆసుపత్రిలో వుండడమెందుకు? వచ్చిన పనైంది కదా అని ఆతడు అన్నాడట— వెల్సెడ్ మిలార్డ్ !

### పాము కాటు నుంచి బాలుని కాపాడిన కుక్క !

దక్షిణ గోవాకు చెందిన సావోరెడెమ్ అనే గ్రామంలో వో పదకొండేళ్ళ కుర్రాడు తమ పెంపుడు కుక్కతో జీడిమామిడి పళ్ళు కోసుకోడానికోఅడవికి వెళ్ళాడట. ఆతను విసిరిన రాయి పాముకు తగిలేసరికాపాము బుసుసన లేచి అతన్ని కాటు వేయ బోయిందట. అది చూసిన కుక్క ఎగిరి గంతేసి,ఆపామును పట్టుకున్నదట. ఈ పోట్లాటలో కుక్క పామును చంపేసిందట. చచ్చేముందు ఆ పాము వేసిన కాటుతో కుక్క కూడా తన యజమానిని రక్షించి, "కుక్క విశ్వాసం" అన్న ఆర్యోక్తిని ఋజువుచేసి, కన్ను మూసిందట.



అది అతని మొదటిరాత్రి మనోరంజకంగా అలంకరించబడిన శోభనపు గదిలోకి నవమన్మథుళ్ళా ప్రవేశించినకామేశం ఒక్కసారి గదినంతా కలయజూశాడు లేత నీలంరంగు విద్యుత్ కాంతిలో గదిగోడలు మెరిసి పోతున్నాయి పందిరి మంచానికి పైనుంచి సన్నజాజులు మల్లెపూల దండలు వేళ్ళాడు తున్నాయి గది గోడలకు అందమయిన పెయింటింగ్‌లు అలంకరించబడ్డాయి మంచానికి తలగడ దిక్కున రకరకాల పళ్ళు, తినుబండారాలు చక్కగా అమర్చబడిఉన్నాయి. ఓ పక్కగా స్టాండులో అగరువత్తులు మనోహరమయిన పరిమళాన్ని వెదజల్లు తున్నాయి జాజుల మల్లెపూల గుబాళింపులు అగరువత్తుల సుగంధ వీచికలతో కలిసి గుండె లోపలి అరల్లో సున్నితమయిన అలజడిని కల్గిస్తున్నాయి వాతావరణం అతనికి వింతగాను, కొత్తగాను ఉండి ఆనందాన్ని ఆహ్లాదాన్ని కల్గిస్తోంది నెమ్మదిగా ముందుకు నడిచి స్వచ్ఛంగా తెల్లగా ఉన్న మెత్తని పడకపై సగం మేను వాల్చి తలగడ కానుకుని కూర్చున్నాడు

కామేశం తెలుగు లెక్చరరు సహజంగానే ఆ సమయంలో అతను చదివిన కావ్యాలలోని ప్రబంధాలలోని మధురమైన సన్నివేశాలు అతనికి జ్ఞాపకం వచ్చి ఒళ్ళు పులకరించి నట్లయింది అంతలో అతనికి లక్ష్మి జ్ఞాపకం వచ్చింది ఆమెతో కాలేజీలో తన మొదటి పరిచయం, ఆ సంఘటనలు అతడి కళ్ళముందు కదలాడాయి

కామేశం యీ మధ్యే లెక్చరరుగా కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించాడు చేరిన కొత్తలోనే, ఒక నెల కూడా కాలేదు బహుశః, ఒకరోజు ప్రిన్సిపాల్ అభ్యర్థన మేరకు ఫైనల్ వాళ్ళ స్పెషల్ తెలుగు క్లాసుకు వెళ్ళాల్సివచ్చింది. సాధారణంగా కొత్తగా వచ్చిన లెక్చరర్లకు ఫైనల్‌యియర్ క్లాసులు ఎలాట్ చెయ్యరు. నిజానికది తెలుగు హెడ్ సుబ్బారాయుడుగారి క్లాసు, కాని ఆయన రోజు శెలవు మిగతా స్టాఫ్ అందరకూ వాళ్ళ వాళ్ళ క్లాసులున్నాయి. అందువలన ఆ క్లాసు కామేశం పాలబడింది. అయితే అది అంతా ఆడపిల్లలే ఉన్న సెక్షన్. ఆడపిల్లలకూ కామేశానికీ కొంచెం దూరం. యూనివర్సిటీలో చదవాడన్న మాటేగాని అతనికి ఆడపిల్లలతో ఏమాత్రం పరిచయాలు కలగలేదు కలిగించుకోలేదంటేనే బాగుం టుంది మొత్తంమీద జంకుతూనే క్లాసుకు వెళ్ళాడు అయితే క్లాసులో అడుగు పెట్టిన తర్వాత కొంచెం ధైర్యం పుంజుకున్నాడు ఉన్నది ముగ్గురే ముగ్గురు అమ్మాయిలు రోజు చెప్పాల్సింది వరూధినీ ప్రవర సంవాదం కొంచెం యిబ్బందిగా ఫీలయినా మొత్తంమీద బయటపడకుండా గంభీరంగా పాఠం ప్రారంభించాడు హమ్మయ్య ఫర్వాలేదు అనుకుంటుండగా ఒక్కసారిగా అమ్మాయిలు ఫక్కున నవ్వటం వినిపించగానే ఉలిక్కి పడ్డాడు పాఠం ఆపి సీరియస్‌గా చూశాడు వాళ్ళవంక

"ఎందుకు నవ్వుతున్నారు ?" అతని ప్రశ్నతో వాళ్ళ నవ్వులు వెలిశాయి

"అడగవే !" మోచేత్తో పొడుస్తూ అటూ యిటూ ఉన్న అమ్మాయిలు మధ్య నున్న అమ్మాయికి సంజ్ఞ చేశారు

ఆ అమ్మాయి ఓ మారు వాళ్ళవంక మరోమారు కామేశం వంక చూస్తూ లేచి నిలబడి—

"సార్ ! ఆ గోడ దగ్గిర బెంచీ మీద కూర్చోమంటారా మమ్మల్ని !" అని గభాల్న కూర్చుంది

కామేశానికి అర్థం అయింది అతనముఖం వివర్ణమయింది తాను ఆడపిల్లల వంక చూస్తూ పాఠం చెప్తే సభ్యతగా ఉండదను కుని ఎదురుగా గోడవైపు చూస్తూ పాఠం చెప్తున్నాడు. వీళ్ళతో ఇలా లాభం లేదనుకుని యీసారి వాళ్ళ ముఖాలవంకే చూస్తూ



చెప్పటం మొదలుపెట్టాడు. కానీ మళ్ళీ మరో యిబ్బంది వచ్చిపడింది ■ మధ్యనున్న అమ్మాయి ఎంతసేపూ అతని కళ్ళల్లోకే చూస్తూ కూర్చుంది పాఠం వింటోందో లేదో కూడా తెలీటంలేదు

నిజానికి కామేశం చక్కటి అందగాడు దబ్బపండు ఛాయలో మగసిరి ఉట్టిపడుతూ ప్రబంధనాయకుడిలా ఉంటాడు అందుచేత అతని ముఖం చూడటంలో ఆడపిల్లల తప్పులేదు. కాని అలా కళ్ళల్లో కళ్ళు పెట్టినట్లు తీక్షణంగా ఏదో వెతుకుతూ న్నట్లు చూడటం, చూస్తూ మాట్లాడటం అతనికి చచ్చే యిబ్బందిగా ఉంది ఆ అమ్మాయి ధైర్యానికి విస్తుపోవాలో చానికి విస్తుపోయాడు కూడాను

అప్పుడతడు "పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక " అన్న పద్యానికి వ్యాఖ్యానం చెప్తున్నాడు

"సార్" ఓ పక్కనున్న అమ్మాయి అడిగింది "పాటు అంటే ఏమిటి సార్ ?"

" భంగపాటు " అన్నాడు కామేశం భయం భయంగానే

"కాదేమోసార్ !" రఠ్ఠున అంది మధ్య నున్న అమ్మాయి.

"మరేమిటి ?"

"రెప్పపాటు కాకూడదా సర్ !"

"రెప్పపాటా ? ఎలా ?"

"రెప్పపాటు అంటే కళ్ళు మూసుకోవడం గదా !"

"అయితే !"

## తెల్లబోయిన తె. పాండిత్యం

"ఏముంది సార్ ! వరూధిని చాలా అందగత్తె, తనను కౌగిలించుకోబోయేసరికి ప్రవరుడు కళ్ళుమూసుకుని ఆమెను తోశాడు అంతటి తన అందాన్ని చూడకుండా కళ్ళు మూసుకోవడం అంటే వరూధినిని కించపర్చటమే గదా ! అలా కళ్ళు మూసుకోవడాన్నే బహుశః వరూధిని భరించలేక అలా అని ఉంటుందని అనుకోవచ్చుగదా !"

కామేశానికి నోట్లోంచి మాట రాలేదు. ఉక్రోషం, ఆవేశం కలగాపులగంగా ఉవ్వెత్తున లేచాయి. ఇంతలో బెల్లయింది గభాలున పుస్తకాలు తీసుకుని బయటకు వచ్చేసాడు కాని అప్పుడు ఆమె విరిచిన చిగురాకు పెదవుల మధ్య బిగించిన నవ్వు, కళ్ళలోంచి ఉరుకుతున్న కొంటెతనం తనకు యీనాటికీ బాగా గుర్తు

ఆ తర్వాత ఆమె చేసిన అల్లరిని కామేశం హెడ్ సుబ్బారాయుడిగారితో చెప్పాడు ఆయన తన్మయత్వంతో అరకన్నులు మూసికొని—

"ఆహా ! ఏం చెప్పిందోయ్ ! అదీ రసజ్ఞత అంటే ! నీకు తెలీదోయ్ ఆ పిల్ల మంచి కవయిత్రి, రసజ్ఞురాలు ! అలాంటి వాళ్ళకు పాఠం చెప్పటం నిజంగా అదృష్టమోయ్ ! అందుకే గదుటోయ్ ! కవి ఏమెరుగు రసజ్ఞుడెరుగు అన్నారు !" అంటూ ఏదేదో చెప్పాడాయన.

"ఈ ముసలాడికి ప్రతిదాంట్లోనూ రసమే కన్పిస్తుంది." అని గొంతువరకూ వచ్చిన కోపాన్ని దిగమింగి మనస్సులోనే తిట్టుకున్నాడాయన్ను

ఆ తర్వాత మధ్య అమ్మాయి లక్ష్మి వాళ్ళ నాన్న తమ ఇంటికి రావడం, తమ కుటుంబంతో ఆయన పాత స్నేహాన్ని నెమరు వేసుకోవడం, ఆ అనుబంధాన్ని బంధుత్వంగా మార్చుకోవాలనుకోవడంతో లక్ష్మి తన అర్ధాంగి కావటం, అంతా అతనికి సినిమా కథలా జరిగినట్లని పించింది

ఆలోచనల్నుంచి తేరుకుని కామేశం గది గుమ్మంవైపు చూశాడు. అవేమీ తెరుచుకుంటున్న జాడలు లేవు. అతని దృష్టి గోడమీది శృంగార శాకుంతలం పెయింటింగ్ మీద పడింది. ఆ బొమ్మ ఎంత అందంగా చిత్రించబడింది ! దుష్యంతుడి ముఖంలో ప్రణమోద్వేగం, శకుంతలలో తత్తరపాటు చాల అద్భుతంగా ప్రతిఫలిస్తున్నాయి దాన్నలా చూస్తుంటే అతనిలో అనేక శృంగారభావాలు అంకురించ సాగాయి. చదివిన తెలుగు ప్రబంధ సాహిత్యం అంతా అతనిని ఆవరించ సాగింది. ఆమె . . తన కౌగిలిలో వాలినప్పుడు . . తను ఆమె సిగ్గు లొలుకుతున్న ముఖంలో ముఖం ఉంచి . . రెండు చేతులతో ఆమె నును పైన కపోలాలను మృదువుగా స్పృశిస్తూ ... తాంబూలంతో అరుణిమ పండిన ఆమె పెదవుల మీద మెత్తగా ..తియ్యగా.. ముద్దు పెట్టుకుంటే! హృదయంలో భావాలు ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే, అతనికి ఒక్కసారిగా ఒళ్ళు పులకరించింది హఠాత్తుగా చిన్నప్పటి సంఘటన జ్ఞాపకం వచ్చిందతనికి.

తనకప్పుడు పద్నాలుగేళ్లుంటాయేమొ ! తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. తాముండేది కొంచెం పల్లెటూరు. తమ యింటి కెదురుగా చిన్న అడివి లాంటి ప్రదేశం ఉండేది. దాన్నందరూ రాజాగారి దివాణం అని పిలిచేవారు ఏవో రెండు పాడుబడిన యిళ్ళు తప్ప మిగతా స్థలం అంతా చెట్లతో, తుప్పలతోను చుట్టూగోడ అంతా శిథిలమైపోయింది ఈత, తుమ్మ, వెలగ, కొబ్బరిచెట్లు విపరీతంగా ఉండేవి. వాటితో పాటు నిలువెత్తు ముళ్ళకంపలు నిండి ఉండేవి. అందులో తిరుగుతుంటే నిజంగా ఒక మహారణ్యం మధ్య ఉన్నట్లుండేది అంత పెద్ద దివాణానికి ఓ కాపలా దారుండేవాడు, నాగయ్య అని. వాడికి పెద్ద పెద్ద మీసాలుం








## తెల్లబోయిన తె. పాండిత్యం

దేవి భారీ శరీరం చూడ్డానికే మహాభయంకరంగా ఉండేవాడు చిన్న పురుగును కూడా లోపలికి రానిచ్చేవాడు కాదు అయినా ఎలాగోలా అతని కళ్ళుగప్పి తనూ, తన మిత్ర బృందం అందులో యధేచ్ఛగా విహరిస్తుండేవాళ్ళు ముఖ్యంగా సంక్రాంతి రోజుల్లో ఆ దివాణంతో తనకి చాలపని బడేది ! ఇంకా భోగి పండుగ నెల పైగా ఉండనగానే తనూ, స్నేహితులూ కలిసి ఆ దివాణంలో ఓ మూలగా ఉన్న యీతచెట్టుని ఎలాగోలా కష్టపడి కూల్చేవాళ్ళు అది నెలరోజుల్లోనూ బాగా ఎండేది ఇంకా ముళ్ళకంపలూ, చిన్న చిన్న కొమ్మలూ చాలా వాటిని ఏరి ఓ చోట భద్రంగా దాచేవాళ్ళు భోగిరోజుకు వాటన్నింటిని తమ యింటి ముందు చేర్చి పెద మంట వేసేవాళ్ళు అప్పుడు రాఘవరావుగారు తమ యింటిపక్కనే ఉండేవాళ్ళు వాళ్ళమ్మాయి సుబ్బలక్ష్మి అంతా సుబ్బులూ అని పిల్చేవాళ్ళు. సుబ్బులు తనకన్నా మూడ నాలుగేళ్ళ చిన్నది. బంధుత్వం ఏమీ లేకపోయినా వాళ్ళూ తామూ ఏవో వరసల్లో అభిమానంగా పిల్చుకునేవాళ్ళు. తను, సుబ్బులూ వాళ్ళ నాన్నను మావయ్యా అని పిల్చేవాడు సుబ్బులు తనని బావా అని పిల్చేది చక్రాల్లాంటి కళ్ళతో బొద్దుగా ముద్దుగా ఉండే సుబ్బులుకి వాళ్ళింట్లోనూ తమ యింట్లోనూ గారాబంగానే జరుగుతూండేది ముఖ్యంగా ధనుర్మాసంలో సుబ్బులు పెట్టే గొబ్బిళ్ళకు పూలు సంపాదించి పెట్టడం తన డ్యూటీ దివాణంలో ముళ్ళ గోరింట పొదలు విపరీతంగా ఉండేవి రోజూ పొద్దున్నేపోయి వాటిని కోసుకొచ్చేవాడు ■ వంకతో తన భోగిమంటకు కావలసిన సరంజామా అంతా ఓ చోట పోగేసేవాడు కూడా !

మామూలుగానే ఆ ఏడు కూడ భోగి పండగ వచ్చింది తనకు సహజంగానే భోగి మంటల వరదా ఎక్కువ ఆ రోజున ప్రతి సంవత్సరం కంటె పెద్ద భోగిమంట వెయ్యాలని ప్రయత్నం అలాగే వేసారు కూడాను దాంతో తనకు ఉత్సాహం పెచ్చు పెరిగి పోయింది అప్పటికి బాగా తెల్లారి పోయింది కొంచెం ఎండ పొడ వచ్చింది కూడ అయినా తనకు ఉత్సాహం తగ్గలేదు. మంట చిన్నదవుతూండటం చూసి మళ్ళా ఏదన్నా కంప పట్టుకొద్దామని తను పిల్లిలా

రహస్యంగా దివాణంలోకి దూరాడు. మామూలుగా ఓ పక్కగా వెళ్లితే ఏ గొడవా ఉండేది కాదు కాని అక్కడ రాజాగారి గడివాము దాని మధ్యగా జనుముకట్టలు కన్పించగానే తనకొక చిలిపి ఆలోచన వచ్చింది నెమ్మదిగా రెండు జనపకట్టలను వాములోంచి లాగడం మొదలెట్టాడు కాని ఎలా చూసాడో కాపలాదారు పెద్దగా అరిచి పట్టుకో పట్టుకో అంటూ తనవైపు పరిగెత్తు కొస్తున్నాడు. అంతే ! తను ఆ కట్టల్నక్కడే వదిలేసి కాలి సత్తువకొద్దీ పరుగెత్తి సగంపడిన గోడ మీంచి ఒక్కదూకు దూకి బయటపడాడు కాని వాడు తననొదల్లేదు అసలే తనమీద వాడికి చాల రోజుల్నుంచి గుర్రుగా ఉంది హడావిడిలో గబగబా ఎదురుగ్గా కన్పించిన తలుపు తోసుకుని లోపలికి వెళ్లి నెమ్మదిగా గడియ పెట్టేసాడు అది రాఘవయ్యగారి ఇంటికీ ప్రహరీకి మధ్యగా ఉన్న చిన్న సందు లాంటిది దాని తలుపు గడియ సాధారణంగా వేసే ఉంటుంది ఎందుకంటే దాన్ని వాళ్ల స్నానాలగది కింద ఉపయోగిస్తారు ఎందు వల్లనో అదృష్టంకొద్ది అది అప్పుడు తీసి ఉంది

"హమ్మయ్య !" అనుకొని కళ్ళు మూసుకుని పదిక్షణాలు ఆయాసం తీర్చుకుని వెనక్కు తిరిగాడు అంతే ! తన ఒళ్లంతా ఒక్కసారిగా ఎడ్రినలిన్ వ్యాపించినట్లయింది. ంతవరకూ ఎరగని ఒక కొత్త దృశ్యం !

సుబ్బులు తన వేపు వీపు పెట్టి అవతల వైపుగా వంగి ఏదో చేస్తోంది వంటిమీద నూలుపోగు లేదు తెల్లటి ఒంటిమీద నీరెండ పడి వింతగా మెరుస్తోంది విచ్చుకోబోతున్న పుష్పం, ఉప్పొంగబోతున్న యవ్వనం, కంటి కెదురుగా అలా ఉన్న సుబ్బుల్ని చూసేసరికి తనలో ఏదో మైకం ప్రవేశించి నట్లయింది. ఏదో ఏదో అనుభూతి ! ఆరాటం ! తపన ! ఏదో చేయాలి ఏమిటో సరిగా తెలీనివయసు. నెమ్మదిగా వెనగ్గా వెళ్లి గభాల్న సుబ్బులు శరీరం చుట్టూ రెండు చేతులూ బిగించి తనవైపు తిప్పుకున్నాడు. సుబ్బులు గింజుకో బోతుంటే ఎర్రగా ఉన్న ఆమె పెదవుల మీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. ఎంత తియ్యగా ఉంది ! ఏదో మత్తు ! పారవశ్యం ! ఇంతలోనే లోపల్నుంచి 'సుబ్బులూ' అని వాళ్ల అమ్మ కేక విన్పించగానే తనను గట్టిగా తోసేసి లోపలికి పరిగెత్తింది. తను వణుకుతున్న శరీరంతో, అదిరే గుండెలతో మెల్లగా గడియ తీసుకుని బయటకు వచ్చేశాడు

ఇంట్లోకొచ్చేసిన ఓ అరగంటకు స్థిమిత పడిన తర్వాత తనకు ఏదో భయం వేసింది సుబ్బులు వాళ్లింట్లో తన గురించేమి చెప్పిందో ? ఆ రోజల్లా తను భయపడుతూనే ఉన్నాడు దేవుడికి వెయ్యిదణ్ణాలు పెట్టుకున్నాడు భోగిమంటల సంబరం అంతా ఆవిరైపోయింది చివరకు తను ఆందోళన పడినట్లు ఏమీ జరగలేదు. కాని సుబ్బులు తనతో మాట్లాడ్డం, తనక్కనిపించడం మానేసింది ఆ తర్వాత కొద్దిరోజులకే ట్రాన్స్‌ఫర్ మూలంగా వాళ్లు ఊరు విడిచి పెట్టేసారు ఆ తర్వాత కొన్నిరోజులకే నాన్న హఠాత్తుగా పోవడంతో తనూ అమ్మా కూడా ఆ ఊరు వదిలేసి మావయ్య దగ్గరకు వెళ్లిపోయారు. కాని ఆ తియ్యటి తొలిముద్దు, దాని తాలూకు అనుభూతి తన నంటిపెట్టుకుని ఉన్నాయి ఇంకా తన స్మృతిలో మెదిలి అల్లరి పెడుతూనే ఉన్నాయి. అయినా దాంతోపాటు ఏదో వెలితి !

అలికిడయ్యేసరికి ఆలోచనలు చెదరి కళ్లు తెరిచాడు కామేశం మూసిన తలుపుల దగ్గర ఆమె ! రెండు చేతులూ పొత్తికడుపు దగ్గరగా, చేతుల మధ్య పాలగ్లాసుతో అపరంజి బొమ్మలా, తను చదివిన శృంగార నాయకీమణుల విలాసాలన్నీ కలబోసిన విధంగా వయ్యారంగా నిలబడి ఉంది. తన శృంగార రసాధిదేవత ! అనిమిషత్వంతో ఆమెనే చూస్తున్నాడు కామేశం పచ్చటి పసిమి ఛాయ, తీరైన అవయవ సౌందర్యం. పొందికగా కట్టిన తెల్లని చీర, తెల్లటి బ్లౌజు, రెండు చేతులకూ నిండుగా గాజులు. శ్రీకారం లాంటి చెవులకు కొంచెం పెద్ద రింగులు, ప్రావడి లాగా ! ఒక్కపిసరు పెద్దదిగా ఉందనిపించే నాసికకు ఒకపక్క మూడురాళ్ల తెల్లటి ముక్కుపుడక దాని జిగిని మించిన కళ్ల మెరుపు, వంటి నునుపు. సమమైన నుదురు మధ్యగా ఎర్రటి కళ్యాణ తిలకం, దీర్ఘమైన జడ, తెల్లని జాజులు, చెక్కిలిపై చిన్న చుక్క యవ్వనాన్ని సౌందర్యాన్ని రంగరించి, ఆభరణాలలంకరించి, దుస్తులు తొడిగి నిలబెట్టి నట్లుగా ఉంది ఆమె ముగ్ధ సౌందర్యం.

తలవంచి నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ తన దగ్గరగా వచ్చి చేయి చాచింది పాలగ్లాసుతో నవ్వు వచ్చింది కామేశానికి రోజు క్లాసులో తనను అల్లరి పెట్టిన లక్ష్మేనా ! మృదువుగా పాలగ్లాసు తీసి పక్కన పెట్టి ఆమెను తన మీదకు లాక్కుంటూ ఆమె చెవిలో ఏదో గుస గుస లాడాడు.

అతని కౌగిలిలో వాలిపోయిన ఆమె అన్నది సిగ్గుదొంతరలతో "ఇప్పుడు నేను లక్ష్మిని కాను ! నీ సుబ్బుల్నే !"



# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1982 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 6000 ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము... పోయినేడాదిలా కాక యీ ఏడు సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ **13-9-'82** సోమవారం

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. అటు తరువాత బాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **650**, రు **550** రు. **450** వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన మూడు కథలకు రు. **250** ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

- ★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
- ★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి
- ★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
- ★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
- ★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము
- ★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి.
- ★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము పోటీకి పంపిన కథలను ఏ విధమైన పరిస్థితులలోను త్రిప్పి పంపలేము.

—సం॥

## తెల్లబోయిన తె పాండిత్యం

ఆనంద పారవశ్యంతో "సుబ్బులూ !" అంటూ తమకంగా ఆమె చుబుకాన్ని ఎత్తి గాఢంగా ఆమె అధరాన్ని చుంబించాడు

సుబ్బలక్ష్మి కళ్లు అరమోద్పులయ్యాయి వివశత్వంతో

హఠాత్తుగా అతని చేతులు ఆమె చెంపల్ని వదిలేసాయి – నివ్వెరపోతూ అతని వంక చూసింది సుబ్బలక్ష్మి

"ఏమయింది ?" అతని భుజాల మీద చేతులేసి సంకోచంగా అడిగింది.

"అర్థం కావటంలేదు !" గొణిగినట్లుగా అన్నాడు.

"ఏమిటి ?" ఆందోళనగా అడిగిందామె తరచి తరచి

చివరికి "తియ్యగా లేదు ?" గొణుక్కుంటున్నట్లుగా అన్నాడు. అర్థంకాక అయోమయంగా చూసిందతని వంక

"ఏం తియ్యగాలేదు ?"

"అదే! యిప్పుడు" కొంచెం సిగ్గుపడ్డట్లు ఆగాడు ఎలాగైతేనేం లాలించి, బుజ్జగించి చివరకు అసలు సంగతి రాబట్టింది లక్ష్మి ఉరఫ్ సుబ్బులు అంతే! ఫకాలుమని నవ్వేసింది, తెరలు తెరలుగా! అలలు అలలుగా! మనోహరంగా!

మతిపోయిన వాడిలా తనవంక కళ్లప్పగించి చూస్తుండి పోయిన కామేశాన్ని చూసి అతి కష్టంమీద నవ్వాపి చెప్పింది సుబ్బులు–

"నాకు చిన్నప్పుడు తీపి అంటే వెర్రి యిష్టంగా ఉండేది ఆ రోజు పొద్దున్నే అమ్మ కొత్త పంచదార పొట్లంవిప్పి డబ్బాలో పోస్తోంది, నేనేమొ దొంగతనంగా ఓ గుప్పెడు నోట్లో పోసుకుని స్నానాల సందులోకి వచ్చేసాను, తలంటుకునే నెపంతో! ఇంతలో నువ్వొచ్చావు ..." ఈసారి సిగ్గుపడటం సుబ్బులు వంతయింది విషయం పూర్తి చేయకుండానే చివాలున అతని గుండెలో ముఖం దాచుకుంది ఎర్రబడ్డ ముఖంతో, ముంచుకొచ్చిన సిగ్గుతో!

పాపం! తన తొలి ముద్దు అనుభవంతో ఇంతవరకూ "అధరామృతం" అంటే నిజమే ననుకుంటున్న కామేశం తెలుగు పాండిత్యం తెల్లబోయింది !!

# వంటలు

## కేరట్ కుడుములు

కావలసిన పదార్థాలు :– 1కిలో కేరట్లు, అరకప్పు చక్కెర. 1 కప్పు బియ్యపు పిండి, 2 గరిటెలు పాలు.

తయారుచేసే విధానం :- కేరట్‌లను శుభ్రంగా కడిగి, పైన ఉండే తొక్కు తీసేసి ఎండుకొబ్బరి తురిమే పీటతో సన్నగా తురిమి పెట్టుకోవాలి. ఈ తురుములో రెండు గరిటెల పాలుపోసి కోరు మెత్తబడే వరకు ఉడకబెట్టాలి. నీళ్ళు పోయకూడదు. ఇది కుక్కర్‌లో ఐతే పదినిమిషాలలో ఉడుకుతుంది తరువాత దీనిని ఒక బాణలిలో వేసి అరకప్పు చక్కెర కలిపి స్టౌ మీద పెట్టి బాగా ముద్దగా అయ్యేవరకు కలియబెట్టాలి. కావలసినవారు రెండు ఏలకులు పొడిచేసి ఇందులో కలుపుకోవచ్చు.

తరువాత ఒక వెడల్పైన గిన్నెలో అరకప్పు నీళ్లు బాగా మరగనిచ్చి క్రిందకు దింపి, బియ్యపుపిండి పోసి గడ్డలు కట్టకుండా ముద్దలా అయ్యేట్లు కలిపి వుంచుకుని చేతికి కొంచెము నూనె రాసుకొని ఈ ఉడికిన పిండిలో నుంచి చిన్న నిమ్మకాయంత ఉండ తీసుకొని అరచేతిలో పెట్టుకొని కుడిచేతి వ్రేళ్లతో ఒకచిన్న గిన్నెలా తయారు చేసుకోవాలి. దీని లోపల ఒక చెంచాడు కేరట్ మిశ్రమాన్ని పెట్టి, అది బయటకు కనిపించకుండా చుట్టూరా మిలిగిన పిండితో మూసివేసి కుడుముగా తయారు చేసుకోవాలి. ఈ విధంగా తయారు చేసుకొన్న కుడుములన్నిటిని ఇడ్లీపాత్రలో సర్ది పెట్టి ఆవిరిపై పదినిమిషాలు ఉడకనిచ్చి దింపివేయాలి. కొంచెం చల్లారాక తింటే ఈ కేరట్ కుడుములు చాలా బాగుంటాయి.

– ఆర్. పద్మావతి

## పూర్ణ పూరీలు

కావలసిన వస్తువులు :– మైదాపిండి అరకేజి, పెసలు 2 గ్లాసులు, ఎండుకొబ్బరి చిప్ప 1, యాలుక్కాయలు 4, బెల్లం పావుకేజి, నూనె పావుకేజి.

చేయు విధానం :– మొదట మైదా పిండిని పూరీల పిండి లాగా ముద్దగా చేసుకోవాలి. పిండిని కలిపేటపుడు కొంచెం నూనె కాచి పోసి కలపాలి. పెసలు ఉడకబెట్టి నీళ్లన్నీ వార్చి ఒక గిన్నెలో వేసుకోవాలి. బెల్లం, వుడికించిన పెసలు కలిపి రోటిలో మెత్తగా రుబ్బుకొని, ఆ ముద్దలో ఎండు కొబ్బరి తురుము, యాలక్కాయల పొడి వేసి బాగా కలుపుకొని చిన్న సైజు వుండలుగా చేసుకోవాలి. మైదా పిండిని చిన్న చిన్న పూరీల వలె వత్తుకొని, ఒక్కొక్క పూర్ణం వుండను ఆ పూరీల పైన పెట్టి వెడల్పుగా తట్టాలి. పైన మరొక పూరీని కప్పి అంచులు కలిసేలాగా నొక్కాలి. తరువాత బాణలిలో నూనె పోసి కాగిన తర్వాత ఒక్కొక్క పూరీని వేసి రెండు వైపులా ఎర్రగా కాలిన తర్వాత తీసుకోవాలి. వేడిమీద తింటే చాలా రుచిగా వుంటాయి. నిలువ వుండవు.



## ఖామాణ డోక్లా

కావలసిన వస్తువులు : – శనగపిండి – అరకేజి, నూనె–1 కప్పు, మజ్జిగ–అరకప్పు, సోడాఉప్పు–అరచెంచా, జిలేబిరంగు సరిపడినంత.

తయారుచేయు విధము–: ఖామాణడోక్లా చేసేముందు ఒకరోజు ముందు రాత్రి పావుకిలో శనగపిండిని ¼ కిలో నీళ్లలో అరకప్పు మజ్జిగ, తగినంత ఉప్పు, వేసి కలిపి పెట్టుకొనవలెను, మరునాడు చేయబోయే ముందు కొన్ని పచ్చిమిరపకాయలు నూరి అందులో కలపాలి. ఒక వెడల్పాటి గిన్నెను తీసుకొని అందులో నీళ్లు పోసి పొయ్యిమీద పెట్టాలి. నీళ్లు బాగా మరిగిన తరువాత కలిపి పెట్టిన శనగపిండిలో 1 కప్పు నూనె, అరచెంచా సోడా వేసి బాగా కలియబెట్టాలి. కలియబెట్టు నపుడు పిండి పొంగుతుంది. వెంటనే ఒక పళ్లెములో పోసి పిండి అంతట ఒకటిగా యుండునట్లు సరిచేసి పొయ్యిమీద యున్న గిన్నెలో ఒక చిన్న గిన్నె పెట్టాలి. చిన్న గిన్నె మీద పిండి పోసిన పళ్లెము దాని మీద ఉంచాలి. పెద్ద గిన్నె మీద కొసలువద్ద ఖాళీ యుండునట్లు మూత ఉంచాలి. మూత పూర్తిగా ఉంచితే ఆవిరి నీళ్లు పిండి మీద పడి పిండి పక్కలకు ఒలికిపోతుంది ఇది ఇడ్లీ లాగ ఆవిరి మీద ఉడుకుతుంది. ఉడికిన తరువాత పళ్లెం తీసి పావుగంట చల్లారనిచ్చి తరువాత ముక్కలు కోసుకోవచ్చును.

టి. స్వప్న



# పునరపి చలనం

## కవి-ప్రసాద్




గవ్రరాజు నాకున్న ఒక్కగానొక్క స్నేహితుడు ఆ విషయం ఎన్నడగా పైకి అనకపోయినా, చెప్పటానికి నాకేమీ అభ్యంతరం లేదు! అందుకే వాడికి హైదాబాద్‌లో ఉద్యోగం వచ్చిందని తెలియగానే నేను సహజంగానే చాలా సంతోషించాను.

గవ్రరాజు వస్తూ వస్తూనే కొన్ని సమస్యల్ని పట్టుకొచ్చాడు అసలు వాడితో నాకున్న పేచీ ఇదొక్కటే, మనిషికి లౌక్యం తెలియదు "అసమర్థస్య సాధూనాం " అన్నటు గవ్రరాజులోని మంచితనమే అలా చేసిందో లేక అలా ఉండటం వల్లే వాడు మంచివాడయ్యాడో నా కిప్పటికీ అర్థం కాని విషయం అయితే గవ్రరాజు 'రాక'కు నేను 'ఆల్‌రెడీ' సంతోషించేశాను కాబట్టి, చేసేదేమీలేక పూర్వంలో లాగానే అతని సమస్యల్ని నెత్తినేసుకొన్నాను

"నాకు జీతం వచ్చేందుకు మూడునెలలు పడుతుందట!" అన్నాడు బిక్కమొగంతో.

"ఇందులో పెద్ద సమస్యేముంది. నీ కెంత కావాలంటే అంత నా దగ్గర్నుంచి వాడుకో!" అన్నాను

"అదిసరే! నాకు ముందో 'రూం' కావాలి!" అన్నాడు ఆ తర్వాత

"ఉన్నట్లుండి హైద్రాబాద్ లాటి మహా నగరంలో రూం కావాలంటే ఎట్లా ... ? సరేలేరా! వెదుకుదాం!" అన్నాను

అన్నట్లే ... మా మావయ్య స్కూటర్ అప్పుతీసుకొని, పెట్రోల్‌పోయించి(అప్పివ్వరు కదా!) ఓ శనివారం ఉదయాన్నే 'రూము వేట'కు బయలుదేరాం.

"పెళ్లయిందా ?" అని అడిగేవాడేతప్ప, 'రూమిస్తాం' అన్నవాడు ఒక్కడూ కన్పించ లేదు.

"ఇప్పుడు 'రూంకోసం' అంత అర్జంటుగా పెళ్లెక్కడ చేసికోనూ " అని మా వాడు దిగులుపడ సాగాడు

ఏమైతేనేం ఓ పదిరోజులు 'నాంపల్లి' నుంచి 'తార్నాకా' దాకా గాలిస్తే... చివరకు 'వారాసి గూడా' లో ఓ పుణ్యాత్ముడింట్లో రూముందని తెలిసింది ఇద్దరం ఆయన్ని దర్శించి రూమర్థించాం.

ఇంటాయన పెట్టిన ప్రతి కండిషన్‌కూ ...మా వాడు తల ఊపాడు. మొహమాటం

లేకుండా చెప్పాలంటే, బలవంతంగా తల ఊపించాను

ఆ తర్వాత తీరిగ్గా ఆయన తన కష్టాలన్నీ ఏకరువు పెట్టసాగాడు "తాను బీపి ఎక్కువ మనిషట! ఎక్కడలేని డబ్బూ వైద్యానికే చాలక యిల్లంతా అద్దెకిచ్చి తనూ, ముసలావిడా బయట వరండాలో ఉంటున్నార్ట మరంచేత అద్దెడబ్బులు ఠంచనుగా ఫస్టుకల్లా యిచ్చేయాల్ట!"

అంతా విని సానుభూతి చూపుతూ, "అదీ మంచిదేలెండి! హై బీ పీ వాళ్లు బయటుండడమే మంచిది!" అన్నాడు గవ్రరాజు

పాపం! గవ్రరాజుకి నిజంగానే జోకు వెయ్యడం రాదు కాని ఆ విషయం ఆయనకు తెలియకపోవడం వలన మేము శలవు పుచ్చుకోవాల్సి వచ్చింది

చివరికెలా అయితేనేం అష్టకష్టాలంటారే అవేవోపడి, గవ్రరాజును బర్కత్ పురాలో "ఓ రూము వాణ్ని" చేశాను

కానీ పదిహేను రోజులన్నా కూడా కాకుండానే, గవ్రరాజు పరాసరి మా ఆఫీస్ కొచ్చేసి, 'రూం మార్చెయ్యాల'న్నాడు.

నేను ముందు కొంచెం విస్తుపోయాను. ఆ తర్వాత మరికొంచెం కలవరపడ్డాను

"ఇంతకీ నీకారూంలో ఏం వచ్చలేదు ?" నిలదీశాను వాడ్ని

"ఆ యింటివాళ్లకున్న ఒకే ఒక కుక్క రాత్రింబవళ్లూ అరుస్తూ ఉంటుందట! ఈగను చూసినా ఏనుగును చూసినా, అది అరవకుండా ఉండలేదట. అందుకని తనకు ప్రశాంతంగా ఉండే మరో రూం చూసి పెట్టాట!" కొంచెం బతిమిలాడుతున్నట్లుగానే అన్నాడు

తప్పేదేముంది ? మళ్లీ స్కూటర్ టైర్లరిగేలా తిరిగి ఇంకో రూం చూసి పెట్టాను

నెలరోజులు కాగానే మళ్లీ పాతపాటే మొదలుపెట్టాడు

"ఈ సారేం వచ్చిందన్నాను ?"

"ఆ ఇంటావిడకూ, అద్దెకున్న మరో కళ్లకూ, ఏవో తగూలున్నాయట దాంతో అస్తమానమూ, వాళ్లు పోట్లాడకొంటూ ఉంటారు వాళ్ల పోట్లాటలేమోగానీ మధ్యలో నేను చచ్చిపోతున్నాను! ఒరేయ్! నీకు పుణ్యం ఉంటుంది — నా కింకో రూం చూసిపెట్టరా!" నా చేతులు పట్టుకొన్నాడు

మొత్తంమీద గవ్రరాజు కోసం నేనలా .. అలా చాలాసార్లు కష్టపడాల్సివచ్చింది. ఓ సారి . . పక్కవాళ్ల రేడియో బ్రాండ్ మంచిది కాదనీ, అది ఎప్పుడూ మోగుతూంటుందని, మరోసారి మరోటనీ . . అలా గవ్రరాజు హైదరాబాద్ వచ్చిన ఎనిమిది నెలల్లోనూ, అయిదు రూముల్ని మార్చేశాడు.

ఉన్నట్లుండి ఓ రోజున మిట్టమధ్యాహ్నం చెమటలు కార్చుకుంటూ మా ఆఫీసుకు వచ్చాడు గవ్రరాజు

కాసేపు ఆ మాటా ... ఈ మాటా మాట్లాడి చివరికి నేను భయపడినట్లుగానే, "రూం ఖాళీ చెయ్యాలిరా" అంటూ నసిగాడు

నాకు నిజంగానే కోపం వచ్చింది.

కాకపోతే యీసారి వాడికి రూం అక్కర్లేదట! ఓ ఫామిలీ పోర్షన కావాలట! దానికి కారణం ఇంకోనెల రోజుల్లో 'వాడి పెళ్ళికి ముహూర్తం నిశ్చయం కావడమే! గవ్రరాజుకు పెళ్లని తెలియగానే నాకు చాలా ఆనందం వేసింది కంగ్రాచ్యులేషన్స్ చెప్పాను దాంతోపాటే మొహమాటం వదిలిపెట్టి, "ఇదివరలో రూములు మార్చినట్లు మళీ . మళ్లీ ఫామిలీ పోర్షన్లు కూడా మారిస్తే యిక నావల్ల కాద"ని తెగేసి చెప్పేసాను

గవ్రరాజు కొంచెం చిన్నబుచ్చుకున్నప్పటికీ తలూపాడు

మొత్తానికి పెళి అయిన పదహారు రోజులకల్లా, ఓ శుభదినాన, వాడిని సతీ సమేతంగా ఓ మంచి పోర్షన్లో దింపి నేను చేతులు దులుపుకొన్నాను

తర్వాత వాడ్ని చూసి రావాలనుకొంటూ నే ... కొన్నాళ్లు ఆఫీసులో పని ఒత్తిడివల్ల, మరికొన్నాళ్లు మా మావయ్య కూతురి పెళ్ళి హడావుడితోనూ కలవడానికి వీలుపడలేదు

అయితే ఒకరోజు నల్లకుంట కూరల మార్కెట్‌లో గవ్రరాజే యాదృచ్ఛికంగా కలిపించాడు గడ్డం పెరిగి మనిషి నీరసంగా కన్పిస్తున్నాడు

సైకిల్ మీద నుంచి దిగి పలుకరించాడు. వాడి అవతారం చూసి నేను కొద్దిగా కంగారు పడ్డాను

"ఏమిటలా ఉన్నావ్ ?" అన్నాను.

మాట్లాడలేదు వాడు.

"సంగతేమిట"ని రెట్టించాను

"పదిరోజులుగా మరో ఇల్లు కోసం

# పునరపి చలనం

వెదుకుతున్నాను! నీ దగ్గరకొచ్చి ఈ విషయం చెప్పడానికి నాకు మొహం చెల్లలేదు నిజంగా ఇళ్ళు దొరకడం చాలా కష్టంగా ఉంది'' అంటూ చాలా ఫీలవుతూ కన్నీళ్ళు పెట్టుకొన్నాడు గవర్రాజు

చెప్పొద్దూ! నాకు మహా చిరాకేసింది ఇక వీణ్ని ▪ దేవుడు కూడా మార్చలేడు అనుకున్నాను అయినా సహజమయిన కుతూహలం ఆపుకోలేక ''ఈసారేమయింది?'' అడిగాను వాణ్ణి!

వాడు ఒక్క క్షణం ఆగి ''మా ఇంటాయనే ఖాళీ చెయ్యమన్నాడు!'' అన్నాడు

''ఓహో రివర్సయిందే!'' వాడి మాటలకు ఆశ్చర్యపోతూ, నాకు తెలియకుండానే పైకి అనేశాను

వాడేం మాట్లాడలేదు

''ఏం? ఎందుకనిట?'' కూపీ తీయబోయాను.

''ఆఁ.. ఏంలేదు! కారణమేమయినా ఈ నెలాఖర్లోపుగా ఖాళీ చెయ్యాలి! ఎక్కడన్నా నీకు తెలిసిన పోర్షన్నుంటే చెప్పు! మళ్ళీ ఆఫీస్‌లో కలుస్తాను!'' అంటూ హడావిడిగా వెళ్ళిపోబోయాడు

వాడి భుజం పట్టుకొని ఆః ''అసలిప్పుడు ఇల్లెందుకు ఖాళీ చెయ్యాల్సి వచ్చిందో చెప్పు! మళ్ళీ చూసే పోర్షన్‌కు ఆ ఇబ్బంది ఉండకుండా చూడాలి కదా!'' విసుగ్గా అడిగాను

ఇక చెప్పక తప్పలేదు గవర్రాజుకి

నాకు మొహం చూపించలేక గామోను ఎదురుగా ఉన్న సినిమా పోస్టర్‌ను చూస్తూ ''ఏంలేదురా మీ చెల్లెలికి కాస్త సినిమా పాటలంటే యిష్టం, అప్పుడప్పుడూ ఆమె తీసే కూనిరాగాలకు మా ఇంటి ఓనర్‌కు హార్టెటాక్ వచ్చిందట! ఇక తాను ఆ 'రాగాల్ని' భరించలేననీ, వెంటనే ఇల్లు ఖాళీచెసెయ్యమనీ ఖచ్చితంగా చెప్పేసాడు!'' అని సైకిలెక్కాడు గవర్రాజు.

వాడి మాటలకు అదిరిపడ్డాను

మరోసారి కష్టపడి, ఏలాగోలా ప్రస్తుతం ఉన్న ఇంటి ఓనర్ని కాపాడగలనేమో గానీ . మరి గవర్రాజు...ఎప్పుడూ ప్రశాంతతకోసం ఆరాటపడే గవర్రాజుని నే నెలా కాపాడగలను? పాపం. పూర్ ఫెలో!!

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**మేధావుల వలస :**

ఆ మధ్య అమెరికా ప్రభుత్వం విమాన విభాగములో పని చేసే నా మిత్రుని కుమారుడొకడు గొప్ప విజ్ఞాన శాస్త్రజ్ఞుడు ఇక్కడికి వచ్చాడు. మీరు ఇంత గొప్పవారు కదా, మన దేశానికే మీ మేధ ఉపయోగపడితే ఎంత బాగుంటుంది? అని అన్నాను నా మాటలు శ్రద్ధగా విన్నాడు ఆయన అంతకన్నా వినయంగా, "మన దేశములో అమెరికాలో ఇచ్చినంత జీతం అక్కర లేదు పరిశోధనకు అవకాశమిస్తే చాలును వస్తామన్నాము చాలమంది ఇక్కడ పరిశోధనలో కూడా రాజకీయాలే ఎక్కువగా వున్నాయి అమెరికాలో ఆ బాధ లేదు పై స్థాయి మేధావులలో ఎవరు ఏ దేశం వారో, ఏ మతం వారో కూడా ఎవరికీ తెలీదు వారికి కావలసింది పని, పని పట్ల చిత్తశుద్ధి, మరి పని చేసేవారికి ఇంతకన్నా మంచి అవకాశం ఏం కావాలి?" అన్నాడు ఆ మేధావి జులై 29 వ తేదీన ఇరాన్ కాన్సలేట్ కార్యాలయం ముందు మూగిన మన యువ డాక్టర్లను చూస్తే నాకు ఆ మేధావి మాటలు జ్ఞాపకం వచ్చాయి ఈ డాక్టర్లలో కొందరు ధన సంపాదనకు, బతకడానికి విదేశాలకు వెళ్లదలచిన వారైతే, మరి కొందరు వైద్య శాస్త్రంలో ఏవో సాధిద్దామని ఉత్సాహపడేవారు ముప్పయి ఐదేండ్ల స్వతంత్ర భారతములో పొట్టకూ, పరిశోధనకూ అవకాశం లేదంటే, ఎవరు బాధ్యులు? ప్రభుత్వమని ప్రతివారూ ఆక్షేపించేవారే అలాటి ప్రభుత్వాన్ని ఎన్నుకున్న మనకు బాధ్యత లేదా? ఉంది కాని వోట్లు వేసే వాళ్లకు లేదు అంతవరకు డాక్టర్లవే కాదు, మరో వృత్తి వారికీ ఇదే గతి రాష్ట్రములో దాదాపు పదివేల మంది డాక్టర్ల అవసరం వుందని ఆరోగ్య వైద్య శాఖ లెక్కలను బట్టి తెలుసుకోవచ్చు మరి ఈరాన్ కాన్సలేట్ కార్యాలయం ముందు ఈ గుంపేమిటి? ఉంటుంది మరి! రాష్ట్రం ఆస్పత్రులలోని ఖాళీలు పూడితేనా? ఫస్టు క్లాసులో ర్యాంకులో ప్యాసయిన డాక్టర్లను కూడా ఈ పబ్లిక్‌సర్వీస్ కమిషన్ వైకుంఠ ద్వారమెందుకో? బాగుంది ర్యాంకులో వచ్చిన ఇంటర్ మున్నగు పరీక్షలలో ఉత్తీర్ణులైనవారిపై నమ్మకం లేక ఎంట్రెన్స్ అనే కరోడ్‌గిరి గేట్ ఎందుకూ అంటే విశ్వవిద్యాలయ పరీక్షల్లో అవినీతి వుండవచ్చుగనుక తద్వారా ప్యాసయిన వారిని వడపోస్తే విగ్గు తేలుతుందని ఈ ఎంట్రెన్స్ జల్లెడ. ఈ జల్లెళ్లలో కూడా కొన్ని పందు గొందులున్నాయని వాటిలో ఇరుక్కొన్న వారు జల్లెళ్ల రంధ్రాల గుండా పడి పోరని అంటున్నారే? వారంతా గిట్టని వారు. నిత్య శంకితులు. ఏమైనా, జులై 29 వ ఈరాన్ కాన్సలేట్ కార్యాలయానికి దాదాపు వేయి మంది డాక్టర్లు దరఖాస్తులు అందజేశారట. ఈరాన్ నుంచి ఒక నిపుణుల సంఘం భారత దేశంలో ఈ డాక్టర్లను పరీక్షించి ఎంపిక చేస్తుంది రాష్ట్ర ప్రభుత్వం రాజకీయాలలోనే కొట్టుమిట్టాడక ఈ యువ వైద్య మేధావులకు రాష్ట్రంలో నో, దేశంలోనే పదవకాశం కల్పించి దేశం ఈ విషయంలో వట్టి పోకుండా చూడడం అవసరం.

**లక్ష ఆపరేషన్ల శివారెడ్డి :**

విఖ్యాత నేత్రవైద్య నిపుణుడు డాక్టర్ పి శివారెడ్డి వైద్య రంగ చరిత్రలో శాశ్వత స్థానం పొందారు లక్ష కంటి ఆపరేషన్లు చేసి కర్నూలు జిల్లా ఆదవానిలో గడచిన జూన్ 21 వ తేదీన నిర్వహించిన నేత్ర చికిత్సా శిబిరంలో ఆయన లక్ష లక్ష్యాన్ని అందుకున్నాడు డాక్టర్ శివారెడ్డి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నేత్ర వైద్య విషయక సలహాదారు. భారత రాష్ట్రపతికి గౌరవ నేత్ర వైద్యులు. ఆయన మద్రాసు విగ్మోరులో వున్న ప్రభుత్వ కంటి ఆస్పత్రిలో హవుస్ సర్జనుగా 1947 లో తొలి కంటి ఆపరేషను చేశారు అప్పటినుండి కంటి ఆపరేషన్లు చేస్తూ గడచిన ఏడు సంవత్సరాలు దాదాపు 40 వేల ఆపరేషన్లు చేశారు ఈ ఆపరేషన్లన్నీ సరోజినీదేవి నేత్ర వైద్యశాల నిర్వహించిన శిబిరాలలో జరిగాయి ఆయన మద్రాసు, కర్నూలు, నంద్యాల విశాఖపట్నం హైదరాబాద్‌లలో వివిధ పదవులు నిర్వహించారు, చివరగా సరోజినీదేవి నేత్రవైద్యశాలలో 12 సంవత్సరాలు సూపరింటెండెంట్‌గా వుండి 1975 లో ఉపకారం వేతనం పొందారు ప్రస్తుతం 62 సంవత్సరాల వయస్సున్నా వివిధ నేత్ర వైద్య కార్యక్రమాలలో పాల్గొంటూనే వున్నారు బ్రిటిష్ ప్రభుత్వం వారి రాయల్ కామన్ వెల్త్ అంధ చికిత్సా సంఘం సహాయంతో జరిగే కంటి పొరల చికిత్సా ప్రణాళికకు డైరెక్టరుగా వున్నారు గార్డియా అనే నేత్ర చికిత్సా నేత్ర రోగ క్రిమిని కనిపెట్టడంతో ఆయనకు 'గార్డియారెడ్డి' అనే మారు పేరు వచ్చింది 1966 లో మ్యూనిచ్‌లో జరిగిన అంతర్జాతీయ నేత్ర వైద్య శాస్త్ర కాంగ్రెస్‌లో ఆయన ఈ క్రిమి విషయమై ఒక పరిశోధన వ్యాసం చదివారు దేశ విదేశ వైద్య పత్రికలకు ఆయన 150 పరిశోధన వ్యాసాలు వ్రాశారు వైద్య విద్యార్థుల కోసం పెక్కు పాఠ్య పుస్తకాలు రచించారు, భారత ప్రభుత్వమూ, వివిధసంస్థలూ ఆయనను సత్కరించాయి. భారత ప్రభుత్వం ఆయనను 1974 లో పద్మశ్రీ బిరుదంతోను 1973 లో పద్మభూషణ బిరుదంతోను సన్మానించింది ఆయన రోగులకు, సంఘానికి చేసిన సేవకు గుర్తింపుగా డాక్టర్ రాయ్ జాతీయఅవార్డు ఇటీవల పొందారు



ఆయన లక్ష నేత్ర శస్త్ర చికిత్సలు చేయడం అసమాన విజయమని ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రశంసించింది.

**నవంబర్ నుంచి జిల్లా స్థాయిలో తెలుగు :**

అధికారభాషా సంఘం అధ్యక్షుడు డాక్టర్ సి. నారాయణరెడ్డి ఆగస్టు 5వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ, వచ్చే నవంబరు 1వ తేదీ నుంచి రాష్ట్ర సచివాలయ శాఖలన్నీ జిల్లా స్థాయి ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులో జరుపడానికి నిర్ణయం జరిగిందని అన్నారు. గడచిన సంవత్సర కాలంలో అధికారభాషా సంఘం చేసిన కృషిని ఆయన వివరించారు. జిల్లా తాలూకా స్థాయిలలోని అధికారులు, ఉద్యోగులు తెలుగు అమలుపట్ల ఎంతో విశ్వాసంతోను, దీక్షతోనూ వున్నారట. ఎంతో ఉత్సాహం ప్రకటించారని ఆయన తెలిపారు. గడచిన సంవత్సరంలో రాష్ట్రంలోని వివిధ కార్యాలయాలకు రెండు వేల తెలుగు టైప్ రైటర్లు సరఫరా అయ్యాయని ఆయన తెలిపారు. ఆయన తెలిపిన మరి కొన్ని వివరాలివి: కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సంబంధించిన యాభై చట్టాల తెలుగు అనువాదం పూర్తయింది. దీనిని ముద్రించాలి. మూప్పై శాఖల పదకోశాలు పూర్తయాయి. ఉద్యోగుల దైనందిన కార్య నిర్వహణలో వాడే వేయి పదాల "కార్యాలయ పదావళి" సిద్ధమయింది. తెలుగు అకాడెమీ దీనిని ముద్రిస్తున్నది. కర్నూలు, హైదరాబాదు ప్రభుత్వ ముద్రణాలయాలలో వాడకం లేక వున్న ఎనిమిది తెలుగు లైనో కంపోజింగు యంత్రాలకు ఇటీవలనే ప్రారంభోత్సవం జరిగింది. తెలుగు అమలు పర్యవేక్షణకు ముగ్గురు ఇన్‌స్పెక్టర్లు కావాలని అధికారభాషా సంఘం ప్రభుత్వాన్ని కోరిందని, దక్షిణ రాష్ట్రాల అధికార భాషా సమ్మేళనం జరగాలని, ప్రాచ్యభాషా పట్టభద్రులకు ఉద్యోగావకాశాలు కల్పించాలని, అధికార భాషా వ్యాప్తికి ప్రోత్సాహక పథకాలు రూపొందించాలని, తెలుగు టైపిస్టులను నియమించాలని అధికార భాషాసంఘం రాష్ట్రప్రభుత్వానికి సిఫార్సు చేసిందని డాక్టర్ రెడ్డి అన్నారు. ప్రతి సంవత్సరం మే 14వ అధికార భాషా దినోత్సవం జరపాలని సూచించినట్లు ఆయన తెలిపారు. ఇంతకాలంగా తెలుగు ఎందుకు పూర్తిగా అమలుకావడంలేదని ఒకరు ప్రశ్నించగా, "ఎన్ని ఫైళ్లు? ఎన్ని పైళ్లు?" అని డాక్టర్ రెడ్డి చలోక్తి విసిరారు.

**ఉ ప శ్రు తి :**

కృష్ణాష్టకం చెబుతూ "కోటి జన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి" అని చివరి శ్లోకార్థం చెప్పాను మనమడు ఉదయనునికి. వాడు రెండేళ్ల వాడు. ఎన్నిసార్లు చెప్పినా, స్మరణేన అనడానికి మారు "మరణేన వినశ్యతి" అంటున్నాడు. నేను విసుక్కున్నాను. ఎందుకు విసుక్కుంటారు సార్? పాపడు అంటున్నదే కరెక్టు. మరణంతో అన్ని పాపాలూ మాసుకుపోతున్నాయి గదండీ! — అన్నారు మా గొడవ చూస్తున్న మరొక పండితులు.



## శ్రీ దేవి

శ్రీదేవి ముఖ చిత్రం ఆకర్షణంతంగా ఉంది.

—ఎస్. సుజన, ఎస్. వెంకటేశ్వర్లు (మహబూబాబాద్)

* * *

శ్రీదేవి ముఖచిత్రం చాల బాగుంది. ఇందు—ఆఫీసరు ఆదర్మరావు, ఐ లవ్ యూ కథలు నచ్చాయి.

ఆలమూరు భావసు డేనియల్, సుధాకరు శామ్యూల్, డేవిడ్ రాజా (విశాఖపట్టణము)

## మధురాతి మధురం

అట్టపై "శ్రీదేవి" చిత్రము మధురాతి మధురముగా ఉన్నది.

ఎ. వి. వి. ఎస్. ఎస్. వి. ప్రసాద్ (గాజువాక)

## మృదువైన శైలి

'వసుంధర' గారి 'మార్పు' కథ మాకు నచ్చింది. దిగువ స్థాయిలో ఉన్నవారు తమ కంటే కొంచెం పై స్థాయికి ఎదిగితే వారి స్టేటస్‌తో బాటుగా మనస్సు కూడా మారుతుందనుకొంటారు 'వీర భద్రం' లాంటివాళ్లు. రచయిత్రి శైలి మృదువుగా, విశ్లేషించదగిందిగా ఉంది.

వేమూరి ప్రదీప్‌కుమార్, సాయి ప్రసాద్ (చీరాల)

## గొప్పగా ఉంది

'మేనక' ముఖ చిత్రం ఆకర్షనీయంగా వుంది. సభ్యతా, సంస్కారాలకు, సాంప్రదాయానికి ప్రతి రూపంగా వుండే ఇటువంటి ముఖ చిత్రం వేసినం దుకు మీకు మా ధన్యవాదాలు. 'టు మేడమ్స్ విత్ లవ్' కథ అన్నిటిలోకి గొప్పగా వుంది. 'ప్రమోద' లాంటివారు ప్రతి స్కూల్లోనూ వుంటారు. కాని వాళ్ళను బుజ్జగించి, నచ్చచెప్పి మంచి మార్గంలోకి తీసుకొని రావటం 'సరిత' లాంటి టీచర్లున్నప్పుడే సాధ్యమవుతుంది. ఇంత మంచి కథను ప్రచురించిన మీకు మా హృదయపూర్వకమైన అభినందనలు.

జి. వి. కృష్ణారావు, యస్. ప్రభాకరరావు, విశ్వేశ్వరరావు (రాజమండ్రి)

## స్పష్టంగా చెప్పాలి

'వక్రరేఖ' అనే కథ చదివాను. రచయిత (త్రి) ఈ కథలో—"ఆమెకు నాకు బంధం ఏర్పడి మూడు నెలలు మాత్రమే అయింది. అయినా ఆమెతో మూడు యుగాలుగా కలిసి వున్నట్టు అని పించింది." అని చెప్పారు. అయితే 'మోహిని' గారు మనస్సులో అనుకున్న భావం ఒకటయితే, కథలో వ్యక్తీకరించింది వేరయింది. ఎందుకంటే పై మాటలను బట్టి—'మోహిని'గారు వారు అంత ఆనందాన్ని అనుభవించారు. కాలం క్షణాలుగా గడిచి పోయాయ్ అని చెప్పాలనుకుని, మూడు యుగాలుగా గల్సి వున్నట్టుంది అన్నారు. అంటే అంతభారంగా, అంత కష్టంగా వుందని అర్థమా ?

రచయిత తాను చెప్పదల్చుకున్న విషయాన్ని స్పష్టంగా చెప్పాలి గాని, అనుకున్న దొకటి, వ్యక్తీ కరించే దొకటి కాకూడదని గ్రహించవల్సిందిగా కోరుతున్నాను.

ఆర్. కృష్ణ (గుంటూరు)

## సాంప్రదాయం

నటి శ్రీమతి మేనకగారి ముఖ చిత్రం అత్యంత అందంగా ఉంది. తెలుగు సాంప్రదాయంగ వున్న ముఖ చిత్రం ప్రచురించినందులకు మీకు మా జోహార్లు.

పువ్వుల సాంబమూర్తి, పువ్వుల జోగారావు (బైపల్లి)

## జీవిత చరిత్రలు

మన జాతి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం ప్రాణ త్యాగం చేసిన భగత్‌సింగ్, చంద్రశేఖర అజాద్‌ల వంటివారుల జీవిత చరిత్రలను ప్రచురించమని ప్రార్థన.

చలమసెట్టి మల్లికార్జునరావు (సీతంపేట)

## హీరోల చిత్రాలు

మీరు అట్టమీద అనవసరమైన తారల చిత్రాలను ముద్రించుచున్నారు. ఇది ఒక విధముగా చూస్తే బాధపడుచున్నాను. మీరు ఇక మీదట హీరోల చిత్రాలు ముద్రించవలెను. తదుపరి పంచికలో "జయసుధ" అట్టమీద బొమ్మగా ముద్రించ కోరుచున్నాను.

ఎమ్. ఖాదర్ షరీఫ్ (మదనపల్లి)

## విశిష్టమైన అర్థం

"గురివింద" కథ చాలా బాగుంది. విశిష్టమైన అర్థంతో రచించిన అపర్ణగారికి నా ధన్యవాదాలు:

బొహరా నాగభూషణరావు (సీతానగరము)

## నిండు పున్నమి వెన్నెల

ఎక్కువ కథలతో మా ఆంధ్ర సచిత్ర వార పత్రిక నిండు పున్నమి వెన్నెలగా వెలుగొందుతూంది.

ఆకెళ్ళ సుబ్బారావు (కందికుప్ప)

## ఎక్కువ కథలు

మేనక ముఖ చిత్రం ఆకర్షనీయం....కథలు ఎక్కువ ప్రచురించాలి. సీరియల్స్ తగ్గించండి.

పంతం నెహ్రూ (గెద్దనాపల్లి)

## ఆసక్తి – ఆతృత

'స్వప్నసుందరి' (శ్రీదేవి) ముఖచిత్రంతో వెలువడిన ఈ వారంపత్రిక చాలా ఆకర్షనీయంగా వుంది. కథలకు మీరు ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నందులకు మా ధన్యవాదములు. క్రొత్త సీరియల్ గూర్చి ఆసక్తిగా, ఆతృతతో ఎదురు చూస్తున్నాము.

ఎమ్. వి. నరసింహమూర్తి, సరళ కుమారి (ఆముదాలవలస)

## శృంగారం

"ఐ లవ్ యూ" అను కథ చాలా శృంగారంగా ఉంది. మాకు నచ్చినది. ఆ రచించిన కాకాని కమల గార్కి వేయి ధన్యవాదాలు..

పీర్ అహమ్మద్ (పెదదొడ్డిగల్లు)



## ఉత్తరాలు

### నిరంకుశాః కవయః

"శర్మ బావ—ఇళ్ళ వేట" కథ సున్నితమైన హాస్య రసాన్ని అందించినది. కాని "హైదరాబాద్ ట్రాన్స్‌ఫరై వచ్చిన ప్రతీ వెధవా చిక్కడపల్లిలో ఉందామనే అనుకుంటాడు" అని హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫరై వచ్చిన ప్రతి వాడినీ వెధవ చేయుట వలన "నిరంకుశాః కవయః" అను లోకోక్తి ప్రకారం రచయిత కౌండిన్యసగారి నిరంకుశత్వ ధోరణితో పాటు అసభ్యత కూడా వ్యక్తమవుతోంది. కావున ఇటువంటి మాటలు ఇకపై వ్రాయవద్దని నా మనవి.

చామర్తి శ్రీనివాస గోపాలరావు—భాషా ప్రవీణ
(చింతలూరు)



ఇటీవల గోవాలోని సలౌలి ఇరిగేషన్ ప్రోజెక్టులో జరిగిన బాల బాలికల ఫాన్సీడ్రెస్ పోటీలో 'హిట్లర్ టీచర్' వేషమునకు బహుమతి పొందిన చిరంజీవి జీడిగుంట రవికృష్ణ.

### సహజత్వం

సంధియుగం, గిల్టీ కథలు నాకు నచ్చాయి. చిన్నప్పట్నుంచి తల్లీతండ్రి తనే అయి పెంచి పెద్దచేసి, ఇంతవాణ్ని చేసిన తండ్రి చివరి కోర్కెను కూడా మరచిపోయి, చివరకు జ్ఞాపకం వచ్చినా కూడా పిండప్రదానం చేయలేక పోయాడు. సంధి యుగం కథలో కృష్ణ. సహజత్వాన్ని సంతరించుకుందీ కథ.

తమలోపాల్ని నిర్భయంగా చెప్పుకునే వారెవరు ఈ సమాజంలో? శారద అలా కాక తన లోపాన్ని తనకు కాబోయే భర్తకు ఉత్తరం ద్వారా తెలిపి తన నిజాయితీని నిరూపించుకుంది. కాని ఆమె భర్త పంకజరావు మాత్రం తన లోపాన్ని కప్పిపుచ్చాడు. వో ఆదర్శవాదిగా పంకజరావు, శారద మనసులో ముద్రవేసుకున్నాడు. పంకజరావు కథలో చివరకు గిల్టీగా ఫీలయ్యే బదులు తనలో ఉన్న లోపాన్ని చెప్పి ఉంటే కథ మరింతగా రక్తి కట్టేది.

కడియాల చంద్రుడు (మహబూబ్‌నగర్)

### మనసు కథ

సీరియల్ మనసు కథ చాల బాగుంది.

బలివాడ రామారావు, జ్యోతి కుమార్ కాంత్
(ధన్‌బాద్)

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు సబ్బు- ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.

Imageads-M-1564





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

